# 2

## ఆంధ్రభాషాభ్యుదయము*

ఆంధ్రభాషాభ్యుదయసాధనము విషయమున కాకినాడ విద్యార్థిబృందము వ్యగ్రోత్సాహముగలదై యున్నదనుట ప్రతియాంధ్రునకు నత్యంత సంతోషకరమైన విషయము. ఇప్పటి విద్యార్థులే భావి పౌరులుగదా. కావున నిప్పటినుండియు వారు చూపుచున్న యుత్సాహము ఆంధ్రుల యచిరాభ్యుదయమునకు శుభచిహ్నమనుటకు సందేహము లేదు. ఈ యుత్సాహముతో నాంధ్రరాష్ట్రమునేగాక సర్వతోముఖమగు నాంధ్రభాషాభ్యుదయమును వీరు సాధింపఁగలరు. వస్తుపరిశోధనావ్యగ్రుఁడగు ప్రతివాఁడును విద్యార్థియే. నేను నట్టివాఁడనే కావున నీసమయమున నేఁ జేయదగిన దేమనఁగా నెచ్చెటచ్చటనున్న యాంధ్రులనైనను ఒక్క సంఘముగాఁ జేర్చి బంధించు ప్రేమపాశంబనఁ దగిన యీ మాతృభాష స్వరూపసౌందర్యములనుగూర్చియు, తదభ్యుదయక్రమమును గూర్చియు నాకుఁ గలిగిన భావములను వెల్లడించి యీ భాషామతల్లి పూజ సేయుటయే.

కాని భాషాపరిశీలనము సారస్వత విమర్శనమువలె నంత రసప్రసారములతోఁగూడినది కాదు. కొంతవఱకు చప్పిడి విషయమనవచ్చును. కవితామృతమన్ననో ఆ యా కవుల భావనాపటిమానుసారముగా ననేకరుచులతో నత్యంతాస్వాద్యమై యుండునుగదా—

* కాకినాడ కాలేజీ విద్యార్థులు సలిపిన ఆంధ్రభాషాభ్యుదయోత్సవ సందర్భమునఁ జెప్పిన యుపన్యాసము.

"చటులకవిత్వతత్త్వపటుసంపద యొక్కరిసొమ్ముగాదు భా
రతిదయ సౌధవార్ధి కవిరాజులమానసముల్ ఘటమ్ములా
యతముకొలంది లబ్ధమగు నయ్యమృతమ్ము"

అని అబ్బయామాత్యుఁడు చెప్పియేయున్నాఁడు.

కాని సారత్వముకూడ వాఙ్మయమే. అదియు భాషా స్వరూపమే. ఈ వాఙ్మయాదర్శము నాశ్రయించియే, అనఁగా సారస్వతస్వరూపము దానియందు ప్రతిఫలించినది గనుకనే ఆయా మహాపురుషులయొక్కయు, జాతులయొక్కయు జీవిత చరిత్రములు చిరస్థాయులగుచున్నవి. దీనినే దండ్యాచార్యులిట్లు చెప్పినాఁడు.

"ఆదిరాజయశోబింబమాదర్శం ప్రాప్య వాఙ్మయం
తేషామసన్నిధానేపి న స్వయది పశ్య నశ్యతి" అని.

అనఁగా అదిరాజుల యశోబింబము వాఙ్మయాదర్శమున నొకసారి ప్రతిఫలించెనా, అది కాలగతమై యెదుట లేకున్నను ఈ కాలమునందలి ఛాయాప్రతిబింబమువలె (*Photograph*) స్థిరమైయుండునేగాని నశింపదనుట. కావున నీ వాఙ్మయాదర్శము సామాన్యపుటద్దమువంటిది గాక నేటి కాలపు ఛాయాబింబ గ్రహణయంత్రమువంటిదని చెప్పినాఁడన్నమాట. ఆతని కాలమున వాస్తవముగా ఛాయాబింబ గ్రహణసాధనములు లేవుగాని యున్నచో నా శ్లోకభావము నింతగా మనమానందింపలేక పోయెడివారము. వాస్తవముగా నాయాకాలములందలి రాజుల యశోబింబమేకాదు,

ఆయా జనులయొక్కయు, జాతులయొక్కయు జీవిత చరిత్రము గూడ నా భాషావాఙ్మయాదర్శమునఁ బ్రతిఫలించి యనశ్వరంబై యుండునని యాతఁడు చెప్పియుండవలసినది. పరిశీలించినచో వాఙ్మయమనునది ఆయా సంఘముయొక్క, జాతులయొక్క జీవితమునకు, జీవితాదర్శములకుఁ బ్రతిబింబముగాక మరేమి? చరిత్ర-చరిత్రగ్రంథములును ఆయా దేశములందప్పుడప్పుడు సంభవించు బాహ్యాసంఘటన (*Events*) లను గూర్చి చెప్పుచుండ వాఙ్మయ మనున దాయాసంఘటనలకు మూలకారణంబైన ఆయాకాలపు జనుల భావప్రవాహమునే వ్యక్తీకరింపఁగలదని చెప్పవలసియున్నది. ఛాసర్ కాలమునాటి ఆంగ్లవాఙ్మయము, ఎలిజబెత్ కాలమునాటి ఆంగ్లవాఙ్మయము, పోప్ జాన్‌సన్ కవులనాటి వాఙ్మయము, బైరన్, షెల్లీ మొదలగు కవులనాటి వాఙ్మయము, ప్రకృతిశాస్త్రయుగమని చెప్పెడి యిటీవలి టెనిసిన్ తరువాతి కాలపు టాంగ్ల వాఙ్మయము, ఆయా కాలపు టాంగ్ల జీవిత చరిత్రను తేలుపుటలేదా? షేక్‌స్పియర్, స్కాట్‌ల చరిత్రాత్మక నాటకములు నవలలు అప్పటి చరిత్ర నెంత రమ్యతరముగాఁ జేసినవి? ఆంధ్రజాతిచరిత్రము మాత్ర మాంధ్రవాఙ్మయమునఁ బ్రతిఫలింపలేదా? అయితే యీ జాతియొక్క తొలియుగములందలి రమ్యచరిత్రమంతయుఁ శిల్పకళాదర్శము ననేగాని వాఙ్మయాదర్శమునఁ బ్రతిఫలింపకుండుట దాని చరిత్రలో నొక పెద్ద విషాదఘట్ట మనకతప్పదు. హైందవ సామ్రాజ్యపట్టభద్రులగు నాంధ్రమహారాజుల చరిత్రము వాగ్గేయరూపమున మన చెవులను గింగురుమనిపించి మనలో

నూతనచైతన్యమును బురికొల్పుటకు బదులుగా నాపావన కృష్ణవేణీతటంబున నమరావతి, జగ్గయ్యపేట, నాగార్జునకొండ మొదలగు ప్రదేశములందు శిల్పకళారూపమున స్తంభించి పోయి బూజుపట్టియున్నది. అయినను మన యదృష్టవశమున దీనినిగూడ కాలప్రవాహము కృష్ణానదీ ప్రవాహములోఁ గలిపివేయకుండ, ఆంధ్రజాతి కధిష్ఠాన దేవతయగు శ్రీకాకుళ వల్లభుఁడు ఆంధ్రనాథుఁడునగు నాంధ్రవిష్ణువు

"అరవిందాక్షుడు, చక్రి, సంతతముముక్త్యర్థ్యత్ను సంసేవ్యుడుం
దరుఁడై క్రమజనానురాగఫలసంతానప్రదుండై నిరం
తరకారుణ్య సుధాంబురాశియగుచున్ నానామునిస్తోమమం
త్రరహస్యార్చిత దివ్యవైభవములన్ రాజిల్లుచు న్నుండుటన్"

ఆ ప్రాచీనకళావైభవమంతయు నిప్పటికిని గాపాడఁ బడి యున్నది. కావుననే ఆనాటి యాంధ్రుల శిల్పకళావైభవమునైనను గాంచి అందుఁ బ్రతిబింబించిన వారి జీవితచరిత్రను స్మరించుకొనఁ గలుగుచున్నాము. మన దురదృష్టమేమో కాని పదిహేనువందల సంవత్సరముల తరువాత విజయనగరాంధ్రసామ్రాజ్యాధీశ్వరుని స్వప్నమున సాక్షాత్కరించి

పలికి తుత్తేతిక్షోపమల జాతిపెంపెక్క రసికులౌనన
మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్య సేవధిగాఁగ జెప్పితివి సత్యావధూప్రీణనంబు
శ్రుతి పురాణోపసంహితలేర్చి కూర్చితి సకలకథాసార
సంగ్రహంబు
శ్రోత్రఘుచ్ఛటలు విచ్చుగరచించితివూక్తి నైపుణి జ్ఞానచింతా
మణికృతి,

మరియు రసమంజరీముఖ్యమధురకావ్య
రచన మెప్పించుకొంటి గీర్వాణభాష
నంధ్రభాష యసాధ్యంబె యందునొక్క
కృతివినిర్మింపుమిఁక మాకుఁ బ్రియముగాఁగ.

"తెలుఁగదేల ? యన్న దేశంబు దెలుఁగేను
తెలుఁగువల్లభుండ, దెలుఁగొకండ
యెల్లనృపులు గొలువ నెఱుఁగ వె బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగులెస్స."

(ఆముక్తమాల్యద)

అని తెలుఁగుభాష నింతగాఁ బ్రశంసించి ఎప్పుడో 'మునుదాల్చిన మాల్యమిచ్చు నప్పిన్నది రంగమందయిన పెండిలి'నిగూర్చి చెప్పుమని బ్రతిమాలి బలవంతము చేసి ఒక కావ్యము చెప్పించుకొనిన మన యాంధ్రవల్లభుఁడు, ఆతొలి కాలమునఁగూడ స్వప్నమున నొకసారి సాక్షాత్కరించి, ఆంధ్రజాతివాండ్రయియుండియు, ఏమిట్లు మీరు వ్రాయించిన కావ్యములను బృహత్కథలను ఏల పిశాచభాషలో వ్రాయించుచున్నారు," దేశభాషలందుఁదెలుఁగులెస్సగదా" తెలుఁగుననొక్క శాసనమునైనను వ్రాయించి, మీయాంధ్రత్వమును, నా తెలుఁగువల్లభత్వమును నిలువఁబెట్టకూడదా యని యుద్బోధింపలేక పోయినాఁడు, ఇది యాంధ్రులపాలిటి గొప్ప దురదృష్టముగదా! అట్లే చేసియున్నచో నీ యాంధ్రభాషకు వాఙ్మయమునకు నెట్టి ప్రాచీనత అబ్బియుండును.

దాని పుట్టు పూర్వోత్తరములనుగూర్చి తెలిసికొనుట కింత మనము బాధపడవలసివచ్చినా? ఈయాంధ్ర రాజుల శాసనము లందలి ప్రాకృతమే ఆంధ్రభాషకుఁదొలి రూపమనేవారు. తద్భవమే యిది యనేవారు—లేదు—ఇది దక్షిణ దేశ భాషలలోఁ జేరిన స్వతంత్ర భాష అనేవారు—ఇన్ని వాదములకు కారణ ముండునా? ఆంధ్రజాతీయవైభవము తొలికాలమునుండి ఆంధ్ర భాషలో నెట్లు ప్రతిఫలించియుండేది? అయితే మనతో పాటే మన దేవతలకుఁ గూడ ననేక బాధలుతప్పవుగాఁబోలు. వారును కాలానికి బద్ధులే—కాలమే సర్వాధారముగదా. ఈ యాంధ్రనాథుఁడే గలియుగము రాగా నిచ్చట నుండక యుత్తర దేశమునకుఁబోయి కొంత కాలమునకు మరలివచ్చి యొక బ్రాహ్మణుని యింట కాకరపాదులో దాగియుండుటయు దటస్థించినదట. పిమ్మట 13–వ శతాబ్ది ప్రాంతమున అనంత పాలుఁడను కళింగదేశాధీశ్వరుని దండనాథుఁ డొకఁడు వచ్చి ప్రతిష్ఠాపన చేసినాఁడట—ఈయాంధ్రవిష్ణువును గూర్చి శ్రీకాకుళక్షేత్రమహాత్మ్యములో నిట్టిమైతిహ్యములున్నవి. శ్రీకాకుళాంధ్ర నాథునిచరిత్రమును 'వల్లభాభ్యుదయమ'ను పేరుతో భట్లపెనుమర్తి కోదండరామకవి యొక ప్రబంధ ముగా రచించినాఁడు. దీని మూలమున నీ యాంధ్రనాథుని గూర్చిన చరిత్రను సూచించు కొన్ని ప్రాచినకథలైనను నిలిచి యున్నవి. ఆంధ్రవాఙ్మయమున ప్రాచీనాంధ్రుల కథలను గూర్చి తెలిపెడి గ్రంథ మిదియొక్కటే కనఁబడుచున్నది. ఇది మద్రాసు యూనివర్సిటీ ఆంధ్రశాఖవారిచే వారి యాంధ్ర గ్రంథమాలలోఁ బ్రకటింపఁబడుచున్నది.

తరువాతి యాంధ్రదేశపురాజులగు-చోళచాళుక్యాదు లనుగూర్చి కొన్ని తెలుఁగు శాసనములు కావ్యములుగూడ దెలుపుచున్నవి. జపహోమతత్పరుఁడైనను లోకజ్ఞుఁడగు నన్నపార్యుఁడు తత్కాలానుగుణముగ భారతసంహితను మహాగంగా ప్రవాహమునుబోలు నాంధ్రవాణిని వెలయించి యాకాలపుటాంధ్రజీవితమును వ్యక్తముచేసియేయున్నాఁడు. ఆంధ్రావళి మోదముంబొరయునట్లుగ భారతశేషమును రచి యింపఁ దొడఁగిన తిక్కనార్యుడు తెలుఁగుతల్లి తేటమెఱుఁగులతోఁపాటు, తెలుఁగు జనుల దేశాచార వ్యవహారము లను తనభారతరచనలో నచ్చటచ్చట వెలయించి తన్మహనీయస్థితికి మూలమై నిలిచినాఁడు. నన్నపార్యుఁడాంధ్ర వాఙ్మయ మహాసౌధమునకు మూల స్తంభమనుట నెవరు కాదనగలరు. ఆంధ్రభాషను, వాఙ్మయమును అతఁడేసృజించె నని నమ్మెడు వారింకను కొందఱు ఉండవచ్చును. అది నిరాధార మనుటకు నిదర్శనములగు నంతకుఁ బూర్వశాసనము లను, శాసనపద్యములను వీరు కనులఁదెఱచి చూచినచో నప్పటి కవితాసంప్రదాయములు గోచరింపకపోవు. తన్మహనీయస్థితికి తిక్కనార్యుఁడు మూలమై నిలిచె ననుటకునుగూడ నెవ్వరును సందేహింప నక్కరలేదుగదా. కాని ముదిరిన పాండిత్యముగల కొందఱు పండిత విమర్శలకు దృష్టిలో నీతని కవితలోని మహనీయత్వము మంటిగడ్డలైపోయినది. తిక్కనార్యుని కవిత్వములో వారికన్నియు అమంగళములు, అశ్లీలములు, అనౌచిత్యములు, అనవసరకల్పనలుమాత్రమే కనఁబడఁజొచ్చినవి. ఆట నేర్పు గురువున కొప్పుచెప్పు సందర్భ

మున తండ్రియగు విరటునిచే బుజ్జగింపఁబడు నుత్తర, గర్భాధానపు పెండ్లికూతురువలె వీరికండ్లకుఁ బొడగట్టినది-అట్టి విమర్శకుల రసగ్రహణ పారీణతను, సహృదయతను నే మన వలెకి ఉత్తరావివాహ శుభకార్య సందర్భమునఁగూడ నీ పండితులకు తద్దినపు బ్రాహ్మణార్థసందర్భమున నీయఁబడు కానిడబ్బే కనఁబడినది. తీగఁబోఁడిలోని "బోఁడి" శబ్దసాధ్య మును శబ్దరత్నాకరములోనిచ్చిన "ముండిత" మనునర్థ మునుబట్టి గ్రహించిన రసజ్ఞులువీరు. కాని ఎఱిదృష్టివారిది. ఉత్తరవివాహసందర్భమున మూలములో వర్ణింపఁబడియుండని దేశీయాచారములను గొన్నిటిని తిక్కనార్యుఁడుతనయాంధ్రీ కరణమున సందర్భానుకూలముగాఁ జేర్చి వర్ణించియున్నాఁడు. పురంబున నుత్సవమును జాటఁబంచుట, ఉత్తర నలంకరింపఁ జేయుట, ధర్మతనయుఁడు అభిమన్యుని శృంగారంబు సేయించి గజారూఢుం జేసికొని తరలి వచ్చుట, క్రంత నడచుట, వరు నెదుర్కొని సేసలుచల్లి యెదురు సన్నాహము చేయుట, తెర యెత్తుట, తలంబ్రాలు, వధూవరు లేకాసనమున నుండుట, వివాహమైన పిదప కట్టనిచ్చుట (అంపకములు), బంధువుల కత్యాసత్కారములు, అల్లున కరణంబు నిచ్చుట మొదలగు విషయములు ఉత్తరా వివాహసందర్భమున తిక్కన వర్ణించి నవి ద్రౌపదీ వివాహసందర్భమున నన్నయచే వర్ణింపఁబడి యుండలేదు. మూలములో వీని ప్రశంసయే లేదు. "ప్రతి గృహ్యాచతాంపార్థః పురస్కృత్యజనార్దనం, వివాహం కార యామాస సౌభద్రస్యమహాత్మనః" అనిమాత్రమే కలదు. తిక్కన ఆంధ్రజనుల జీవిత విశేషములను సందర్భానుకూల

ముగా వాఙ్మయమునం జొనుపనెంచియే పై విషయములను వర్ణించినాఁడనుటకు సందేహము లేదు.

తిక్కనకాలముననుఅటుపిమ్మటను ఆంధ్రదేశము నొక ఊపుఊపిన శైవమతోజ్జృంభణము పాల్కురికి సోమనాథుని వాఙ్మయ తరంగముల నిప్పటికిని మనల నూపుచునే యున్నదిగాదా! కాకతీయులనాటి యోరుగంటి వైభవము నిప్పటికిని క్రీడాభిరామము మనకనులకుం గట్టుటలేదా? రెడ్డి రాజులనాటి యాంధ్రుల దొడ్డవైభవము, వారియొద్ద శ్రీనాథుఁడు నడపిన విద్యాధికారిత్వము, ఆంధ్రపల్నాటి వీరుల వీరచరిత్రము, రెడ్డిరాజు లనుభవించిన పునుగు జవ్వాదులతో తెలుంగరాయఁడు చేసిన కస్తూరికా భిక్షాదానములతోఁగూడ శ్రీనాథాదుల కవితయందిప్పటికి గుమగమలాడుచున్నదే! విజయనగర సామ్రాజ్య వైభవమును, రాయలనాటి యాంధ్రుల రాసికతను అష్టదిగ్గజములే చాటుచున్నవిగదా? నాయకరాజుల కాలమునందలి నారీమణుల నాట్యాభినయవైదుష్యములతోపాటు ఆంధ్ర దేశముననేగాక దక్షిణదేశమునఁగూడ తెలుఁగుతల్లి యెట్లు తాండవించినదో, తెలుఁగువారి జీవితచరిత్ర మాకాలపు వాఙ్మయాదర్శమునందెట్లు ప్రతిఫలించినదో సరస్వతీభాండారమిప్పటికిని జూపుచునే యున్నది.

ఇఁక నీ కాలమునందలి నవ్యసాహిత్యములు, ఖండకావ్యములు, విమర్శనలు, నవలలు, నాటకములు, కథలు సాంఘిక రాజకీయ భాషావిషయక సమస్యలు, వాదములు, జాతీయగీతములు, రాష్ట్రగానములు, మొదలగునవి పాశ్చాత్య

సంసర్గసంజాత నూతన సంస్కారచిహ్నితమైన యొక సంధి యుగ మనఁదగిన యీకాలపు టాంధ్రుల జాతీయజీవిత మును ప్రతిఫలింపఁజేయుచునే యున్నవిగదా? మఱియు నాదినుండియు సామాన్యజన జీవితమును దెలుపు పదకవిత్వ మును, పాటలు, గీతలు మొదలగు వానిని సంగ్రహించి శిష్ట వాఙ్మయమునఁ జేర్చికొన నుపేక్ష చేయుచున్నామే కాని, అవి లేనిది ఆంధ్రజాతి జీవితచరిత్రము సంపూర్ణము కాదని యింకను గ్రహింపలేకున్నాము. నవనాగరకతావశులగు నాధునిక స్త్రీల యుపేక్షమూలముగా నంతరించుచున్న స్త్రీల పాత పాటలను, యక్షగానాదులనుగూడ సేకరించినఁగాని ఆంధ్రవాఙ్మయము సర్వాంగసుందరము కానేరదు.

ఇట్లాయా జాతుల జీవితచరిత్రము వారివారి భాష లలోఁ బ్రతిఫలించుచుండుట సహజమే. కావున మన భాషా స్వరూప చరిత్రలనుగూడ మనము తెలిసికొనినచో జాతి చరిత్రగూడఁ దెలియఁగలదు. ఒక్కొక్క భాషలోని సారస్వ తము, కళలు, శాసనములు మొదలగునవి ఆయా కాల ములయందలి జనుల చరిత్రమును మాత్రమే తెలుపుచుండ, భాషయనునది పై వానివలన సూచింపఁబడు చరిత్రకుఁగూడ నతీతమైన, అనఁగా దీనికిఁగూడ నందని ప్రాచీనకాలము లోని ఆయాజనుల జీవితచరిత్రనుగూర్చి మనకుఁ దెలుపఁ గలుగుచున్నది. అనఁగా సామాన్యముగా దేశచరిత్రమను దానికందని పూర్వచరిత్రగూడ భాషారూపముల వలన మనము దెలిసికొనఁగలుగుచున్నామనుట. అట్లేకానిచో నెన్ని వేల సంవత్సరముల క్రితమో మధ్యఆసియాలోనో, యూరపు

ఖండ ప్రాంతముననో, కొందరన్నట్లు హిందూదేశములోనో నివసించియున్న ప్రాచీన ఇండో యూరపియనుల మూల సంఘముయొక్క జీవితపరిస్థితులనుగూర్చి తెలిసుకొనుటకు మనకు వేఱు ఆధారమేమున్నది? మన సంస్కృత భాషకు దోడఁబుట్టిన భాషలుగా గ్రహింపఁ బడుచున్న గ్రీకు, లాటిన్ జర్మానిక్, ట్యూటానిక్, స్లావోనిక్, అవెస్థా మొదలగు భాషలలోని సమానార్థక పదజాలము నేరి, ఆయాభాషలకుఁ బ్రత్యేక లక్షణములై యున్న స్వర సంప్రదాయములను గ్రహించి వాని మూల రూపములను, తన్మూలమున ప్రాచీన ఇండోయూరపియన్ భాషాస్వరూపమునుగూడ కనిపట్టి, ఆమూలభాషాపదముల మూలార్థమునుబట్టి యా కాలమున నామూల భాషను వ్యవహరించిన ప్రాచీనార్యజనుల జీవిత చరిత్ర మిట్టిదై యుండుననిభాషాతత్త్వవేత్తలు నిర్ణయించు చున్నారు గదా! నూఱు నూటయేబది సంవత్సరములనుండి జరుగుచున్న ఆర్యభాషాతత్త్వ పరిశీలనమే దీనికి సాధన మైనది. దక్షిణదేశ భాషావర్గము ను గూర్చియు నిట్టి పరి శీలనము జరుగవలసి యున్నది.

ఆయా పదములనుబట్టి ప్రాచీనార్యుల జీవితపద్ధతి యెట్టిదిగాఁ గనుఁగొనిరో యించుక చూపెదను. ప్రాచీ నార్యులు ద్వారములు, స్తంభములుగల యిళ్ళలో నివసించెడి వారని యీ భాషలన్నిటిలోను గనంబడు నీపదములే నిదర్శన ములు—సం. దమ, గ్రీక్–డొమోస్ (*Domos*), లాటిన్–డోమస్ (*Domus*); సం. ద్వార్; గ్రీక్–థూరా: లాటిన్–ఫొరెస్ (*Fores*), గాథిక్–దఉర్ (*Daur*); జర్మానిక్–తూర్

(*Tur*) ఇంగ్లీషు—డోర్ (*Door*). ప్రాచీనార్యుల పానీయము మధువు. సం. మధువు; గ్రీకు—మెథు; జర్మన్—మెతు; ఇంగ్లీషు—మీడ్ (*Mead*). హిందూదేశమునందలి యార్యులు యజ్ఞాదులలోఁ జేయు సోమపానము ప్రాచీనార్యుల కాలమున నున్నట్లుగాఁ గనఁబడదు, ఎలయనగా నీ శబ్దము—సం. సోమ—యనియు, అవెస్టాలో హోమయనియుఁ గనఁబడు చున్నదేగాని, ఇతరములగు నార్యభాషలలోఁ గానరాదు. కావున నిది వీరు హిందూదేశమునకో, పరిసియాప్రాంతము నకో వచ్చినపిదప నవలంబించినదని యే తలఁపఁబడుచున్నది. ప్రాచీనార్యులకుఁ బరిచితములగు జంతువులు—సం. వృకః గ్రీకు—లూకోస్ (*Lukos*), జర్మానిక్—వుల్ఫ్, (*Wolf*); సం, గౌః-గ్రీకు—బోఉస్ (*Bous*) ఇఁగ్లీషు—కౌ (*Cow*); పశువులే వారికి ధనము. పశువులను ధనమనియు, సొమ్ములని మన దేశమున విజయనగర ప్రాంతమునను-ఇప్పటికిని వాడుకొను నాచారముకలదు. లాటిన్—పెకుస్, గాథిక్—ఫెహ్యు (*Faihu*) గ్రీకు—వెయిహ్ (*Vieh*), ఇంగ్లీషు-ఫీ (*Fee*). విద్యార్థులు బడు లలో చెల్లించు "స్కూలుఫీ" అనునది ప్రాచీనార్యుల-పశు శబ్దమునకు సంబంధించిన శబ్దమే యని గ్రహింపనగును. లాటిన్ భాషలో—పికూనియా (*Pecunia*) అనఁగా ధనము—దీనినుండియే ఇంగ్లీషులో '*Pecuniary*' అనుశబ్ద మేర్పడినది. వేదములో "గవేషణ" శబ్దమునకు ధనముకొఱకై వెదకు లాడుట, ధనసంపాదనమునకై యత్నించుట—దానికొఱకై సలుపు యుద్ధములు—అని యర్థముకలదు. కాని తరువాతి కాలమున నందలి గోశబ్దార్థ మంతరించి, కేవలము వెదకుట

యను నర్థమున నది రూఢిఁజెందినది, ప్రాచీనకాలమున గురు దక్షిణగా గోవులనే యిచ్చు నాచారము కలదు. జనకుఁడు గోవులను దక్షిణగాఁబెట్టి బ్రహ్మిష్ఠులగు బ్రాహ్మణులను గ్రహింపమని "బ్రాహ్మణాభగవన్తోయవో బ్రహ్మిష్ఠః స ఏతా గా ఉదజతాం" అని చెప్పినట్లు బృహదారణ్యకోపనిషత్కథను బట్టి తెలియవచ్చుచున్నది. ఇఁక ప్రాచీనార్యులకు ఉన్ని-దానితో నేయుట, తెలియును సం, ఊర్ణా-ఉన్ని, లాటిన్-వెల్లిస్ (*Vellus*), గాథిక్-వుల్ల (*Wulla*), జర్మన్-వొల్లె(*Wolle*) ఇంగ్లీషు-వుల్ (*Wool*). నేయుట-గ్రీక్-ఉథైనో (*Wthaino*) జర్మన్-వీబెన్ (*Weben*), ఇంగ్లీ-వీవ్ (*Weave*). ఇదిసంస్కృత మున "ఊర్ణనాభ" (సాలీడు) అను శబ్దమునఁగానవచ్చును, "ఉర్ణ వాభ" అనునదే-ఉర్ణనాభ యయియుండును. వీరి దేవతలు-సం. ద్యౌఃపితా, లాటిన్-జూపిటర్, గ్రీకు-జెఉస్ పెటెర్ (*Zeuspeter*), సం. ఉషస్, గ్రీకు-ఇయోస్ (*Eos*); లాటిన్-అరోరా (*Aurora*) సం, వరుణ, గ్రీ-ఔరేనోస్-(*Ouranos*) ఇట్టివనేకములు కలవు, ఇట్టి చరిత్రాధారమున కందని ప్రాచీనార్యజన సంఘముయొక్క స్థితిగతులనుగూర్చి మనకుఁ దెలుపఁగలశక్తి భాషాపదములకుమాత్రమే కలదని సూచించుటకే పై శబ్దములనుగూర్చి యింతగాఁ జెప్పవలసి వచ్చినది.

ఇట్లే మనయాంధ్రభాషను సన్నిహితములగు సోదర భాషలతోఁ బోల్చి చూచి, సజాతీయపదజాలము నేరి, ఆయాభాషలలోని స్వరసంప్రదాయములనుబట్టి తత్తచ్ఛబ్ద పరిణామక్రమము నన్వేషించి, వాని మూలరూపములను

కనిపట్టి, ప్రాచీనాంధ్రభాషా స్వరూప పరిణామములను గుర్తించినగాని, ఆంధ్రుల ప్రాచీన చరిత్రయెట్టిదో గోచరింపదు. ఆ ప్రాచీన భాషనుండి దీని సక్రమపరిణామము నన్వేషించి తెలిసికొనఁగాని మనము ఆంధ్రభాషాభ్యుదయ క్రమము తెలిసికొన్నవారము కాలేము.

అభ్యుదయ మెల్లపుడు మార్పుతోఁగూడినదే. ఏవిధమైన యభ్యుదయమునకును మార్పే, పరిణామమే, కారణము. ప్రపంచధర్మమే మార్పు. కాలానుగుణముగ ప్రపంచమునందలి ప్రతివిషయము, వస్తువు—పరమాణువునుండి బ్రహ్మాండము వరకు—ననవతరము పరిణామమును బొందుచునే యున్నది. కాని యెన్నిమార్పులు గలిగినను నిత్యవ్యవహారమున బ్రవాహనిత్యత్వము వ్యవహార సాధనమగుచునే యున్నది. కాలానుగుణముగ విధినిషేధములకు, గుణదోషములకుఁగూడ మార్పుగలుగుచునేయుండును. అట్లే మన ఆంధ్రత్వము, మనభాష కాలానుగుణమగు పరిణామమునకు లోనగుచునేయున్నవి. ఆ పరిణామక్రమముచుబట్టి ఆంధ్రజాతీయచరిత్రము, భాష, వాఙ్మయము, కళలు, రాజకీయార్థిక సాంఘిక జీవితపరిస్థితులు మొదలగువానిని సమన్వయించి, పరిశీలించినగాని యాంధ్రాభ్యుదయక్రమము మనకు సువ్యక్తంబుగాదు. కావుననే యీ కాలమున చారిత్రకదృష్టితో సలుపఁబడిన తారతమ్యపరీక్ష (*Historical and comparative study*) ప్రాధాన్యము వహించుచున్నది. సారస్వత విషయమును దీసికొందము. ఒక గ్రంథమునుగాని, సారస్వత శాఖనుగాని పరిశీలించునపుడు, ఆయా రచనల కర్థము, అందలి సారస్యము

చమత్కృతి, గుణదోషములు మొదలగువానిని మాత్రమే గ్రహించి యూరుకొనక, వానితోఁ బోలికగల యితరకవుల రచనలతోఁబోల్చిచూచి, వాని తారతమ్యములనారసి, అందలి విశేషలక్షణములకును నాయాకవుల జీవితములకు నాదేశకాల పరిస్థితులకుగల సంబంధంబెట్టిదో, ఆయాయుగములందలిరచన లాయా జనుల భావముల నెట్లు సూచించుచున్నవో, అంతకుఁ బూర్వయుగమునందలివానికి వీనికిఁగల సామ్యభేదము లెట్టివో సకారణముగ నిరూపింప యత్నించుటయే యీకాలమందలి సాహిత్య పరిశీలనమునకుఁ బ్రధానలక్షణముగా గ్రహింపం బడుచున్నది. అంతేకాని యాయా గ్రంథములందలి గుణ దోషాలంకార నిరూపణముమాత్రమే కావ్యానుశీలనము నకు ఫలము కాఁబోదు. ఇది మంచిది అది చెడ్డది యని చెప్పుట మాత్రమేకాదు. ఆయాకవులయెడలను, భాషా వాఙ్మయశాఖలయెడలను దత్తద్దేశ కాలసంస్కారప్రభావము యొక్క బలమెట్టిదో పరిశీలించి సమన్వయింపఁగలిగినచో విమర్శనమునకొక విధమగు గౌరవము, ఉత్తేజకత్వము అబ్బును. మహాకవులగు తిక్కన పోతనాదులకుఁగూడ తత్తర పాటులను, అశ్లీలాదిదోషములను నంటఁగట్టవలసిన యవసర ముండకపోవచ్చును. "రేఫమ్ములు తాలునుంగదిసి ప్రాసము లైన కతంబునంగదా నిమ్ములనాదిలాక్షణికు లెల్లను మాని రుదాహరింపగన్" అని అప్పకవి యాదిలాక్షణికుల పాఠమునే యొప్పఁజెప్పినను, బమ్మెరపోతరాజ కృతభాగవ తమ్ము జగద్ధితమ్ముగాకుండఁగపో లేదు. రేఫ ఱకారనిర్ణయము విషయమున నాధారబల మీ కాలమునకు సడలుటచే నాతఁ

డద్దానిని పాటించియుండకపోవచ్చును. లాక్షణికుల రేఫ అకారనిర్ణయము మాత్రము సరిగ నున్నదా? ఆదికవులకాలముల నానియమము పాటింపఁబడియుండవచ్చును. దానికైనను ప్రామాణ్యంబేమి? సంస్కృత ప్రాకృతములలో శకట రేఫము లేకుండుటచే నితరసన్నిహిత ద్రావిడభాషారూపములను బట్టి నిర్ణయింపవలసినదేగదా! అట్లు చూచినను దానికొక దారి తెన్ను లేకుండుట ఆయా భాషారూపములను బరిశీలించినవారికిఁ దెలియకపోదు.

ఇట్లు వాఙ్మయ విషయమునవలెనే భాషావిషయమునను "శాస్త్రప్రయోగ వచసోః శాస్త్రంబలవదుచ్యతే" యను వాదమునే పరమప్రమాణముగాఁ జేయక, వ్యాకరణము ప్రయోగ శరణమను విషయమును గ్రహించి, తక్కినవానివలెనే భాషకు గూడఁ గాలక్రమమున జనవ్యవహారమూలకమగు మార్పు సహజమనియు, దాని పరిణామక్రమము నన్వేషించి పూర్వోత్తర రూపములకు సమన్వయముఁ గుదుర్చుకొనవలయునని యు గ్రహించినగాని తద్భాషా చరిత్రమును మనము తెలిసికొనలేము

"శూరుల జన్మంబు సురల జన్మబు
నేరుల జన్మంబు నెఱుగంగనగునె"

అని తిక్కనార్యుఁడు చెప్పినట్లుగా నాంధ్రభాషాస్రవంతి పుట్టుకనుగూర్చి తెలిసికొనుట దర్ఘటముగానే యున్నది. నన్నయకుంబూర్వకాలపు టాంధ్రాభాషాస్థితిని దెలిసికొనుటకుఁ దగిన చారిత్రక నిదర్శనములు వెనుకటికాలమున నంతగా లభింపకపోవుటచే "మహిమున్ వాగనుశాసనుండు

సృజియించె'' నని యా కాలపువా రనుకొనుటలో నాశ్చర్యము లేదు; కాని యిటీవలికాలమున నాతనికిఁ బూర్వము నాలుగైదు శతాబ్దులవఱకు శిలాక్షరముగానున్న శాసననిదర్శనములు కానవచ్చుచుండుటచే, నాచారిత్రక నిదర్శనములనుబట్టి తెలుఁగు భాషయొక్క ప్రాచీనత క్రీస్తుశకము 6, 7 శతాబ్దప్రాంతమువఱకును బోవునని దృఢపడుచున్నది. అంతకుఁ బూర్వమున నీభాషలో రచింపఁబడిన శాసనము లేమియుఁగానరాకుండుటేగాక, యా కాలమున నీ యాంధ్ర దేశమున బయలుదేరిన శాసనములన్నియు సంస్కృతముననో, ప్రాకృతముననో రచింపఁబడి యుండుటచే, వీనినుండియే తెలుఁగుభాష యేర్పడినదనియు, వాని వికృతరూపమే యిది యనియుఁ దరువాతి సంస్కృత భాషాభిమానులగు లక్షణకర్తలు తలంచుట తటస్థించినది. క్రీస్తుశకారంభ కాలమున మహాసామ్రాజ్యము నేలిన యాంధ్ర రాజుల శాసనములన్నియు నాంధ్ర దేశమున దొరికినవికూడ ప్రాకృతభాషలోనే యుండుటనుబట్టి, ఆ యాంధ్రుల ప్రాకృతభాషయే యిప్పటి మన తెలుగునకుఁ దొలిరూపమనియు, కాలక్రమమునఁ గలిగిన పరిణామముచే నది నేఁ డీరూపు నొందినదనియు, కొందరు ఆధునిక భాషాతత్త్వవేత్తలుకూడఁ దలంచుచున్నారు. ఆంధ్రరాజుల శాసనములు అమరావతీ, జగ్గయ్యపేట, నాగార్జునకొండ మొదలుగాఁగల స్థలములలో దొరికినవి క్రీస్తుశకము రెండు, మూడు శతాబ్దులనాటివి కలవు. వీనిని సుమారు నాలుగైదు శతాబ్దుల యనంతరము లభించిన తెలుఁగు శాసనములతో సరిపోల్చిచూచినచో వాని కెంత

భేదముకలదో, యొకటి వాని పరిణతరూపమే మన మెఱింగిన యీ తెలుఁగనుట యెంత యసంభవముగాఁగనఁనబడునో మీఁకే సువ్యక్తము కాఁగలదు. ఆశాసనములివి.

నాసిక యందలి శిలాశాసనము–వాశిష్ఠీపుత్ర పులుమాయి కాలము నాటిది.

సిద్ధం రఞొవాసిఠీపుతస, సిరిపుళుమాయిస సవిచ్ఛరె ఎకున వీసె 19 గింహాణ పఖె బితీయె దివసె. తెరసె రాజస, గోతమీపుతస-హిమవతమేరు మదర పవత సమ సారస... ......సెలుగిరి చకొర పవతపతిస సవ రాజలోక మడలపతి గహీతసాసనస,.........సకయవన పల్లవ నిసూదనస... ......సాతవాహనకుల యస పతిథాపనకరస,.........

సిరిసాతకనిని సమాతుయ మహాదేవియ గొతమియ బలసిరీయ సచవచనదాన ఖమాహింసానిర తాయత పదమనియ మోపవాసత పరాయరాజ రిసివధుసనం అఖిలం అనుకిధీయ మానాయ, తిరణ్హు 'పర్వతా' పవత సిఖరే మహాదేవీ మహారాజామాతా మహారాజి పితామహేందదాతి నికాయస భదావనీయానం భిఖుక సఘస. ఏతసచ వెణాస చితణనిమత, మహాదేవియ అయకాయ సేవకామా పియకామోచ,......... పితుపతియేధమ సెతుస దదాతిగామ-తిరణ్హుపవతస అపర దఖిణపసె పిసాజి పదకం సవజాతభోగనిరతి

కడపజిల్లాలోని తెలుఁగు చోళశాసనము. *

1. స్వస్తి(శ్రీ) చోలమ

2. [హా] రాజాధిరాజ ప

* *Ep. Ind. vol XI-Page* 345.

3. రమేశ్వర విక్రమాది
4. త్యశ క్తికొమరవి
5. క్రమాది(త్యు)లకొండు(కు)
6. [ళ్]కాశ్యపగోత్రు
7. (న్రు)శత్యదితున్రు శిద్ధి
8. [వేయు] రేనాణ్డు ఏళు [వే]
9. [ల]ఏళుచున్రి.కొ[ము]
10. [ఆ]పాఅ రేవశ
11. [మఙ్] కాశ్యపగో
12. త్రినికి ఇచ్చిన
13. ...... చిఱుంబూరి ఉత్త
14. ......శ. తూపుఙనదిశ
15. దు జుగ్గి పొల గ [ర]
16. సు ద [క్షి]ణ [దిశ]
17. ...... పాఅ [ము]
18. ఏను మఱుత్రుగా
19. నుతాగిరి దేని
20. సల్పినవా:కి
21. వేగు(ళ్) ళువు వేసె
22. ఱువుళు వేవాన్రు
23. ఱ్ఱు నిల్పినంపుణ్యాం
24. బు దీనికి వక్రంబు
25. వచ్చువన్రు పుత్రవ
26. ద్యస్త్రీవద్య [గోవ]

27. ద్య పఞ్చమ [హా]
28. [పా] తకఞ్చేసి [న]
29. వానిలోక [ం] [బు]
30. నున్తు వాన్తు.

వీనిని బట్టి చూడఁగా నిందలి క్రియారూపములు విభక్తిరూపములు మొదలగునవేగాక రచనా పద్ధతులందు భాషాతత్వమునందుగూడ భేదమగపడుచుండుటచే నాంధ్ర రాజుల భాష మనమెఱిఁగిన ఆంధ్రమే కాదేమో యను సందేహము కలుగకమానదు. వారి శాసనభాష మనకుఁ బరిచితమగు నాంధ్రము కాదనుట స్పష్టమే, కాని యీ రెంటికిని ముడిపెట్టుట కొఱకే దాని వికృతరూపము-లేదా పరిణత రూపము-ఇది యని కొందఱు వాదించుట. ఆ బౌద్ధ యుగమున ప్రాకృత భాషకుఁగల ప్రాబల్యమును బట్టి యాంధ్రరాజులు ప్రాకృతమునే రాజభాషగా గ్రహించి శాసనముల నందే రచింపించినను, ఈ దెశమున వారి నిత్య వ్యవహారమున మన మివ్వు డెఱింగిన యాంధ్రభాషనే వాడు కొనియుందురు. కాని యీవిషయమును నిర్ణయించుటకుఁ దగిన యాధారములు మాత్రము లేవు. అయినను, ఆకాలపు టాంధ్ర దేశీయుల వ్యవహారమందున్న భాష పై శాసన భాష యగు ప్రాకృతముకంటె భిన్నమని మాత్ర మూహించుటకు భరతాదుల వాక్యములే నిదర్శనములగు చున్నవి. భరతుఁడు నాట్యశాస్త్రమున ఆంధ్రులభాష ప్రాకృతముకంటె భిన్న మగు భాషగాఁ బేర్కొని యున్నాఁడు.

“నబర్బర కిరాతాంధ్ర ద్రవిడాద్యాసు జాతిషు
నాట్యప్రయోగే కర్తవ్యం కావ్యం భాషాసమాశ్రయం”

అని చెప్పిన పిదప ప్రాకృతభాషల ప్రయోగపద్ధతిని గూర్చి తెలుపుచు,

“జాతి స్వేతాసు సర్వాసు శుద్ధామచ ద్విజోత్తమాః
శౌరసేనీం సమాశ్రిత్య భాషాకార్యాతు నాటకే
అథవా ఛందతః కార్యా దేశభాషాప్రయోక్తృభిః
గవాశ్వాజావిరోష్ట్రాది ఘోషస్థాన నివాసినాం
అభీరోక్తిః, శాబరీవా, ద్రావిడీ ద్రావిడాదిషు”

దీ॥ నిబట్టి ఆ కాలమునకు ఆంధ్రము, ద్రావిడము అనునవి భిన్నభాషలుగాఁ బరిగణింపఁబడుచున్నవనియు, వీనికిబదులు శౌరసేనీ ప్రాకృత మొకప్పుడు ప్రయోగింపఁబడఁదగి యుండుటచే నివి దానికంటె భిన్నములనియు స్పష్టమగుచున్నది.

7-వ శతాబ్దమువాఁడగు కుమారిలభట్టు వైదిక భాషలో సంక్రమించిన మ్లేచ్ఛభాషాపదముల కర్థనిర్ణయము చేయు పట్ల సంస్కృత వైయ్యాకరణులా మ్లేచ్ఛ పదములకు సంస్కృతవ్యుత్పత్తులను గల్పించి వానియర్థము నెట్లు సమర్థించుచున్నారో చూపుటకుఁగా ద్రావిడభాషాశబ్దములగు ‘చోర్’ పాంబు, వయిర్, అతర్, మొదలగువాని నుదాహరణముగా జూపియున్నాఁడు, “చోర్” అను తమిళ శబ్దమునకు “చోర” శబ్దముతో నభేదమును గల్పించియు, పన్థానము—మార్గము అను నర్థముగల “అతర్” శబ్దము త్యా—తరణౌ యనుధాతువు నుండి నిష్పన్నంబైనట్లుగాఁ దలంచి తరింపశక్యముగానిది

గనుక-మార్గమును "అతర్" అనుట యుక్తమేయని యా నిష్పత్తిని సమర్థించియు, సర్పవాచియగు "పాప్" (తె-పాము) శబ్దమును-"పాపః" అను శబ్దముతో నభేదము చేసి-వాస్తవముగా పాము-పాపియేగావున నా వ్యుత్పత్తి సరియైనదేయని చెప్పుచు నిట్లు ద్రావిడాది మ్లేచ్ఛభాషాపదములకుఁగూడ స్వభాషానురూపములగు నర్థములను వ్యుత్పత్తులను గల్పించుచున్నారని తంత్రవార్తికమునఁ జెప్పియున్నాఁడు.

దీనినిబట్టి ద్రావిడము నాతఁడు ప్రాకృతభేదముగాఁగాక మ్లేచ్ఛభాషగా గ్రహించినట్లు స్పష్టము. ఈతఁడే ఆంధ్రభాషలో రాజన్ శబ్దమునకు పాలకుడను నర్థమేగాక క్షత్రియ పరమగు నర్థముకూడ వ్యవహారమునఁ గలదని చెప్పుటచే నాంధ్రభాష ద్రావిడ ప్రాకృతములకంటె భిన్నమైనట్లు వ్యక్తము చేసినట్లైనది. ఈతని కాలమునకుఁ దెలుఁగు భాష శాసనములలోనికే యెక్క నారంభించినది. కావున నేడవ శతాబ్దిప్రాంతమున శాసనములలోఁ గనంబడు తెలుఁగు భాష అంతకుఁ బూర్వము-ఆంధ్రరాజుల కాలమునుండియు గూడఁ దెలుఁగు దేశమున వ్యవహారములో లేదని చెప్పుట యెంతమాత్రము యుక్తిసహముకాదుగదా. అనఁగా నాంధ్ర జాతివారు వింధ్యదక్షిణప్రాంతమునుండి దక్షిణాపథమునకు వచ్చి కృష్ణాగోదావరీ మధ్యదేశము నాక్రమించి యచ్చటి జనులతోఁ గలిసిపోయి మహాసామ్రాజ్య స్థాపకులై ప్రఖ్యాతి గడించిన వారగుటచే, నీ దేశమునకు, దేశీయులకు, తెలుఁగు భాషకు నాంధ్రనామ మబ్బినదేగాని, యీ దేశము నిర్జనారణ్యం బగుట కాని, యచ్చట దేశీయంబగు భాషయే

లేకపోవుటగాని తటస్థింపలేదు. కాని యీ కాలములోనే తెలుఁగులో ననేకములగు ప్రాకృతపదములు చేరియుండుటచే నది దీనికి ద్వితీయప్రకృతియని తరువాతి వారు తలంచుటకుఁ దగినస్థితి యేర్పడియుండును. అటు పిదప ప్రాకృతములు వెనుకఁబడి సంస్కృతభాషకు ప్రాముఖ్యముగలిగిన కాలమున, "తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును" అనువాదము బయలు దేరినదిగాని, యీలాక్షణికులును, తరువాతి కవులలో పాల్కురికి సోమన, నన్నెచోడాది కవులునుగూడ జాను తెనుఁగు, దేశి అనునదే సర్వసామాన్యముగ దేశము నకు స్వతస్సిద్ధమగు భాషయని యుద్ఘోషించుచునే యుండిరి. కావున నీ దేశీస్వరూపనిరూపణమే మన యాంధ్రభాషా చరిత్రాన్వేషణమునకు మూలసూత్రంబగునని మనము తలంప వలయును. ఈ తెనుగు దేశియొక్క నిజస్వరూపము తత్సమతద్భవ రూపమగు సంస్కృత ప్రాకృతగంగాప్రవాహ ములోఁ బ్రతిఫలింపదువుగావున దక్షిణదేశమునందలి ద్రావిడ భాషాప్రవాహినిలో నెంతవఱకుఁ బ్రతిఫలించియున్నదో పరిశీ లించి తెలిసికొనవలసియున్నది. మలయాళ భాషలోని కేరళ కౌముదీకర్త యీ భాషాస్వరూపము నిట్లు స్మరించినాఁడు.

> "సంస్కృతహిమగిరి గళితా, ద్రావిడభాషాకళిందజామిళితా
> కేరళభాషాగంగా విహరతు మే హృత్సరసదా సంగా"

మన వాగనుశాసనుఁడగు నన్నపార్యుఁడుకూడ నిట్టి గంగాయమునల సంగమము వలన నేర్పడిన యాంధ్రభాషా రూప దక్షిణగంగాప్రవాహమునే దక్షిణాపథమున పాఱించి ఆంధ్రవాఙ్మయ స్వాదు ఫలములతో మనకు సంతర్పణచేసి

నాఁడు. ఆంధ్రరాజులు విశాల సామ్రాజ్యమును నెలకొల్పి ఆంధ్రకళలను పోషించి ఆంధ్రాభ్యుదయమునకుఁ దోడ్పడినను, ప్రాకృతభాషను చేపట్టినవారగుటచే నాటి తెలుఁగు భాషకు వన్నెయు, వాసియు లేకపోయినది. తెలుఁగు భాష లోని సహజములగు దేశిలక్షణములు మఱుగువడి సంస్కృతముతో వేసిన పైపూత మెఱుగులఁ జిమ్మ మొదలుపెట్టినది. అయినను తిక్కన సోమనాథులు దేశి తెనుఁగు తేఁటనిగ్గుల తియ్యదనమును గొంత చవిచూపుటచే, దాని స్వరూప మన్వేషించుటకు మార్గమేరడినది. మఱియు ద్రావిడభాషా కళిందజ సంస్కృత గంగాప్రవాహముతోఁ గలిసి ప్రవహించు చున్నను, ఆప్రవాహమునఁగూడఁ దన ప్రత్యేకతకుఁ జిహ్న మగు స్వీయ వర్ణము (ఱ)ను నిలుపుకొని చూపఱులకు నిజ స్వరూపము వ్యక్తము చేయుచునే యున్నట్లున్నది. దీని ప్రత్యేక వర్ణము ఱ ఱాత్మకమగుటను బట్టి దీనిని మనము గుర్తింప వచ్చును.

నన్నయకుఁబూర్వకాలమునందలి తెలుఁగు శాసనము లను బరిశీలించినచో నందు ద్రావిడభాషల ప్రత్యేకతకు చిహ్నములగు వర్ణములందు తెలుగు దేశిస్వరూపమేగాక దాని పరిణామ క్రమముకూడఁ గొంత వ్యక్తము కాకమానదు వెనుకఁజూపిన తెలుఁగుశాసనమును బరికించినచో నందు ముఖ్యముగా సంస్కృతప్రాకృతములలో లేని రెండు వర్ణములు ఱ, ఴకారములు కానవచ్చుచుండుట స్పష్టము. ఇవియే (ఎ. ఒ లుకూడను) సంస్కృత గంగాప్రవాహముతోఁ గలి ప్రవహించుచున్న దేశీయంబగు ద్రావిడభాషాప్రవాహముని

గుర్తించుటకుఁ డోడ్పడు ముఖ్యవర్ణము లనవచ్చును. ఈ భాషాప్రవాహము నన్నయకుఁబూర్వము కొంత కాలము వఱకు నందలి గంగా యమునల ప్రత్యేకస్వరూపమును వ్యక్తము చేయుచునే ప్రవహించినను, ఆతనికాలమునాటికి రెండును గలిసిపోయి వానినిఁ గుర్తించుటకు వీలులేకుండు స్థితి యేర్పడినది. కావున నన్నయకుఁ బూర్వగాలపు శాసనములలోనే యీ ప్రవాహమును మనము గుర్తింపవలెను. ఈకాలపు తెలుఁగు శాసనములలోనేగాక నాగరలిపిలో వ్రాయఁబడిన సంస్కృతశాసనములలోఁ గూడ ఆంధ్ర దేశీయ గ్రామనామములను వాని సరిహద్దులను జేర్కొను సందర్భములలో నాభాషలో నీ వర్ణములు గాని, వాని లిపిగాని లేకుండుటచే నందీద్రావిడభాషావర్ణములను ద్రావిడ లిపిలోనే వ్రాయవలసిన యావశ్యకత యేర్పడినది.

విషమసిద్ధియను నామాంతరముగల మొదటి విష్ణువర్ధనుని తిమ్మాపురం శాసనమునను, చీపురుపల్లి శాసనమునను —"విష్ణుశర్మమాధవ శర్మాభ్యాం పటకి విషయె చెఱుపూర గ్రామోయం దత్తః" అనియు "పటకి విషయె కుములూరం నామగ్రామం" అనియు వ్రాయబడియున్నది. 7–వశతాబ్ది ప్రారంభమునందలి రెండవపులికేశి అను చాళుక్యరాజు యొక్క కొప్పరపు తామ్రశాసనమున కర్మరాష్ట్రమునందలి ఇబుఱలి గ్రామక్షేత్రమున కెల్లలు చెప్పుటలో "కొణ్డవేఱు పూర్వధా దక్షిణతః" "నిఱఱుధా ఉత్తరతః" అని శకట రేఫమే వ్రాయబడినది.

విష్ణుకుండిన వంశీయుఁడగు రెండవవిక్రమేంద్రవర్మ చిక్కుళ్ల శాసనమందు "రెందులూర" వాసకాత్...... రేగోన్తనమ్ నామగ్రామం దత్తం"అనికలదు. ఈ రెందులూ రే ఏలూరు సమీపమునందలి యిప్పటి "దెందులూ" రని తెలియవచ్చుచున్నది. ప్రాచీన భాషలోని "ఱ" కారము సామాన్యముగాఁ దరువాతి తెలుఁగున "డ" కారముగాను, అర్వాచీన కన్నడమున "ళ" కారముగాను మాఱుట కలదు. కాని ఈ "ఱ" కారము కాల క్రమమున "ద" కారముగాఁ గూడ మాఱినదన్నందుల కిదియొక నిదర్శన మనవచ్చును.

7-వ శతాబ్దిమధ్యభాగమునందలి మొదటి విక్రమాదిత్యుని తలమంచి శాసనములో ఱ, ళ, ఱ, కారములు మూడును గానవచ్చుచున్నవి. "శ్రీ మేఘాచార్యాయ స్వకీయగురవే కొఱచుంకొ(న్త) గ్రామస్యోత్తర పార్శ్వే ఏళసత్తిర్నామగ్రామః దత్తం." ఈ శాసనము నాగరలిపిలోనే కలదు. రెండవఅమ్మరాజు మలియపూండి శాసనములో "ఆగ్నేయతః రావియ పెరియ 'చెఱువు'-పశ్చిమతః మల్కపట్టు, కోఱబోయు తటాకంచ" అని కలదు.

5-వ శతాబ్దమునాటి (క్రీ, శ. 436) పల్లవరాజగు రెండవ శివస్కందవర్మయొక్క ఒంగోడు శాసనములో "కర్మరాష్ట్రే ఒంగోడు గ్రామః-నఱచడు గ్రామోదక్షిణతః పెణుకపట్టుగ్రామ ఉత్తరతః" అని కలదు. 10-వ శతాబ్ది ప్రారంభమునందలి ప్రథమచాళుక్యభీముని అత్తిలి తామ్ర శాసనమును వ్రాసినవాఁడు "చామ కుఱ్ఱాచార్యుడు"

ఇట్లు చోళ చాళుక్య రాజుల తెలుఁగు శాసనములలో నీ వర్ణములతోఁ గూడిన పదము లనేకములు గానవచ్చుచునే యున్నవి.

పై నుదాహరించిన శాసనములలో "చోఱ" మహారాజ, 'ఏఱు (వేల)' అనియు. యుద్ధమల్లుని బెజవాడ శాసనములో 'ఱస్సి, అఱచెపుట,' అనియు నిట్లు ఱకారముతోఁ గూడిన శబ్దము లనేకములుగలవు. ఈ శబ్దములే తరువాతి కాలమున చోడ, ఏడువేల. డస్సి, అడచుట మొదలగు రూపములను బొందియున్నవి.

ఇట్లు నన్నయకుఁ బూర్వపుశాసనములలో ననేక పదములలో గనంబడుచున్న యీధ్వని తరువాతి కాలమున మార్పు జెందిన దగుటచే రూపుమాసి యంతరించినట్లగపడు చున్న దేగాని యీ భాషలో నొకప్పుడది లేకపోలేదు. కన్నడ భాషలోని "ఱ" కారము 13-వ శతాబ్దివఱకు నిలిచి యున్నది. దక్షిణదేశ భాషలకు విశేష చిహ్నమనదగు నీ "ఱ" కారము ఇటీవలికొన్ని యుత్తరహిందూస్థాన భాషలలో అనఁగా బెంగాలి మొదలగు వానిలోను, ఉఱియా, మార్వాడీ మొదలగు భాషానామములలోను గనబడుచున్నది గావున, నార్యప్రాకృత భవములగు నీభాషలలోవలెనే, తమిళ కన్నడాది దక్షిణదేశభాషలలోఁగూడ నిటీవల కాలమున నార్యభాషాశబ్దముల యుచ్చారణములో గలిగిన మార్పువలన నేర్పడినదేగాని ద్రావిడ భాషల కిది ప్రత్యేక చిహ్నమనుట తగదను వాదమొకటి బయలుదేరినది. కాని

ప్రాచీన ప్రాకృతములలో నీ వింతర్ణము లేదనుట నిశ్చయమే గదా? ఇది క్రీస్తుశకము 10-వ శతాబ్ది ప్రాంతమున ఁయలు దేరిన వనఁదగిన యుత్తరహిందూస్థానభాషలలో దేశీయము లగు ద్రావిడభాషల సంసర్గముచేఁ బొడసూపినదనియే చెప్ప వలయును. క్రీస్తుశకాదినుండి ప్రసిద్ధవాఙ్మయముతో నలరారు తమిళములోను, తరువాతి కాలమున కన్నడాంధ్రములలోని శాసనములలోను, ఇంక ననేకములగు సమానార్థక పదముల లోను ధాతువులలోనుకూడ నీవర్ణము ప్రత్యేకముగాఁ గాన వచ్చుచునేయున్నది. ఈపదజాలము, అందలి యీవింత వర్ణము, అదియంతయు ఈ ఉత్తర హిందూస్థాన భాషలలో వలెనే యర్వాచీన కాలమున సంస్కృత ప్రాకృత శబ్దము లలోఁ గలిగిన సహజ పరిణామఫలితమే యనుట కేవల హాస్యాస్పదము. ఈ యొక్క-ధ్వనియే యీ ద్రావిడభాషా పదములలో నెన్నిమార్పులకు లోనై తెలుఁగులో నట్టి రూపములను బొందియున్నదో, దీనిమూలమున నీదక్షిణదేశ భాషలసాజాత్యము, అనేకము లగుసాంధ్రాభాషాపదములయు, ధాతువులయు ప్రాచీనస్వరూపము, చరిత్రము ఎట్లువ్యక్తము కాఁగలదో, ఈక్రిందిపదముల పట్టికనుబట్టి మీరు గ్రహింపఁ గలరు. కన్నడమున శబ్దమణిదర్పణమను వ్యాకరణమును రచించిన కేశిరాజను నాతఁడాభాషలో నీ వర్ణముతోఁ గూడిన కన్నడశబ్దముల పట్టిక నిచ్చినాఁడు. దానినిబట్టి వానిలో నేవి తెలుఁగులో నెట్లు పొడసూపుచున్నవో కొంత వఱకుఁ దెలిపెదను.

| కన్నడము. | తెలుఁగు. | అఱవము |
|---|---|---|
| అకారాంత ధాతువులు | | |
| కుటి, ఖననే, *to dig* | గ్రొయ్యి, - గ్రొచ్చు, త్రవ్వు *cf.* గొయ్యి (*a pit*) | కుటి |
| ఇటి=నిమ్నావతరణే *to come down, descend* | ఎఱఁగు(నమస్కరించు) (ఇళిగు>)డిగు > దిగు | ఇఱంగు |
| ఉటి=అవశిష్టే, విమోచనే చ, *to remain* | ఉడుగు = మాను | |
| అటి=వినాశే, (*to be ruined*) | అడఁచు; అఱు (పెం అటు పఱు) | |
| కటి=నిధనాతిదూరయోః *to end, to die, to go or be removed, very far.* | కడచు | |
| బటి=సమ్మార్జనే, మార్గవంశేషు=*to sweep, road, race.* | వడి (మార్గము *cf.* వడి-(ప్రాస,) బరి(గితి) వలయాకారపు రేఖ "పర్ణశాలకు జుట్టు బరులేడు వ్రాసి." శ.ర. | వటి-మార్గము |
| పటి=నిన్దాయాం. | పడు, పఱచు | |
| సుటి=భ్రమణే *to turn round, a whirlpool.* | సుడియు, సుడిగుండము. | సుటి |
| "తుటి"=పాదసంఘట్టనే *to trample on* | త్రొక్కు | |
| పొటి=నిర్గ్రీవకరణే (=పిళి) *to squeeze out* | పిడుచు | |
| కొటి=జీర్ణే *to decay, to rot* | కుళ్లు | |

| | | |
|---|---|---|
| ఎటి=ఆక్రమణాకర్షణె, *to draw with power, to pull, drag.* | ఈడు, ఈడ్చు, | |
| ఉటి=హాల విలేఖనె *to plough, make furrows.* | దున్ను, ఊడుచు | |
| అటి=రోదనె. *weep* | అడలు | |
| అగట్ = ఖననె = *to dig* | *cf.* అగడ్త దీనికి నామవాచకరూపమేగాని క్రియారూపమీ భాషలోనంతరించినది | |
| తెగట్ = నిందాయాం *-to rebuke, blame* | తెగడు. | తిగట్ |
| పొగట్=సంస్తవనె *to praise* | పొగడు | పుగట్ |
| నెగట్ = ఉద్యోగఖ్యాత్యోః, *to engage in, to be known or famous* | నెగడు | |
| మగుట్ =నివర్తనె *to return* | మగుడు | |
| అట్ =జలనిమజ్జనె *to dive, or sink in water* | ఆడు | |
| బాట్ =జీవనె, *to live* | బ్రదుకు రకారము డకారస్థమై యున్న రూపము— | బడు |

"బాడుదల" పట్టు (= జీవగ్రాహంగృహీత్వా) అను పదబంధములో నిలిచియున్నది.

| | | |
|---|---|---|
| పోఱ్ = విదారణె, *to cleave assunder, split* | పొడుచు | |
| పూఱ్ = ఆచ్ఛాదనె, *to cover* | పూడు, పూడుచు | |
| వీఴ = పతనె = *to fall* | పీడు | |
| ఏఱ్ = ఉత్థానె = *to raise* | ఎక్కు = ఏఱ్ + కు = ఏఱ్కు > ఎక్కు. *cf.* ఏతాము, ఎగుమతి | ఏఱ |
| ఏఴు = సప్త = *seven.* | ఏడు | ఏఱ్ |
| ఉఴైక = *work, seruise* | ఊడిగము | ఉఴై = *to toil.* |
| ఒఴుకు = నదీప్రవాహే, *to flow* | ఒలుకు, ఓడు | ఒళుగు. |
| కఴి = *sour gruel.* | కలి (అంబలి) | కళి |
| కఴి = గర్భం. | గాడిద | కళుతె |
| కఴి = *a bamboo pole.* | గడ | కళ్లై |
| కాఴు = *forest.* | కాడు | కాడు |
| కీఱ్ = *the state of being low* | క్రిందు | కీఱ్ కీఱుకు |
| కూఱ్ = *boiled rice* | కూడు | కూళ్ |
| కుఱ్ గు = *to contract, shrink* | క్రుంగు. | |
| కూఱ్ = *a stupid, vile man* | కూళ | కూళై |
| కొఴవి = *tube* | కళాయి, కోళాయి. *cf.* క్రోవి. | కుళాయ్ |

| | | |
|---|---|---|
| కోఴి=*A cock, hen* | కోడి | కోళి |
| తల్లఱం=భయం | తల్లడము_తల్లడిల్లు | |
| తాఴి=*palmyra* | తాడి (చెట్టు) | తాళి |
| తుప్పాటు=పక్షిరోమం | త్రుప్పాడు=గొఱ్ఱెబొచ్చు | |
| తేళ్=వృశ్చికం | తేలు. | |
| నిఴల్=*shade.* | నీడ | |
| పఴియిగె=కేతనం | పడగ (*cf* గాలిపడగ) (పగడ) | |
| పఴుకై=*bed* | పడక | పడుక్కై |
| పఴి=*to abuse, to rebuke* | ప్రయి *cf.* ప్రయికట్టు | పళి |
| పాఴిల్=*A dwelling place, a town.* | ప్రోలు ఇది "ఴ" కారముతో కూడిన పదముగావున నే కొన్ని ప్రాచీన తెలుగు శాసనములలో "పుఴోలు" అనురూపమున గనబడుచున్నది. పుఴోలు ప్రోలు అయినది | పాళిల్=*a country* |
| ముఴ్గు=*to sink under water* | ముణుగు, ములుగు ముడుగు | ముళ్గు |
| మొఴ=*cubit* | మూర | మొఴమ్ |
| మొఴగు=*to bend, to bow* | మ్రొక్కు | |
| పాఴ్త్తి=ప్రయోజనం | ప్రాతి. (*cf.* ప్రాతియె=ఒక లెక్క) | |
| బోఴతల=*bald* | బోడితల. | |
| మొఴగు=*to sound as an instrument* వాద్యం | మ్రోగు. *cf* (కుక్క మొరుగు) | |

| | | |
|---|---|---|
| హాఱుదు=*old* =పఴదు, | ప్రాఁత cf పండు=*fruit.* | పఴ పఴమ్=పండు |
| హాఴ్ <పాఴ్ *ruins, destruction* | పాడు | పాఴ్ |
| హుఱు>పుఴు *A worm* హుఱుకు. | పురుగు *cf.* పుచ్చు= పుర్+ఉచు పుర్చు> పుచ్చు. | |
| హాట్>పేఴ్, పేఴ్ | ప్రేలు | పేచు |

ఇట్లే శకట రేఫముతోఁగూడిన శబ్దములుకూడ సమానార్థకములై సజాతీయములై యీ భాషలన్నిటిలో సమానముగఁ గనఁబడుచున్నవి అనేకములు కలవు. కొన్నిటిని మాత్రమే యిచ్చుటఁ దెల్పెదను. క. మెఱె-విడంబె-తె మెఱయు, తెఱె—అనావరణె-తెఱచు, నెఱె-సమగ్రత్వే, నెఱ, మఱె-విస్మరణె, మఱచు, తోఱె-విసర్జనె, తొఱఁగు, అఱి=జ్ఞానే, ఎఱుఁగు; పఱె=విచ్ఛిత్తౌ, *cf.* పఱియ (వాపంగ *etc*);ముఱి-మోటనే ఖండేచ, ముఱియ, తఱె=ఛేదే,తఱుగు, నుఱె-సంచూర్ణె, నుఱుము; మీఱు-అతిక్రమణె; మీఱు, కేఱు - ఫూత్కరణె, చెఱుగు, తోఱు - దర్శనే - (తోర్చు)=తోఁచు *cf.* త్రోవ, కాఱు-వమనే, క్రక్కు; కెదఱు—వికీర్ణె, చెదరు; బెదఱు-వ్యస్తే, బెదరు; కిఱు-వ్యవధానె, క్రిక్కిఱియు, కొఱె - ఖండనె, కొఱత; ఆఱు - నిర్ద్రవే, (తడి) ఆఱు.

ఈ శకటరేఫము ద్విత్వమైనచో నది టకార రేఫ సంయోగమువలె పలుకఁబడుచుండుట ద్రావిడభాషాసంప్రదాయ సిద్ధము. అది యిప్పటికిని తమిళమునఁగలదు. ఈ

సంప్రదాయమునుబట్టి యాంధ్రమున ద్విరుక్తటకారముతోఁ గూడిన రూపములుకొన్ని బయలు దేరినవి. వైయాకరణులు చారిత్రక దృష్టితోఁ బరిశీలించినవారు కాకపోవుటచే దీని తత్త్వమును గ్రహింపక ఆయా సందర్భముల దిరుక్త టకార విధానము మాత్రముచేసిరి. చిఱు+ఎలుక - చిఱ్ఱు > చిట్ఱు > చిట్టు+ ఎలుక = చిట్టెలుక - అయినది మాఱు— మాఱ్ఱు = మాంట—అనఁగా మాఱుబలుకుట. ఊఱు నుండి, ఊఱ్ఱు - ఊట్టు (*to flow, to leak*) ఊట, మొదలగున వేర్పడినవి.

ఉఱి-నుండి-ఉట్టి.

కఱ్ఱ-కట్టె.

త. కుఱ్ఱు (*to pound, strike*) కొట్టు

త. చుఱ్ఱు—తె. చుట్టు, చుట్ట.

త. కుఱ్ఱు = తె. కొండ, గుట్ట.

త. పుఱ్ఱు = తె. పుట్ట, కన్న. = పుత్తు.

తె. మిఱ్ఱు-మిట్ట. కఱచు-నుండి-కాటు, గీఱు నుండి గీఁటు, చిఱునుండి చిట్టి, తేఱు నుండి తేట. ఇట్లు ట, ట్టలతోఁ గూడిన యనేక శబ్దములకుఁ బూర్వ రూపములు శకట రేఫముతోఁ గూడినవేయని తెలియవచ్చుచున్నది. ఈ పూర్వరూపమునకు సన్నిహిత ద్రావిడభాషలలో వెదుక వలసినదేగాని సంస్కృతప్రాకృతములలోగాని, ఇటీవలి ఉత్తరహిందూస్థానార్యభాషలలోగాని వెదకిన లాభము లేదు.

ఇట్లే కొన్ని సూత్రములనుబట్టి ఆంధ్రభాషాశబ్దముల పూర్వస్వరూపమును, చరిత్రను, కాలక్రమమున నవిమాఱుచు వచ్చిన విధమును ఇతర ద్రావిడభాషలలోని ధాతువులతోను

రూపములతోను సరిపోల్చి కనిపట్టవలసియున్నది. మచ్చుకు మఱియు రెండు విధానములను దెలిపెదను.

తాలవ్యీకరణవిధానము—దీనినే '*Law of palatalisation*' అని చెప్పుదురు. అకారమునకు క వర్గకు స్థానము కంఠముగదా! కావున వీనిని కంఠ్యములందురు. ఇకారమునకు, చవర్గమునకు, యకారమునకు స్థానము తాలువు—కావున వీనిని తాలవ్యములందురు. పలుకుబడిలో కకారము పై అకారమున్నచో రెండును కంఠ్యములే కావున కకారము కంఠ్యముగనే నిలుచును. కాని కకారముపై తాలవ్యమగు ఇకారముగాని ఎ. ఏలుగాని, యకారముగాని నిలిచినచో నా కకారము కొంతవఱకు తన కంఠ్యత్వమును బోఁగొట్టుకొని తాలవ్యంబగు "చ" కారమువలె పలుకఁబడుట తటస్థించును.

కావుననే కొన్ని ప్రాచీన శబ్దములందలి కి, కీ, కె, కే, వర్ణములు కాలక్రమమున పలుకుబడిలో చి, చీ, చె, చే, వర్ణములతోఁ గూడినవిగా మాఱిపోయినవి. తెలుఁగు భాషలో నీవర్ణములతోఁ గూడియున్న శబ్దములలో ననేకము లిట్టి మార్పులవలన నేర్పడినవే. కొన్నిటిలో రెండురూపములు మనభాషలోనే గానవచ్చును. కొన్నిటి విషయములో కకారసహిత రూపము లితరభాషలలో మాత్రమే నిలిచియుండుట తటస్థించును. అట్టివానిని వెదకి, సరిపోల్చి, గ్రహింపవలసియుండును. ఇట్లు ఇతర సన్నిహిత భాషారూపములతోఁ బోల్చి పరిశీలించినగాని యొక భాషలోని పదములచరిత్రము వాని పుట్టుక పూర్వోత్తరములు బయలువడ వన్నమాట.

మన తెలుఁగులోని చకారాది శబ్దముల నేకము లీతాలవ్యీకరణ విధానము మూలముగా నేర్పడినట్లేయున్నవి. చూడుడు.

చిలుక–దీని తమిళ కన్నడరూపములు కివర్ణములతోఁ గూడియున్నవి. త. క.–కిళి–గిళి=చిలుక యనియే యర్థము. ఈ రెండు నొకశబ్దముయొక్క విభిన్నరూపములే. ఇందు మఱియొక విశేషమేమనగా–తెలుగులోవలె తుదిని క కారము లేదు. ఈ క కారమెట్లువచ్చినది ముందు తెలిపెదను. *
చెయి, చేయి–కై!, కేలు మొదలగు రూపములు తెనుఁగున నే గలవుగదా! కన్నడమున కెయ్. గెయ్–ధాతువు, తెనుగున "చేయు" ధాతువు. ఇందలి క కారమునకు తాలవ్యాచ్చు అగు ఎ కారము పరమగుట చేతనే, దీని సాహచర్య బలముచే క కారముకూడ తాలవ్యమై చ కారముగామారినది. కావుననే మన భాషలో ప్రాచీనంబులగు కై, కయి, కేలు మొదలగు క కారాదిరూపములతోఁబాటు, అర్వాచీనంబులగు చ కార సహిత రూపములుకూడ వాడుకలోనికి వచ్చియున్నవి. క కారరూప మొకప్పు డీ భాషలో నంతరించి పోవచ్చును. చ కార సహితరూపమే మిగిలియుండవచ్చును. అప్పుడితర సన్నిహిత భాషలలో దీనికి సమానార్థకమైన క కారసహితరూపమును కనిపట్టినచో నీ భాషల సాజాత్యము సన్నిహితత్వము, ఆయాపదముల ప్రాచీనచరిత్ర మొదలగు వానిని మనము తెలిసికొనుట కవకాశ మేర్పడును.
చేను–cf. కయ్య–కయ్యలు=మడి (కైయ–ప్రాచీన రూపమై యుండును.)

*ఇది బహువచనప్రత్యయమగు "కళ్"అను దాని యవశిష్టభాగము.

చేదు–cf. త. కన్న. కయ_to be bitter, astringent

చెన్ను –(చెందొవ–కెందమ్మి) కెం, కెంపు శబ్దములు కకార సహితము లీ భాషలోనే గలవు.

చెవి–కన్న. కివి, కివి, (ear) cf. కేళ్–ధాతువు–వినుట అను నర్థము కలదు. త. కేళ్వి= (ear, hearing)

చెవుడు– cf. కన్న–కివడు, కివుడు.

చెడు, చెడ్డ. కన్న.–కిడు (to go to ruin) త. కెడు, కెట్టు–(to perish, to be destroyed, to decay, rot)నశించు, క్రుళ్లు.

త–కెడుదల్ (ruin) కెడుది–తె–చెడుగు.

త–కెడుకాలం–చెడ్డకాలము.

చిచ్చు–అగ్ని,కన్న.–కిచ్చు (Fire), కాళ్ కిచ్చు=కాఱుచిచ్చు wild fire.

చిఱుగు–cf. త–కిఱి to be torn, rent into shreds, burst out.

చింపుట–cf. త. కిఱి త్తల్

చీలిక–త. కిఱి, a piece of cloth torn of.

చిలుము– కన్న.–కిలిబు, కిలుబు, త–కిళిమ్బు

చీము } కన్న.–కీ–(రక్తపక్వ త. చీఴ్, మ–చీ
చివుకు–చీకు } to become pus

చెక్కిలి, చెక్కు–. కన్న.–కెక్కె, త. కన్న

చెఱువు–కన్న. కెఱె; త. చెఱై–tank.

చెలిమి– } కన్న. కెళె, త. కెళి–friendship
చెలువుడు– } త. కెఴువు–to unite, to embrace. కెఴుప్పు–friendship.

చెదురు- క. గెదరు, త. చెదఱు
చెట్టు- కన్న. గిడ, త. చెడి (*a tree.*
చెక్కు-- కన్న. కెత్తు; త. చెదుక్కు--(*to chip*)
చెఱుగు } -(*to winnow*)_కన్న. కేఱు-(శూర్పకరణే)
చేట }
చెనకు-(*to provoke*)-కన్న. కెణకు.
చెదరు- *to scatter*_కన్న. కెదఱు. త. చెదఱు
జేన_(*a span*)_కన్న. గేణ్, గెణ, త. చాణ్, శాణ్
చీఱు-కన్న. కీరు, గీఱు- తె. గీఱు, గీఱు. గీయు *to scratch*
చెదలు. కన్న. గెదలు, మ. చిదల్, త. చిదలై, చిఱుక-కన్న.

కాని క కారము తాలవ్యాచ్ఛరకముగానిచో నీ మార్పు కనఁబడుటలేదు.

కన్న-తమి; తెలుగు.
కణ్-కన్ను, *eye*
కడల్_కడలి, *sea*
కట్టు-కట్టు, *to bind*
కన్దు_కన్దు, *a calf.*
కరె-కరి, *bank, shore.*
కల్-కల్లు, *stone.*
కాడు_కాడు, *forest.*
కాల్-కాలు, *foot.*
కుట్టు_కొట్టు, *to beat.*
కురుడ-గ్రుడ్డి, *blind.*
కుణి-గొయ్యి, *a pit.*

కొమ్ము-కొమ్ము, *a horn*
కొళ్-కొను, *to take*

తాలవ్యాచ్చరకములగు కకారగకారములు తాలవ్యములుగ మాఱకుండ నిలిపికొనిన శబ్దములు కన్నడభాష యందు హెచ్చుగాఁ గనఁబడుచున్నవి. కావున నాభాష యీ విషయమునఁ బ్రాచీన శబ్దములను నిలిపికొనియున్నదని తలంపనగును.

వర్ణవ్యత్యయము—ఉచ్చారణమునందలి వేగము కారణముగాఁ గొన్ని పదములందలి వర్ణములస్థానములు తారుమారగుటంజేసి భాషాపదముల స్వరూపమునం దొకప్పుడు మార్పులు గలుగుచుండును. ఇట్టి మార్పునే "వర్ణవ్యత్యయము" (*Metathesis or euphonic displacement*) అని యందురు. దీని మూలమున నొక్క భాషలోనే గాని వేదా సజాతీయ భాషలలో గాని యొక్కొక్క పదమెట్టి మార్పులను బొందుచుండునో తెలిసికొనవచ్చును.

ఉలవు-బలము, పరిమాణము>లావు
ఉఱుగు } ఱాచు, ఱాపిడి, ఱాపు
అఱుగదీయు- } రాచు, రాపిడి, రాయిడి

త. అవన్->తె. అవన్డు>వాన్డు>వాన్డు > వాణ్డు > వాఁడు;
త.ఇళై, తె. ఎల(cf. ఎలదోట >లేఁదోట, లేఁత;
ఇళంగొంబు > లేఁగొమ్మ; అది-అదిని > దాని;
ఇవన్ > వీఁడు.

త. ఇల్ -> తె. లో, లోపల, లోఁతు, లోవ, లోయ.
త. ఉరైక్కల్, క. ఒరంగల్ > తె. రోఁకలి.

తెలుఁగులోని "ఉంట-ఉండ"-శబ్దము ఉరల్>ఉర్లు, ఉరలు, ఉరలఁబడు, ఊరలబాఱు, అనువానికి సంబంధించినవే.

త. క. ఏరు-(*to rise*) = పైకెగయుట. ఎక్కు, ఎగయు, మొదలగు రూపములు తెలుఁగున గలవు-కాని వీనిలో మూలధాతువునందలి "ర" కారమగుపడుట లేదు. ఎక్కు అనునది-ఏర్‌కు, రూపమునుండి యేర్పడినదే. కాని వర్ణవ్యత్యయముచే నేర్పడిన "రేగు" అను దానిలో మాత్రము రకారము నిలిచియున్నది లే-లేచు" ధాతువులుకూడ నీమూల ధాతువునుండి కాలక్రమమున నేర్పడినవే.

త. తె. ఇరు-రెండు. త. ఇరట్టు—రెట్టింపు.

కన్న-ఎలర్-(గాలి, వాయువు)-ఎరల్, తెంబెలర్-దక్షిణ వాయువు.

ఇది తెలుఁగున "తెమ్మెరల్"అయినది. ఎరల్ శబ్దముతోఁ గూడిన యీ పదము బహువచనరూప మనుకొని, నిత్య బహువచనాంతమని వైయాకరణులు చెప్పిరి. అంతేకాక "తెమ్మెర" అను నేకవచనరూపముకూడ పై దానినుండి యేర్పడినది తమిళమునఁ "తెన్ఱల్"—అనఁగా చల్లని వాయువు. తెన్నెరల్-అనుదానియందలి ఎరల్ శబ్దములోని అకారము లోపించుటచే "తెన్ఱెలు" అనురూపమేర్పడి యుండును.

త. క. ఉగిర్, ఉగిరు, (*nail*) > తె. గోరు

తె. అడఁగు > డాఁగు

తె-"అగు" ధాతువు-అగ్‌-కా్‌, అగుటన్ > కావుటన్
కావుటః రూపము భూతకాలముననే యేర్పడి యుండినది. కావునన్ రూపముకూడ నట్లే వర్ణ వ్యత్యయముచేతనే యేర్పడియుండవచ్చును. ఇది సంస్కృతమునందలి క్త్వార్థకమున వచ్చు "ఊన" ప్రత్యయముతోఁ గూడిన "కాతూణ" మొదలగు ప్రాకృతరూపముల మూలముగా నుత్తర హిందూస్థానభాషలలో నేర్పడిన "కాఊణ" అనుదానినుండి యేర్పడినదని తలంప నవసరము కనఁబడదు.

తె-గులిమి (కర్ణమలము), గులివి > గుబిలి-గుమిలి శబ్దములు కూడ కలవు.

తె. చిప్పిలు (ఒడ్డగిల్లు) > పిచ్చిలు

తె. గుబులుకొను > బుగులుకొను

తె. కుతకుత > తుకతుక. ఈ రూపాంతములకు వర్ణవ్యత్యయమే కారణము.

ద్రావిడభాషలలోఁ బదాదియందు సంయుక్తాక్షరము వచ్చు సంప్రదాయములేదు. కాని తెలుఁగులో ననేక ధాతువులలోను పదములలోను రేఫసంయుక్తవర్ణము కనఁబడుచున్నది. దీనికిఁ గారణము వర్ణవ్యత్యయమే యనఁదగి యున్నది.

తుఱ > త్రొక్కు

ముఱంగు > మ్రోగు-మోగు

కుఱ > గ్రొచ్చు-గ్రొయ్యి

పుఱు > ప్రుచ్చు-ప్రువ్వు-*cf.* తె-పురుగు-పుచ్చు

పేల్ > ప్రేలు-పేలుట
వరై-బరె > వ్రాయు
కురుడు > గ్రుడ్డి-గుడ్డి

ఇట్లు మన యాంధ్రభాషాపదములను సంప్రదాయములను సన్నిహితములగు దక్షిణదేశ భాషారూపముల తోడను, సంప్రదాయముల తోడను బోల్చి చూచినచో, దీని ప్రాచీన చరిత్రయు, నభ్యుదయక్రమమును గోచరింపక పోవు. మన భాష కిప్పటి చారిత్రక నిదర్శనములను బట్టి యాంధ్రమను పేరుగల్గుటకుఁ బూర్వము చిరకాలము క్రిందటినుండియు నీదేశమున వ్యవహారమున నుండె ననియు, నిది యాంధ్రరాజులు వారికాలపు స్థితిగతులబట్టి రాజభాషగా గ్రహించి శాసనాదులందు వాడిన ప్రాకృత భాషనుండి యేర్పడినది కాక, వారీ దేశమున నిత్యవ్యవహారమున నింటిభాషగా వాడుకొనియుండునట్టియు, నిప్పటి దక్షిణదేశ భాషలతో సాజాత్యము కలిగినదై యాకాలమున కే మూలద్రావిడమునుండి విడివడిన స్వతంత్రభాషగా నేర్పడి యున్నదనియు మనము దీనిని బట్టి గ్రహింపవలయును. ఇట్టి మన భాష యభ్యుదయ క్రమమునుగూర్చి, చరిత్రమునుగూర్చి బరిశీలించి తెలిసికొనవలసిన విషయము లపారముగాఁ గలవు. ఆంధ్ర విద్యార్థులును, విద్యాధికులును భాషాతత్త్వ పరిశీలన విషయమున వ్యగ్రోత్సాహులు, నాదరాయత్తచిత్తులునై యుందురుగాక. ఆంధ్రాభ్యుదయోత్సవముల విషయమున జూఁపబడుచున్న యీ యుత్సాహమే యీ భాషను వ్యవహరించు నాంధ్రుల నందఱ నేకకుటుంబముగను, సంఘముగను జేసి, వారి యుత్తరోత్తరాభివృద్ధికి సాధన భూతమగు గాక!

# 3

# ఆంధ్రదేశ్యము - అన్యదేశ్యము

ఇప్పుడు ప్రపంచమున వ్యవహారమందున్న భాషల వేలసంఖ్యచే లెక్కపెట్టవలసియుండును గదా! కాని వీనిలో నే యొక్కటిగాని యే యితరభాషతోను ఎట్టి సంబంధము లేక స్వతంత్రముగ నిలిచియున్నదని చెప్పుటకుమాత్ర మవకాశము లేదు. కాలగతిని మానవ సంఘములలోఁ బరస్పరము కలుగు సంబంధములవలెనే వారిచే వ్యవహరింపఁబడుభాషలకును బరస్పర సంసర్గము కలుగుచుండుటయు, నొకటి మఱియొక దానినుండి పదములను, పదబంధములను, రచనారీతులను మొదలగువానిని సంగ్రహించుచుండుటయు ననవరతము తటస్థించుచునేయుండును. కాని మానవసంఘమునందు వలెనే యీ సంసర్గఫలము భాషావిషయములోఁగూడ సులభముగ గుర్తింపఁబడకపోవచ్చును. అట్లైనను మానవసంఘమును గూర్చియుఁ జరిత్రకందని విశేషవిషయములను భాషాచరిత్ర సూచింపగలుగుచుండు ననుటకు సందేహము లేదు.

ఒక భాషలోని శబ్దములను, అభాషాతత్త్వమునుగూర్చి విచారించి వాని నితరభాషలతోఁ బోల్చి చూచినచో, నా భాషకు సహజములైన మూలపదము లేవో, అందే యే పదము లే యే కాలములందే యే భాషలతో గలిగిన సంసర్గముచే నందు జేరియున్నవో తెలిసికొను నవకాశము లీ కాలమునఁగలుగుచున్నవి. ఇప్పటి ఇంగ్లీషుభాషలలో ననేకములగు నితరదేశభాషాపదములు చేరినవని చెప్పఁబడుచున్నది. అట్లన్యదేశీయపదములను విరివిగాఁ దీసికొనుటవల

నసే యీ భాష యంతగా నభివృద్ధి నొందినదనియు దలంపఁ బడుచున్నది. ఇప్పుడది ప్రపంచమం దంతటను ప్రసిద్ధినొందిన భాషలలో ముఖ్యమైనదిగా నున్నది. దీని కాభాషను వ్యవహరించువారు భూభాగమునం దనేక దేశముల ప్రబలులై యుండుటయే కాక, అ భాషలో నాధునిక ప్రాపంచిక విజ్ఞానమంతయు నెలకొని యుండుటగూడ నొక కారణమని చెప్పవచ్చును. మొన్న మొన్నటివరకు హిందూదేశమున సంస్కృతభాష కట్టి స్థానమే కలదు. అది హైందవవిజ్ఞానమున కంతకు నాకరమై యుండుటచే హైందవుల నిత్యవ్యవహారమునుండి తొలగినను, ఈ దేశమున దాని కట్టి స్థానమే లభించినది. కావున నే అప్పకవి యిట్లు చెప్పియున్నాడు.

"తమతమ బాసల కవితలు
దమతమ దేశముల నొప్పిదములగుఁబర దే
శములకుఁ గూడ నొకింతయు
నమరో క్తులు సకలభూములందును వెలయున్.
తలఁపగ సంస్కృత కావ్యం
బులు తమ యర్థములు సకలభూజనములకున్
దెలిసినను దెలియకున్నను
బొలుపొందఁగనిచ్చు నాల్గుపురుషార్థములన్."

దేశీయ విజ్ఞానమున కాకరమగుటచేతనే యీ భాష నిత్యవ్యవహారమందు లేకున్నను, సర్వజనులకు దానియర్థము తెలిసినను, దెలియకున్నను పురుషార్థప్రదాయినిగా గ్రహింపఁ బడుచున్నది. ఈ దేశభాష అనుదానిలోఁగూడ ననేకములగు విదేశీయపదములు చేరియేయున్నవి. కాని తరువాతి వై యీ

కరణులు వాని యర్థములకుఁ దగినట్లు ధాతువులనుండి వ్యుత్పత్తులను గల్పించుటచే నవి యన్యదేశీయములుగాఁ బరిగణింపఁబడుట లేదు. పిక, కాకశబ్దములు రెండును కై, గై శబ్దే అను ధాతువునుండి నిష్పన్నములైనట్లు లింగాభట్టీయము చెప్పుచున్నది. కాని 'పిక' శబ్దము లాటిన్ భాషలోని '*Pecus*' అను శబ్దమునకు సంబంధించినది. ఇట్లే 'దీనార' శబ్దము గ్రీకుభాషలోని '*Dinarious*' అను శబ్దమునుండి వచ్చినది. ఇట్లే యీభాషలోనింక పారసీక, యవన, రోమక, బర్బరాద్యన్యదేశ భాషాపదము లున్నచో నట్టివానికి వైయాకరణులేవో సంస్కృత ధాతువులనుండి వ్యుత్పత్తులను గల్పింపఁబూనుట యుక్తము కాదని, కుమారిల భట్టాచార్యు లన్యదేశ్యపదముల కర్థనిర్ణయము చేయు టెట్లు అను విచారణసందర్భములోఁ దనతంత్రవార్తికమున హెచ్చరించి యున్నాఁడు.* సంస్కృతభాషకు లాటిన్, గ్రీకు మొదలగు భాషలతోఁ గల సజాతీయతను సం. పితా, లా. పెటర్, సం. సప్త-గ్రీ. సెప్టెం, లా. హెప్త, సం. భరామి-లా. ఫెరో, ఫెరో మొదలగు శబ్దములయు, వ్యాకరణ రూపములయు సామ్యమే వ్యక్తము చేయుచున్నది. కాని పిక, నేమ, దీనారాది శబ్దము లాయా భాషలలోనుండి యర్వాచీనకాలమున వచ్చి యిందు కలిసినవి. కాని వీనికన్నిటికిని సమానముగనే వైయాకరణులు వ్యుత్పత్తులను గల్పించినచో నేవి సజాతీయ

* "తద్యథా ద్రావిడభాషా స్వేదృశీ స్వచ్ఛందకల్పనా లదా పారసీకబర్బరయవన రౌమకాదిభాషాసు కిం వికల్ప్య కిం ప్రతిపత్స్యన్త ఇతి నవిద్మః"

ములో (*Cognate words*), ఏవి ఎరువుగా వచ్చి కలిసినవో (*Borrowings*) తెరువాతఁ దెలిసికొనుట కవకాశమే లేకపోవు నని యాతని యభిప్రాయము.

ఇట్లు ఆర్యులు హిందూదేశమున నెలకొన్న తరువాత వారి భాషలో దేశీయములగు శబ్దము లెన్నియైనను చేరి యుండునుగదా! కాని యట్లార్యభాషలో జేరిన శబ్దములను గనిపట్టి వానిని దేశీయములుగనో, లేదా విదేశీయములు గనో వైయాకరణులు పరిగణించిన ట్లగపడదు. క్రీ. శ. ౭-వ శతాబ్దిని కుమారిలభట్టు విదేశీయపదములకు వైయాకరణులు సంస్కృత ధాతువులనుండియే వ్యుత్పత్తులను గల్పింపజూతు రని చూపుటకు గొన్ని కొన్ని ద్రావిడ భాషాశబ్దములను గ్రహించినాఁడు. అట్టి పాప్, వైర్, అతర్ మొదలగునవి కూడ నుదాహరణమునకు మాత్రమే యతనిచే గ్రహింపఁబడి నవిగాని, ఆజదము లార్యభాషలోఁ జేరినవనికాదు. తరువాతి ప్రాకృతవైయాకరణులైనను ప్రాకృతభాషలలో జేరిన దేశీయ శబ్దములను 'దేశీనామమాల'లమూలమునఁ బ్రత్యేకించిచెప్ప దొడంగిరి. కాని సంస్కృతవైయాకరణు లట్టి పదములను ప్రత్యేకింప లేదు. వానికి కొన్ని ధాతువులను గల్పించి సంస్కృత పదములుగనే గ్రహించియుందురు. కావుననే దేశి, అన్యదేశి అను ప్రత్యేకపరిగణమున కవకాశమే లేకపోయినది. ఆర్యు లీ దేశమునకు వచ్చి నెలకొనిన తరువాత వారికిఁ దెలియని దేశీయములగు క్రొత్త వస్తువుల పేళ్లనైనను గ్రహింపక తప్పదుగదా! దేశీయులతోడి సంసర్గము పెరిగినకొలఁది తా మెంత నాగరకులైనను వారి భావములను, ఆచారములను

కొంతవరకైన గ్రహింపక యుండలేరు. ఆధునిక హైందవ నాగరకతయనునది ప్రాచీనమగునార్య నాగరకతయొక్కయు, దేశీయమగు ననార్యనాగరకతయొక్కయు సహజసమ్మిశ్రమముచే నేర్పడినదే యని తత్త్వజ్ఞులు తలంతురు. అట్లె ప్రాచీనార్యభాషలో వేదకాలమునందే-అనగా ఋగ్వేదభాష సజాతీయములగు తక్కిన ఇండోయూరపియన్ భాషలనుండి విశేషముగ మార్పునందలేదని చెప్పదగిన కాలముననే దేశీయపదము లనేకము లాభాషలోఁ జేరినట్లువిమర్శకులు చెప్పుచున్నారు. అట్టివానిలో ద్రావిడభాషలకు సంబంధించినవిగా నీక్రింది శబ్దములు తలంపబడుచున్నవి. అణు, అరణి, కటుక, కపి, కర్మార, కలా, కాల, కితవ, కుట, కుండ, గణ, నానా, నీల, నీహార, పుష్కర, పుష్ప, పూజన, ఫల, బిల, బీజ, మయూర, సాయం. వల్గు మొదలగునవి. కాలక్రమమున నీ భాషలోఁ బ్రవేశించిన యనార్యశబ్దము లింకను పెరుగుచువచ్చినవి. బ్రాహ్మణములు రచింపఁబడిన కాలమున కీక్రింది దేశీయపదములు కూడ నా భాషలోఁ జేరినవి. ఆటవ, ఆడంబర, కులాల, తండుల, తిల, మర్కట, వలక్ష, వల్లి, వ్రీహి, శవ మొదలగునవి.† కాలము గడచినకొలది కేవల వస్తుద్యోతకశబ్దములేకాక, భావావిష్కరణ రీతులుకూడ నీభాషలలోనికి సంక్రమింపదొడగినవి. కృ, భు, అస్ వంటి ధాతువుల సహాయమున నేర్పడిన భూతభవిష్యదర్థక రూప

† *Origin and Development of the Bengali Language by S. K. Chatterji.*

ములు (ఏధాంచక్రే, పాతయామాస, గన్యా, గన్తాస్మి మొదలగునవి) పాణినికిఁ బూర్వమే సంస్కృతభాషలోఁబొడసూపినవి. సంపూర్ణ క్రియరూపములకు బదులు క్త్వాంతరూపముల ప్రయోగముకూడ వాడుకలోనికి వచ్చినది. ఇంకను తరువాతి కాలమున నార్యజన సంఘమునకు దేశీయులతోడిసంబంధము, కలయిక పెరిగినకొలది, దేశీయు లార్యజనసంఘములోఁ జేరి వారి భాషను నేర్చికొని వ్యవహరింపఁదొడగినకొలది ఆర్య భాషలో దేశీయభాషా సంప్రదాయానురోధముగ ధ్వనుల యందు మార్పులు, లింగవిభక్తివచనాదులందు మార్పులు, క్రియారూపములందు, వాక్యనిర్మాణ పద్ధతులందు గూడ మార్పులు కలుగఁజొచ్చినవి. తొలి కాలమున నీ మార్పు లుచ్చారణ రీతులలో మాత్రమే పొడసూపినపుడు ప్రాచీనార్యభాష తత్తద్దేశభేదమునుబట్టి శౌరసేని మాగధి, మహారాష్ట్రి మొదలగు ప్రాకృతముల రూపమును బొందినది. ఈ ప్రాకృతావస్థయందు భాషారూపములలో మార్పులు గలుగుట, దేశీయపదజాలము విశేషముగాఁ జేరుట సంభవించినను, తరువాతి యాధునికార్యభాషలలోవలె వ్యాకరణ పద్ధతులందును, వాక్యరచనారీతులందును విశేషములగు మార్పులు కలుగలేదు. ఈ మార్పులు సహజపరిణామము వలననే కలిగినవని తలఁచువారు కలరు. కాని యివి చాలవరకు దేశీయములగు ద్రావిడభాషాలక్షణ సామాన్యములగుటచే, తద్భాషాప్రభావమే ప్రాచీనార్యభాషపై ప్రసరించి తత్తద్దేశ కాలానుగుణములగు మార్పులను గల్పించి, యాప్రాచీనార్య భాష తొలుత ప్రాకృత భాషలుగను, తరువాత తదపభ్రంశ

ములుగను తుద కుత్తర హిందూస్థానమున నిపుడు వ్యవహరింపఁబడుచున్న యాధునికార్యభాషలుగను, పరిణామమును బొందుటకు ప్రధాన కారణమైనదని తలంచుట యుక్తియుక్తముగఁ దోఁచకపోదు. పైనుండి వచ్చిన విదేశీయు లెంత నాగరకులైనను, దేశీయులను వారు మూలముట్టుగ నశింపఁజేయగలిగిననేమోగాని, వారితోఁ గలిసి దేశమున నివసింపదొరకొనినపుడు వారిభాషావిజ్ఞానముల ప్రభావము వీరిపై నొకకొంతయైనను బ్రసరింపక మానదుగదా!

ఇట్లుత్తరహిందూస్థానమందు వ్యవహారములోనున్న ప్రాచీన ప్రాకృతములు, ఆధునికార్య భాషలును గూడ ప్రాచీనార్యభాషాభవములే యగుటచేత ఇటీవల కొంతవిజాతీయ సంస్కారముగలిగినను, మొత్తముపై నందలిశబ్దజాలము వ్యాకరణరీతులు నార్యభాషా సంబద్ధములే యనుట సుప్రసిద్ధమే. అట్లే యైనను ప్రాకృతవైయాకరణులగు హేమచంద్రాదులు ఆ భాషలకు లక్షణము చెప్పినపుడు వానిని తత్సమము, తద్భవము, దేశి అని మూఁడు భాగములుగ జేసిరి. ఆ భాషలోని నామాన్య శబ్దజాలమేగాక యందలి వ్యాకరణరీతులు, సుప్తిఙంతములైన పదములు మొదలగున వన్నియుఁ జూడ ప్రాచీనాభాషాభవములే యగుటచే నా భాషలు తద్భవములగుటలో విప్రతిపత్తిలేదు. ఇందలి శబ్దజాలములో నెరువు తెచ్చుకొనిన దేశీయశబ్దములు కొన్ని గలుగుటచే అట్టివానిని వైయాకరణులు 'దేశి' యనువిభాగమునఁ జేర్చి చెప్పవలసి వచ్చినది. పైనుండివచ్చి కలసిన యీ 'దేశి' వర్గ మీ భాషలనుండి తొలగించినను, వానిస్వతంత్ర

స్థితి కెట్టి లోపము కలుగదు. ఈ దేశివర్గములో వస్తుద్యోతకములగు శబ్దములు మాత్రమే గాని వ్యవహారమునకు, వాక్య నిర్మాణమునకు నావశ్యకములగు సుప్తిజాది పరికరమేమియు నీ వర్గములోఁ జేరలేదు. కేవల శబ్దమాత్రము చేతనే వాక్యనిర్మాణము కాదుగదా! శబ్దము, లేదా ప్రాతిపదికము సుప్తిజాదులతోఁ గూడికాని పదముగాదు. పదముగాని సాకాంక్షితమగు వాక్యములో జేరదు. ఆకాంక్షాదిరహితము వాక్యముకాదు గావున అన్వయములేని కేవల శబ్దములచే వాక్యమెట్లేర్పడును? శబ్దము లొక భాషలోనివి మఱియొక భాషలోఁ జేరవచ్చునుగాని అన్వయరీతి వ్యాకరణపద్ధతి ఎరువుసొమ్ముగా మారునది కాదు, ఏ భాషాపద్ధతి ఆ భాషదే. రామ, ధర్మ, గురు మొదలగు శబ్దములు సంస్కృతభాషా సంప్రదాయమున రామః, ధర్మః గురుః అనురూపములను బొంది వాక్యమునఁ బ్రయోగింపఁబడుచున్నవి. ఇవే ప్రాకృతమున రామో. ధమ్మో, గురు అనియు, ఆంగ్ల భాషలో రామ, ధర్మ, గురు అనియు, తెలుగులో రాముడు, ధర్మము, గురువు అనియు తత్తద్భాషావ్యాకరణ సంప్రదాయానుసారముగ మారుచున్నవి. ఇట్లా శబ్దము లీ భాషలలోనికి సంక్రమించినను, వానిని వాక్యమునఁ బ్రయోగించునపుడవి పొందు మార్పులు తత్తద్భాషాసంప్రదాయానుసారములై యుండక మానవు. ఈ సంప్రదాయములను బట్టియే ప్రధానముగా భాషల ప్రత్యేకత యేర్పడుచుండును. "రామం పూజయంతి-రాముని పూజించుచున్నారు." ఇచ్చట శబ్దములు సమానమే యైనను పదములు భిన్నరూపములఁ దాల్చినవి.

*They worship Rama* అనుచోట వాక్యనిర్మాణమే మారినది. కావున శబ్దములు సమానమే యైనను వానిని వాక్యమునఁ బ్రయోగించు రీతినిబట్టి భాషలు భిన్నము లగుచున్నవి. కావున దేశీయశబ్దములు ఇతర దేశభాషలలోఁ జేరినను అవి తద్భాషాసంప్రదాయముల కనుకూలములగు మార్పులతోనే వాక్యమునఁ బ్రయోగింపఁబడుచున్నవి. ఇట్టివి దేశ్య శబ్దములు గావున 'దేశి' శబ్దవాచ్యములైనను యూరపునందలి భాషలతో సజాతీయములగు సంస్కృతాద్యార్య భాషలకివి సహజముగ విదేశీయులే గావున నా దృష్టితోఁ జూచినపుడు వీనిని అన్య దేశ్యము లనియే చెప్పవలసి యుండును. కాని ప్రాకృత భాషలు సంస్కృతభవము లగుటచే. వైయాకరణులు స్వరముల మార్పులవలన సందుండి గలిగిన శబ్దములను 'దేశి' యను పేరనే విభాగించినారు. ఇది ఉత్తర హిందూస్థాన భాషల స్థితి.

తొలుత వైదిక సంస్కృత భాషలలోను, పిదప ప్రాకృతాదులలోను చేరిన యీ దేశిశబ్దము లనునవి ఆర్యులీ దేశము చేరునప్పటి కీ దేశమున నివసించుచున్న కోలులు, ద్రావిడులు మొదలగు జాతులవారి భాషలలోనివై యే యుండవలయును గదా! అట్లుగాక ఇప్పటి భారతీయభాష లన్నియు సంస్కృత భవములో, ప్రాచీనార్య భాషాభవములో యగు నన్నచో నార్యులీ దేశమునఁ బ్రవేశించునప్పటి కీ దేశము నిర్జనమై యుండెననికాని, లేదా వా రీ దేశమువారిని సంపూర్ణముగ రూపుమాపిరనిగాని చెప్పవలసి యుండును. అట్టి నిదర్శనములు లేకుండుటయే కాక మతసాంఘిక సంస్కారాది విషయము

లందు వలెనే భాషా విషయమునను జరిగినట్లు తెలియవచ్చు చున్నది. ఆర్యులీ దేశమునకు వచ్చునప్పటికి అనార్యజనులు (దస్యులు, వ్రాత్యులు, మ్లేచ్ఛులు మొదలగువా రనేకులు) ఈ దేశమున నెలకొనియుండి వారి నడుగడుగునకుఁ బ్రతిఘటించుచు వచ్చి రనుటకు ఋగ్వేదాది వైదికవాఙ్మయము నందలి నిదర్శనములే చాలును. ఈ యనార్య జనములో నిప్పుడు దక్షిణదేశమున వ్యవహరింపఁబడు ద్రావిడభాషలన బడువానితో సజాతీయములని చెప్పదగిన భాషలనే మాట్లాడిన వారుకూడ ఆ కాలమున నుత్తర దేశమున నెలకొనియుండి క్రమముగఁ దూర్పుదేశము నాక్రమించుచుండిన యార్యులను ప్రతిఘటించినవారిలో నుండిరనుటకు నిప్పటికిని పశ్చిమోత్తర భాగమున వ్యవహారమున నిలిచియుండి ద్రావిడభాషా కుటుంబములోఁ జేరిన బ్రాహూయీ భాషయే నిదర్శనము. అతి ప్రాచీనమగు మొహెంజోదారో నాగరికతయంతయు దేశీయులగు ననార్యజాతులకు సంబంధించినదే యనికూడ తలంపబడు చున్నదిగదా? ఇది గాక ఆర్యులు వాయవ్యదిక్కునుండి తూర్పుదక్షిణభాగము లాక్రమించుచు వచ్చినకొలది యార్య సంఘములోఁ జేరని యనార్యజాతులవారు వారిముందు నిలువ లేక క్రమముగ భారతదేశమధ్యభాగమును,దక్షిణదేశమును అక్రమింపఁజొచ్చిరి. తరువాతికాలమున వీరిపై నార్యభాషా ప్రభావమెంత ప్రబలినను,సహజమగు దేశీయత వీరిభాషలలో రూపుమాసిపోవుట తటస్థింపలేదు. ఉత్తరహిందూస్థానమందువలె నిచ్చట అనార్యభాషలను రూపుమాపి యార్యభాషలు

వాని స్థానము నాక్రమింపలేక పోయినవి. ఆర్యభాషనుండి పదపరికరమును విశేషముగా గ్రహించినను ఇచ్చటి దేశీయములగు ననార్యభాషలు తమ సహజతత్త్వమును గోలుపోలేదు. కావుననే ఇప్పటికిని భారతదేశ మధ్యభాగము నాక్రమించి యున్న కొండజాతివారు మాట్లాడు ఖాండ్, మాల్తో, కుయి మొదలగు భాషలు ఇటు దక్షిణ దేశభాషలగు తెలుగు, తమిళము మొదలగు భాషలతోను, అటు బ్రాహూయీ భాషతోను సోదరభావమును వహించి యేకకుటుంబమునకుఁ జెందినవిగానే యున్నవి. దీనినిబట్టి యొక కాలమున నిప్పుడు బ్రాహూయీ భాష మాట్లాడువారు నివసించు పశ్చిమోత్తర దిగ్భాగమునుండి హిందూదేశ మధ్యభాగమునను, దక్షిణ దేశమునను గూడ-అనఁగా దాదాపు హిందూదేశ మంతటను గూడ నిప్పుడు ద్రావిడ కుటుంబ మనఁబడు దానిలోఁ జేరిన భాషలను మాట్లాడిన జనమే యాక్రమించియుండెనని యూహించుట కవకాశ మేర్పడుచున్నది. ఆర్యులీ దేశమును క్రమక్రమముగా నాక్రమించుకొని వచ్చుచుండి రనుటకు వైదిక వాఙ్మయమున గానవచ్చు బ్రహ్మావర్త, ఆర్యావర్తాది విభాగమే నిదర్శనమగుచున్నది. భాషావిషయమునఁ గూడ ప్రాచ్యదేశమునందలి వానికంటె ఉదీచీ దేశమునందలి భాషయే పరిశుద్ధమైనదని, ప్రాచ్యభాగమునకు వచ్చినకొలది ఆర్యభాష సాంకర్యమును జెందుచుండినదని ఆకాలపువారు తలంచినట్లు స్పష్టము. "తస్మాద్ ఉదీచ్యాం దిశి ప్రజ్ఞాతతరా వా గుద్యతా. ఉదంచ, ఉ, ఏవ, యంతి వాచం శిక్షితుం,

యోవా తత ఆగచ్ఛతి తస్యవా శుశ్రూషంత. ఇతి"* (శత పథ బ్రాహ్మణము). బ్రహ్మావర్త మనునది-ఇదియే మధ్య దేశమనికూడ చెప్పబడును-సరస్వతీ దృషద్వతుల నడుమగల దేశము. అనగా వింధ్యహిమాలయముల మధ్యను, తూర్పున గంగాయమునల సంగమము గల ప్రయాగయే సరిహద్దుగా గలది. ఒక కాలమున దీనికితూర్పున గల దేశములు, కోసల. మగధ, వంగ, రాఢ మొదలగునవి. అనగా నిప్పటి బిహారు, బెంగాలు దేశభాగములు ఆర్యనివాసయోగ్యభూములు కాక పోవుటచే నచ్చటికిఁ బోగూడ దను నిషేధము, వెళ్ళినవారికి ప్రాయశ్చిత్తముకూడ ధర్మశాస్త్రములలో విధింపఁ బడినది.

"అవంతయోఽంగమగధాః సురాష్ట్రోదక్షిణాపథాః
ఉపావృత్సింధుసౌవీరాః ఏతే సంకీర్ణ యోనయః.

ఆరట్టాన్, కారస్కరాన్, పుండ్రాన్, సౌవీరాన్, వంగాన్, కళింగాన్, ప్రానూనా నితిచగత్వా పునస్తోమేన యజేత 'సర్వపృష్టయావా.

పద్భ్యాం స కురుతే పాపం యః కళింగాన్ ప్రపద్యతే." (బోధా. ధర్మ. సూ. ౧-౧-౩౦)

వంగదేశము నాశ్రయించియున్న వంగ, పుండ్ర. రాఢ మొదలగు జనులు మ్లేచ్ఛజనులుగాఁ బరిగణింపఁబడి యున్నారు. ఐతరేయ బ్రాహ్మణమున నీ పుండ్రులతోఁ జేర్చి

---

"*In the Northern quarters is speech utterd with more discernment, and North ward go men to learn speech; he who comes whence, to him men hearken."

ఆంధ్రులు కూడ మ్లేచ్ఛులుగనే గ్రహింపఁబడియున్నారు. "త ఏతే ఆంధ్రాః పుండ్రాః పుళిందాః మూతిబాః." దీనిని బట్టి అవంతి, మగధ, అంగ, వంగ మొదలగు ప్రాచ్య దేశములన్నియు నొకకాలమున బ్రహ్మావర్తమునఁ జేరక, అనఁగా నార్యులకు నివాస భూములు కాక, అనార్యులు, మ్లేచ్ఛులు ననఁబడు దేశీయులచే నాశ్రయింపఁబడియున్నవనియు, కాలక్రమమున నీ దేశములుకూడ నార్యులచే నాక్రమింపఁబడినవనియు దెలియుచున్నది.† వంగదేశము ఆర్యాక్రమణమునకుఁ బూర్వము అనార్యజనులకు నివాసమైయున్నదనియు, నచ్చటి ప్రాచీనభాష అనార్య భాషయే యనియు, మిథిల మగధదేశము లార్యవిజ్ఞానమునకు, భాషకు స్థానములైన పిదపనే వంగదేశమున నార్య విజ్ఞానము, భాష వ్యాపించినదనియు నిశ్చయింపఁదగియున్నది. ఇది సుమారు క్రీస్తుశక ప్రారంభమున కావచ్చునని తద్భాషా చరిత్రకారుఁడగు సునీతికుమార ఛటర్జీగారి యభిప్రాయము. అంతకుఁబూర్వ మచ్చట నివసించియున్న జనులలో కోల్, ద్రావిడజాతులువారుకూడ నుండియుందురనియు; ఆ కారణముచేతనే తరువాత గలిగిన ఆర్యభాషాప్రాబల్యమునుబట్టి బెంగాలీభాష ఇప్పు డార్యభాషాజన్యమే, లేదా ప్రాకృత జన్యమే యనీ తలంపఁబడుచున్నను ఆ భాషలో ద్రావిడ భాషాసంప్రదాయములు విశేషముగాఁగనఁబడుచున్నవనియు నాతఁడు నిదర్శనపూర్వకముగాఁ దెలిపియున్నాఁడు. ఒక్క

† ఈ దేశములలో నగ్ని ముందు ప్రవేశించి పవిత్రమైనవానినిగాఁ జేసినట్లు కథలు గలవు.

బంగాళీభాషలోనేగాక ఇతరములగు అధునికార్యభాషలలోఁ గూడ నీ ద్రావిడభాషా సంప్రదాయములు కనఁబడుచునే యున్నవి. కావుననే అర్యా లీ దేశము నాక్రమించుటకుఁ బూర్వ మీ దేశ మంతటిలోనుగూడ ననార్యులగు ద్రావిడ జను లచ్చటచ్చట నివసించియేయుందురని, ఆర్యజనులా యాక్రమణమును తొలికాలమున ఆఫ్ఘనిస్థానము. పంజాబు ప్రాంతముల నుండి ప్రతిఘటించినవారిలో నీ ద్రావిడభాషలను వ్యవహరించిన జనులుకూడ నుండియుందురనియు నిశ్చయింపఁదగియున్నది. ఉత్తర దేశము క్రమముగా నార్యుల వశము కాఁజొచ్చినపిదప వీరిలోఁ గొందర చ్చట నిలిచిపోయి యార్యజనసంఘములోఁ గలిసి వారి భాష నభ్యసింపఁగా, మరికొందరు దక్షిణాభిముఖులై స్వీయభాషను వ్యవహరించు జనులఁతో గలిసిపోయియుందురు. ఇట్టివారినే యార్యులు ద్రావిడులని చెప్పియుందురు. తొలుత జాతివాచకముగా వెలసియుండిన 'తెలంగు' శబ్దము తరువాతి కాలమున 'త్రిలింగ' శబ్దభవముగా పండితులచే సమర్థింపఁబడుచుండినట్లుగానే 'తమిళ్' శబ్దముకూడ తరువాతి కాలమున 'ద్రావిడ' శబ్దభవముగనో, లేదా దానికి ప్రకృతిగనో సాధింపఁబడుట తటస్థించినది. ఎట్లైనను దక్షిణ దేశీయములు, ద్రావిడ శబ్దసంకేతములు నగు తెలుగు తమిళ కన్నడాదులును, వీనికి సంబంధించిన బ్రాహూయీ, గోండు, మాల్తో, కుయి మొదలగు నాటవికభాషలును ఆర్యు లీ దేశమునకు వచ్చుటకుఁ బూర్వమే యీ దేశమున వ్యవహారములో నుండిన వనుటకు సందేహము లేదు. కావున నార్యభాష

లనుబట్టి చూచినపుడివి దేశీయములే. వీనిలో నార్యభాషా శబ్దములు చేరినవు డవి అన్యదేశీయములే యగును గాని వేరు కావుగదా! హిందూస్తానీ, ఇంగ్లీషు మొదలగు భాషలలోని తాసిల్ దారు, ఆసుపత్రి, లాంతరు, రోడ్డు మొదలగు శబ్దములు తెలుఁగున జేరినట్లే పుడమి, సిరి, వాక్కు మొదలగునవి పంస్కృతమునుండి వచ్చిచేరినవి. మరి కొన్ని అకారాంత శబ్దములు రాముఁడు. వనము మొదలగునవి తెలుగు ప్రత్యయములను గ్రహించినవి. అట్లే దీర్ఘ సమాసములును చేరినవి. ఇట్లీ భాషలో సంస్కృతభాషలోని శబ్దములే వచ్చి చేరినవి గాని యార్యభాషలే యగు ప్రాకృతములు, ఆధునికములగు నుత్తరహిందూస్థాన భాషలలోవలె సంస్కృతభాషలోని పదములు (అనగా సుప్తిఙంతములగు పదములు) కూడ తద్భవములుగా చేరలేదే, "రాజ్ఞో వాశిష్ఠిపుత్రస్య మహాదేవీ అజ్ఞాయపతి" అను సంస్కృతశబ్దములను అట్లే "రణ్ణోవాసిఠీపుతస్స మహాదేవీ ఆణవేది" అని ప్రాకృతముగా చెప్పుటకవకాశము కలదు. కావుననే యీ భాషలు సంస్కృత భాషా జన్యములనియో, లేదా ప్రాచీనార్యభాషాజన్యము లనియో చెప్పగలుఁగుట. పై పదములను తెలుగుభాషలో చెప్పవలెనన్నచో, ఆశబ్దములనే గ్రహించి చెప్పినను అన్వయము, పద్ధతి అంతయు మార్పక తప్పదుగదా! "రాజుఅయిన వాసిష్ఠిపుత్రునియొక్క...మహాదేవి...అజ్ఞాపించుచున్నది." ఈ అన్వయపద్ధతి, రూపనిష్పత్తి సంస్కృత ప్రాకృతములకంటె భిన్నమేగదా. సంస్కృతము మొదలగు ఇతరభాషలలోని ప్రాతిపదికలు, ధాతువులు నెన్ని యీ భాషలో చేరినను,

వాక్య నిర్మాణపద్ధతిమాత్రము (*Syntactical form*) దక్షిణ దేశీయమేయై, ద్రావిడభాషాసామాన్యపద్ధతి ననుసరించినదే గాని ఆర్యభాషాపద్ధతి ననుసరించినది గాదు. ఆధునికార్య భాషలలో దక్షిణదేశీయ వ్యాకరణ పద్ధతి సంక్రమింపకపో లేదు. దేశభాషల లక్షణరచనాపద్ధతి మాత్రము పాణిన్యాదుల సంస్కృతభాషావ్యాకరణప్రణాళిక ననుసరించి రచింపఁబడుట తటస్థించినది. అదియు నేత ద్భాషా సంప్రదాయ దృష్టితోఁ జూచినపుడు కొంత యనర్థహేతువేయైనదని చెప్పకతప్పదు. ఏమైనను, తొలికాలమునుండియు, శబ్దజాలము మాత్రమే వచ్చిచేరినదిగాని నిర్మాణపద్ధతి, వ్యాకరణరీతులు ఇందుచేర లేదు. ఇట్టివానిని లాక్షణికులు మొదటినుండియు వారి గ్రంథములలో వారించుచునే యుండి రనుటయే యిందుకు నిదర్శనము. తెలుగుభాషకుఁ దొలుత లక్షణము చెప్పిన కేతన ఈ విషయము నీ క్రిందిరీతిని సువ్యక్తమే చేసినాఁడు. సంస్కృతములను తెలుగు గావించు తెరంగును గూర్చి చెప్పుచు—

వృక్షేణదత్తాయ పక్షిభిః పుత్రస్య
యను విభక్తులు దెనుంగునకుఁ జొరవు
అస్తిప్రయాతి గాయంతిభుంక్తే సంతి
నయతి స్మరతి యను క్రియలు సారవు
గత్వా హసిత్వా ప్రకాశ్య సంత్యజ్య నా
దనరు త్వాంతల్యబంతములు సారవు
గంతుం పురీం రిపుం హంతుం సుతం పాతు
మను తుమున్నంతంబు లరయఁజొరవు

అపిచ తుహి ♦ ♦ వైన ♦ వా సను లనఁగ బెక్కు-
లవ్యయంబులు చొరవెందు నాంధ్రకవిత
బెరపదంబులతోడను దొరలినిల్చు
నవి తెనుంగులు గావింతు నభిమతముగ."

అని చెప్పినాఁడు. అనఁగా సంస్కృతప్రాదిపదికములు ధాతువులేగాని వాక్యనిర్మాణమున కావశ్యకములగు విభక్తి ప్రత్యయములతోఁ గూడినరూపములుగాని, అవ్యయాదులుగాని యిందు ప్రయోగింపఁబడవని నిషేధించినట్లయినది.* ప్రాకృత వ్యాకరణ విషయ మట్లుకాదు. ప్రాకృత వ్యాకరణ కర్తయగు హేమచంద్రుఁడు "అథ ప్రాకృతం" అను ప్రాకృత వ్యాకరణ ప్రారంభసూత్ర వ్యాఖ్యానసందర్భమున

* అట్లు అవ్యయముల ప్రయోగము నిషేధింపఁబడినను దేశమున సంస్కృతమునకుఁ గల ప్రాబల్యమువలన వ్యవహారములలో సదా, వృథా సర్వత్ర, మొదలగునవి కొన్ని చేరినవి. కవులును ప్రయోగించినారు. ఇవియును కేవల శబ్దములే. విభక్త్యంతములు గావు. అనంతుఁడు 'వృథ' యనుదాని ప్రయోగము నంగీకరించినాఁడు.

"వృథయను నవ్యయ మెంక్కుడు, ప్రథితంబై చెల్లు
గృతుల వృథ సేయక" అట్లె-సర్వదా-
"ఒకదివసంబు నానందకాననమునందు సర్వదా
సిద్ధించున్." (శ్రీనాథుఁడు. కాశీ.)

"స్వస్తి జగత్త్రయీ భువనశాసనకర్తష." (భాగవతము)

"నాకుఁ గించిత్తయిన మనోరథవంచన
మిచ్చోటలేదు." (జై. భార.)

సంస్కృతానంతరమున ప్రాకృతాను శాసనము సిద్ధసాధ్యమాన భేదము గల సంస్కృత జన్య భాషకే యీ లక్షణము గాని దేశ్యమునకుఁ గాదని జ్ఞాపకము కొరకని తెలుపుచు నీ ప్రాకృతమున ప్రకృతి ప్రత్యయ లింగ కారక సమాస సంజ్ఞాదులు సంస్కృతమందు వలెనే తెలిసికొనవలెననియు, లోకమునుండి కొంత తెలిసికొనవలసినది కూడ కలదనియు చెప్పినాఁడు. † ప్రాకృతాది భాషలవిషయమున నే ప్రకృతి ప్రత్యయ లింగ కారక సమాసాదులు సంస్కృతమునందు వలెనే తెలిసికొనవలసినట్లుగాఁ జెప్పఁబడినవో, అవే తెలుఁగు విషయమున భిన్నము లగుటచే "చొర వెందు నాంధ్ర కవిత" అని కేతన చెప్పవలసి వచ్చినది. కావుననే యితర భాషలనుండి శబ్దజాల మెంత వచ్చి చేరినను, తెలుఁగు ప్రాకృతాదులవలె సంస్కృతజన్య మగు 'వికృతి' భాష కాక ప్రత్యేక స్వతంత్రమగు భాషగా గ్రహింపఁ దగినదని దీనివలన వ్యక్తమగుచున్నది గదా. ఈ విషయమునే కేతనయు,

† "అథ ప్రాకృతం,, ప్రకృతిః సంస్కృతం. తత్ర భవం తత ఆగతం వా ప్రాకృతం. సంస్కృతానంతరం ప్రాకృతస్యాను శాసనం సిద్ధసాధ్యమాన భేద సంస్కృతయోనే రేవ తస్య లక్షణం న దేశస్య ఇతిజ్ఞాపనార్థం. సంస్కృత సమంతు సంస్కృత లక్షణేనైవ గతార్థం. ప్రాకృతేచ ప్రకృతి ప్రత్యయ లింగ కారక సమాస సంజ్ఞాదయఃసంస్కృతవ ద్వేదితవ్యాః. లోకాత్ ఇతి చ వర్తతే. అస్వరం, వ్యంజనం, ద్వివచనం, చతుర్థీ బహువచనం చ నభవతి.

(హేమచంద్ర ప్రా. వ్యాకరణం.)

న్నలు నిలువవు తెనుఁగులలో
నలవడగా బల్కుచోట నభినవదండీ''

ఇత్యాదులచే "తెలుఁగున సంస్కృత పదములు పలి కెడి తెఱఁ గెఱిఁగినంత ప్రవ్యక్తముగాఁ దెలిపితి" నని చెప్పినాఁడు కేతన.

ఇట్లే యీతని తరువాతి లాక్షణికుఁడగు పెద్దనయు నీతని మార్గమునే యనుసరించి

"పరగ సంస్కృతంబుపైఁ దెనుంగువిభక్తు
లునుపఁబడి పొసంగియుండెనేని
తత్సమంబునాఁగఁ దగ సంద్రు సుకవులు
తద్విహీనకావ్యతతియు లేదు''

అని శబ్దము సంస్కృతమైనను దానిపై విభక్తులు తెనుంగు విభక్తులు చేర్పబడినచో నది తత్సమ మగునని చెప్పి, యట్లు "వెలయు సంస్కృతంబు తెలిఁగించు తెఱగు' ను-అనఁగా సంస్కృత శబ్దములను తెలుగులోనికి దెచ్చుకొను రీతులను ప్రత్యేక ప్రకరణములోఁ జెప్పినాఁడు.

ఇక నీతనికిఁ దరువాత లాక్షణికుఁడు, ఛందోదర్పణ కారుఁడు నగు ననంతామాత్యుఁడు ఛందో లక్షణమునే ప్రధానముగా దెలుప నెంచినవాఁడైనను, చతుర్థాశ్వాసమున దోషాధికారసందర్భమున అపశబ్దదోష ప్రసంగము నాధారముఁ జేసికొని కొంత భాషా లక్షణమునుగూడఁ జెప్పవలసిన వాఁడైనాఁడు.

యిద్దరు లాక్షణికులవలెనే వ్యక్తము చేసినాఁడు. కాని యీ శబ్దములలో గ్రామ్యమును జేర్చినవాఁడు కాఁడు. కారణ మీతఁడు కావ్యలక్షణములో దోషాధికారమును జెప్పి యుండుటయే కావచ్చును.

"సంస్కృతము తెనుఁగైనఁ దత్సమపదంబు
దానఁబుట్టి తెనుఁగైనఁ దద్భవంబు
దేశి తెనుఁగు దేశజ, మచ్చతెనుఁగు తెనుఁగు
నిర్మలుఁడు సిరి యొడయఁడు నిక్కమనఁగ"

కేతన, పెద్దన, అనంతులు ముగ్గురునుగూడ తెలుఁగైన సంస్కృతమే తత్సమమని వ్యక్తము చేసినారు. కాని యీ తొలిలాక్షణికులు ఆంధ్రభాషవికృతి యనువారుగా గనఁబడరు. అయితే సంస్కృతంబుపై తెనుంగు విభక్తులను జేర్పగా నవి తెలుఁగుపదములైనవి గదా! కాగా వీనిని సంస్కృత సమములని-తత్సమములని చెప్పనేల? తెలుఁగు పదములని, తెలుఁగు పదములతో సమానములైనవని చెప్పుటయే సమంజసముగా గనఁబడునుగదా! సంస్కృతంబునంబుట్టి తెనుఁగైనవి తద్భవములైనవి. అందుఁ బుట్టుట యనఁగా నేమో పెద్దన వ్యక్తము చేసినాఁడు. "సిద్ధాక్షరముల వర్గముల దూలిపోఁబలుకగ నర్థదమైప్రాకృతవిభ మగునది తద్భవ పదము" అని వర్ణములందు మార్పు గలిగి యేర్పడినది తద్భవము కాగా, అట్లు మార్పేమియు లేక యేర్పడిన-చో నది ప్రాకృతములందువలె సంస్కృతసమము కావచ్చును. కావుననే హేమచంద్రుఁడు దానిని "సంస్కృతలక్షణైనవ కాత్యార్థం" అన్నాఁడు. కాని తెలుగుఁన తత్సమము లేర్పడు

రీతికూడ ఒక ప్రకరణముగాఁ జేసి చెప్పవలసి వచ్చినది. గౌరీ - గౌరి యయినది. వాణీ-వాణి యయినది. వానునకు వంతుఁడు, మానునకు మంతుఁడు, ఉజ్జ్వంతముపై పుజ్జు. అజ్జ్వంతముపై ముజ్జు, ద్విట్ పదమునకు ద్విషుఁడు, భుక్-భుజుఁడు, దిక్-దిక్కు, భూ-భువి, నౌ కు-నావ ఇత్యాదులు మార్పు లనేకములు. ఈ మార్పు లన్నియు నా పదములను తెలుఁగు పదములుగాఁ జేయుటకై చేయబడినవే కాని సంస్కృత సమములుగాఁ జేయుటకుఁ గాదుగదా. కావున వీనిని సంస్కృతసమము లనుట యంత సమంజసముగా కనఁబడదు. కాని భాష నిట్లు విభాగించు సంప్రదాయము వీరికెచ్చటినుండి వచ్చినది, వీ రెందు క ట్లీభాషను విభాగింపవలసివచ్చినది. ఒక భాషలోని కితర భాషలనుండి సంక్రమించిన పదము లన్నిటిని అన్యదేశ్యములుగాఁ బరిగణించిన చాలదా అని విచారించినచో వీరి కీసంప్రదాయము ప్రాకృతవ్యాకరణముల ఫక్కి ననుసరించుటవలన వచ్చినదని తెలియక పోదు. మొదట 'తత్సమతద్భవదేశి' విభాగము ప్రాకృతవ్యాకరణములలోఁ గనఁబడుచున్నది. ఆంధ్రవైయాకరణులును వాని మార్గమునే యనుసరించియుందు రనుటకు సందేహము లేదు. కేతన సూచన మాత్రముగ దెలిపినను పెద్దన యీ విషయమును వ్యక్తమే చేసినాఁడు. గీర్వాణభాషా కావ్యలక్షణము లన్నిటిని దెచ్చికూర్చినను తెనుఁగు కావ్యమనగానే, తెలుగంచుఁ జెవినిఁ బెట్టక తెలుఁగు దేశభాష, వ్యవహారమున దెలిసికొనవలసినదేగాని దీనికి వ్యాక

రణ మేమిటని యీసడించువారికి సమాధానముగా విన్నకోట పెద్దన

"విశ్రుతులు హేమచంద్రత్రివిక్రమాదు
లొనరఁజూపిరి ప్రాకృతంబునకు త్రోవ
ఆంధ్రభాషయు ప్రాకృతాహ్వయముగాన
వలయు దల్లక్షణంబును వరుస దెలియ"

అని ఆంధ్రభాషను ప్రాకృతాదులలోఁ జేర్చి తానా తెలుఁగునకుఁ జేయ తలపెట్టిన భాషాలక్షణరచనా కార్యమును సమర్థించుకొనినాఁడు. కేతనకూడ—

"సంస్కృతప్రాకృతాదిలక్షణముఁ జెప్పి
తెనుఁగునకు లక్షణముఁ జెప్పకునికి యెల్ల
గవిజనంబుల నేరమి గాదు నన్ను
ధన్యుఁ గావింపఁ దలఁచిన తలపుగాని."

అని సంస్కృత ప్రాకృత లక్షణములను స్మరించి యప్పటికిఁ దెనుఁగున లక్షణ మేర్పడకుండుటను సూచించుచు తాను "క్రొత్తగ నాంధ్రభాషకును గొండొక లక్షణమిట్లు చెప్ప" బూనుకొనినట్లు తెలిపియున్నాఁడు. కావున సంస్కృతభాషాలక్షణముకూడ వీరి దృష్టిపథమందున్నట్లు స్పష్టమగుచున్నది. కావున ప్రాకృతభాషా లాక్షణికులు చేసిన తత్సమతద్భవదేశ్యభాగమునే వీరు నవలంబించి యుందు రనుటకు సందేహము లేదు, ఆ భాషలలో విభక్తి ప్రత్యయములతోఁ గూడిన పదములు సంస్కృతమునందు

వలెనే మార్పు లేకయుండుటచే సంస్కృతసమము లనుట యుక్తమేగాని. ఈ భాషలో క్రొత్తప్రత్యయములతోఁ గూడి ప్రాతిపదికములలోఁ గూడమార్పులు గలుగుచున్నపుడు తత్సమము లనుట యుక్తముగాఁ గనఁబడదు. కన్నడ వైయాకరణులుగూడ నీవిభాగక్రమమునే యవలంబించినారు. కాని వారు మార్పేమియు లేకయే కన్నడమునఁ జేరిన శబ్దములను సమసంస్కృతములనియు (అనగా రామ-రామం, భీమ-భీమం, నారద-నారదం ఇత్యాదులు) సంస్కృతి మందును, కన్నడ మందును వ్యవహారములోనున్న శబ్దములను తత్సమములని ఒక విధమైన విభాగమును గల్పించినారు. సంస్కృత కన్నడములందు సమానముగా నున్న శబ్దములను తత్సమములని చెప్పి, అట్టి శబ్దముల నిరువదింటి నొకపట్టిగా 'శబ్దమణిదర్పణ' కారుఁ డిచ్చియున్నాఁడు. మణి, మంచం, తోరణం, కంకణం, గోణి. మాలె, అట్టం, గణం, గండం - ఇత్యాదులు. ఇవి రెండు భాషలకు సమానము లనుటలోఁ గలవిశేష మేమనగా నీ తత్సమ పట్టికలోని శబ్దములు సంస్కృతశబ్దములతోను, కన్నడ శబ్దములతోను గూడ సమాసమున నిలువగలిగియుండుటయే. సమసంస్కృతము లట్లు నిలుపఁగూడదఁట. తత్సమ శబ్దములకుసంస్కృత శబ్దములతోను, కన్నడ శబ్దములతోను సమాసములు కూడును. ఉదా:—దినమణి, ఉడెమణి, రత్నమంచం, తూగుమంచం, మరక తోరణం, తళిర్తోరణం ఇత్యాదులు. సమసంస్కృతముతో దేశ్యశబ్దము సమసించినచో నది అరిసమాస మగునుకావున ముఖతావరె, అరసకుమారం ఇత్యా

దులు నిషిద్ధములైనవి. మొత్తముమీఁద నీ కన్నడమున తత్సమ శబ్దమున కొక క్రొత్తయర్థము కల్పింపఁబడిన ట్లగపడుచున్నది గాని కేవలము తెలుఁగులోన లెగాదు. తొలుత నీ శబ్దమును వాడుకలోనికిఁ దెచ్చిన ప్రాకృతవైయాకరణులు దీనిని వర్ణములందెట్టి మార్పు లేక ప్రాకృతభాషలో నట్లే నిలిచిన సంస్కృతశబ్దముల పరముగా వాడిరనుటకు సందేహము లేదు. ఉదా:—కమల, తరల ఇత్యాదులు. ఇఁక జన్యభాషలలోఁ గొన్ని మార్పులకు లోనై చేరిన సంస్కృతశబ్దములు తద్భవములైనవి. ఈ తద్భవ శబ్దములలోఁ గలిగినమార్పును చాలవరకు త్తర దేశభాషలలోను, దక్షిణ దేశభాషలలోను సమానములుగనే యుండుట మనము గమనింపఁదగిన విషయము. ఇట్లగుటకు దేశీయులగు అనార్య జనుల యుచ్చారణ రీతులు. సంప్రదాయములు మొదలగువాని ప్రభావముకూడ నొక కారణమై యుండునని తలంపనగును. ఏలయనఁగా—నీ ప్రాకృతభాషలలోఁ గలిగిన మార్పులు ద్రావిడభాషాసహజ సంప్రదాయముల కనుగుణములయి యున్నవి.

ఉదా: (౧) పదాదియందలి శ,షలు 'స'గా మారుట. ద్రావిడ భాషలలో ఊష్మములు లేవు. cf- శాణము. సాన, శ్రీ-సిరి etc.

(౨) పదమధ్యమున సంయుక్తాక్షరము నిలువదు. ద్విత్వాక్షరము నిలుచును. సం. పుత్ర-ప్రా. పుత్త: సం. ఆత్మపుత్ర- ప్రా. అజ్ఝఉత్త; cf. సం. ఋక్ష-తె., రిక్క..

(3) ప్రాకృతములలో భకారము హకారముగా మారును. ద్రావిడభాషలలో మహాప్రాణములు లేవు. సం. భవతి - ప్రా. హోది - హోఇ; భవిష్యతి - హావిస్సది; ఇట్లే సం. ముఖ - ముహ; (తె. మొహము) సం. మేఘ - మేహ, *etc.*

(౪) పదమధ్యమునందలి క, త, ప వర్ణములు గ, ద, బ లుగా మారును. ఇదియు ద్రావిడభాషా సంప్రదాయమే. సం. అతిథి-(శౌ.) అదిధి; సం. పారితోషిక-శౌ. - పారిదోసియ; సం. లోక - (అర్ధ.) మా. లోగ; సం. అకాశ - ఆగాస; పట-పడ; కుటుంబ-ంకుడుబ.

(౫) పదాదియందు సంయుక్తాక్షర ముండదు. ద్రావిడ భాషలలోను అట్లే. స్నానము-తె. తానము; వ్యాపార-బేహార.

పదమధ్యమందలి సంయుక్తాక్షరము ద్విత్వమును జెందుటయో, లేదా సర్వభక్తిచే రెండక్షరము లగుటో తటస్థించును. ఇంద్ర-ఇందర; ద్వార-దువార; వర్ష-వరిస; హర్ష-హరిస; యుక్త-జుత్త; ఉత్పల-ఉప్పల; అగ్ని - అగ్గి; వింధ్య-వింఝ, వల్కల-వక్కల; పక్వ-పక్క; సత్య-సచ్చ; చక్ర-చక్క.

ఇట్టి మార్పులను బొంది సంస్కృతము ప్రాకృతముగా మారినది. దక్షిణదేశభాషలలోను సంస్కృత భవముల కిట్టి మార్పులే కనఁబడుచున్నవి గదా. కాని సంస్కృత శబ్దములు దక్షిణదేశభాషలలో నెట్టి మార్పులను బొంది తద్భవములై ప్రవేశించినను అన్యభాషాశబ్దము లీ భాషలలో

ప్రవేశించినట్లే యగునుగదా. కావున నన్యదేశీయములే యని యెందుకనంగూడదు ?

ఇఁక దేశ్యములను గూర్చి విచారింతము. సంస్కృతభాషకు సంబంధించినది గాని, దానినుండి నిష్పన్నమైనది గాని కాక దేశీయవ్యవహారములో ప్రాకృతభాషలలోనికిఁ జొచ్చిన శబ్దజాలము దేశి యని చెప్పఁబడుచున్నది. ఇట్టి దేశీయశబ్ద జాలమును హేమచంద్రాదులు 'దేశినామమాల' లను పట్టికలలోఁ జూపినారు. హేమచంద్రుని యీపట్టికలను బరిశీలించినచో ననేకములు తద్భవశబ్దములుగూడ నందు చేరినట్లు కనఁబడుచున్నది. (తిందిసీ, గండీవం, మేఘుచ్ఛిరం, ధూమద్దారం మొదలగునవి దేశి శబ్దజాలములోఁ జేరినవి.) కాని దేశీయములగు అనార్య భాషాశబ్దములును పెక్కు గలవు. అందు ద్రావిడభాషా శబ్దములును గొన్ని లేకపోలేదు. ఉదా: ఊరు (ఊరో గ్రామః), చాణం, చాణీ=గోమయ (cf. త. చాణి); చిల్లం=ఛిద్రం (cf. తె. చిల్లి), పసండి = కనకం (cf. తె పసిండి); దారో=కటిసూత్రం (cf. తె. దారము); మాడిఅం = గృహం (cf. తె. మేడ, క. మాడి, త. మాడం); మడో=కంఠః (cf. తె. మెడ); ఖడ్డ = శ్మశ్రు cf. తె. గడ్డము, క. గడ్డ); చిచ్చి = హుతాశనః) (cf. తె. చిచ్చు, క. కిచ్చు); ణేసరో=రవిః (cf. త. ఞాయర్)

దేశీయములగు నితరానార్య భాషాశబ్దములునుగొన్ని యివిలోఁ జేరియుండును. కాని ఆంధ్ర దేశ్యములుకూడ కొన్ని యీ ప్రాకృతవ్యాకరణికుల 'దేశి' లోఁ జేరియుండుటయే విశేషము.

ప్రాకృతవైయాకరణుల ననుకరించుటవల్లనే తెలుఁగు లాక్షణికులును తెలుఁగుభాషకు తత్సమ తద్భవము లనియే కాక, దేశ్యమను విభాగమునుగూడఁ గల్పించినారు. మూల భాష సహజముగ దేశ్యమే యైనపుడు మరల దేశ్య విభాగ మనున దెందులకు? ఇంతేకాక ఈ దేశ్యమున ఆంధ్ర దేశ్యము, అన్య దేశ్యము అను మరియొక విభాగమును గూడ చేసినారు. ఆంధ్ర దేశ్యమే అచ్చతెనుఁగనియుఁ జెప్పఁబడు చున్నది. ఇది ఆంధ్ర దేశ పురస్థాయులైన సకలజనులకు సుల భముగ దెలిసెడి శబ్దజాలము. 'విన్నవారికిన్ మనమునఁ దేటగా దెలియు మాటల యచ్చతెనుంగునాఁ జనున్' అని పెద్దన. ఇక దేశ్య లక్షణము—

"శ్రేయములై బహుదేశా
నేయములై చక్కఁదనము నెఱఁదనములునై
యాయా నెలవులఁ జెవులకు
దీయము లగు పలుకులెల్ల దేశ్యము లరయన్."
"కేశవ! యాంధ్రులు నానా
దేశంబులయందు నిలిచి తెలుఁగులె తత్త
ద్దేశోక్తు లంట బలికిన
నాశబ్దము లన్యదేశజాంధ్రము లయ్యెన్."
(అప్పకవి)

అనగా నా యా దేశభాగములయం దాంధ్రుల వాడు కలో వెలసిన శబ్దము లన్నమాట. వీనిని మాండలికశబ్దము (*Provincialisms*) లనియు చెప్పవచ్చును. ఇట్టి శబ్దము లాయా ప్రాంతములందలి కవులు వారిగ్రంథములలోఁ బ్రయో

గించినచో, నా గ్రంథవ్యాప్తిని బట్టి ఇతర కవుల గ్రంథముల లోని కెక్కి క్రమముగ దేశమునందంతటను వ్యాప్తిగాంచును. అట్టివి నిత్య వ్యవహారమునందు ప్రసిద్ధికంటె వాఙ్మయ ప్రసిద్ధి విశేషముగా గలవై (*Literary forms*) యుండును. ఎట్లైనను ఆంధ్ర భాషలోని ఆంధ్ర దేశ్యమునకుఁగల ప్రాచుర్య సహజత్వము ప్రాకృత భాషలోని 'దేశ్యము'న కుండదు గదా. ఎందుచేత ననగా, నీ భాషలో తత్సమ, తద్భవశబ్దజాల మెరువుసొమ్మయినట్లే ఆ భాషలలో నీ 'దేశి' శబ్దజాలమును ఎరువు సొమ్మే. భాషకు ప్రాణమనదగిన వాక్య నిర్మాణ పద్ధతులు, వ్యాకరణసంప్రదాయములు నీ భాషకు 'దేశ్యము' అను భాగములోనే స్వతంత్రము లై యుండగా, ప్రాకృత భాషలకు 'తద్భవ' భాగములో సంస్కృతమూలములై యున్నవి. కావుననే తెలుఁగు భాష ప్రాకృత భాషల వలె తన జీవికకు సంస్కృతముపై నాధారపడి యుండ నావశ్యకత లేదు. దీనిని బట్టియే ప్రాకృతము లార్య భాషాజన్యములు, ఆంధ్ర మనార్యమగు స్వతంత్ర భాష యని చెప్పుట కవకాశము కలుగుచున్నది. కాని దీనికి సంస్కృత ప్రాకృతములతోఁ గలిగిన చిరకాల సంబంధముచే వానితో గాఢసమ్మేళనమును బొంది యది శరీరపుష్టిని గాంచుటను బట్టి సంస్కృతభాషాభిమానులగు వైయాకరణు లీ తెనుఁగును కూడ ప్రాకృతములవలెనే సంస్కృతజన్యమని, తద్వికృతి యని తలంపసాగిరి. కాని వా రీ భాషను తత్సమ తద్భవ దేశ్య విభాగముచేసి వాని కుదాహరణములుగా శబ్దముల నిచ్చిరేగాని వాక్యముల నిచ్చియుండకపోవుటయే గాక

ఇందలి భాషారూపములనుగాని, విభక్తులనుగాని సంస్కృత ప్రాకృతములనుండి నిష్పన్నమైనవని సాధింప యత్నింపనైన లేదుగదా! అది సాధ్యమగునదియుఁ గాదు. కావుననే ఆంధ్ర మార్యభాషాజన్యము కాక భిన్న కుటుంబమునకుఁ జెందిన దగుచున్నది. ఇందలి విభక్త్యాదులు, వ్యాకరణ ప్రక్రియ దక్షిణ దేశ భాషాలక్షణమును బోలిన వగుటచే నిది దక్షిణ దేశభాషా కుటుంబమునకుఁ జేరినదని నిశ్చయింపవలసి యున్నది. ఇట్లీ భాష దేశీయమే యగుటచే మరల దేశి విభాగమున కావశ్యకతయే లేదు.

ఆంధ్ర మార్యభాషాజన్యముకాక దక్షిణ దేశభాష లతో సాజాత్యము కలిగినదన్నపుడు, ఈ భాషకు సహజ మనఁదగిన యీ 'దేశ్యము' తక్కిన దక్షిణ దేశభాషలతో సంబంధించినదై యుండవలయునుగదా. ఈ దేశ్యము, లేదా అచ్చ తెనుఁగనునది సంస్కృత సమ, సంస్కృతభవ భిన్నం బని వైయాకరణులు చెప్పినపుడే దీని నిష్పత్తిని గూర్చి సంస్కృత మెట్టి సహాయము చేయలేదని వారు చెప్పి నట్లయినది. కావున సన్నిహితములగు దక్షిణ దేశభాష లతోఁ బోల్చిచూచుటచేతనే దీని (ఈ దేశ్యముయొక్క) లక్షణమును, చరిత్రను మనము కనిపెట్టవలసియున్నది.

'ఎల్లవారికిఁ దేటతెల్లముగాఁ దెలిసెడిపలుకులు' అని కేతన పెద్దన లిచ్చిన శబ్దములు, వాని కితర ద్రావిడ భాష లతోఁ గల సంబంధమును గూర్చి పరిశీలింతము.

"తల నెల వేసవి గుడి మడి
పులి చలి మడు గూరు పేరు బూరుగు మగవా

డలుక . . .”                                         (అని కేతన)

తల—త. తలై; క తలె మళ. తల

నెల—త. నిలావు (*Moon*)

వేసవి—క. బేసగె. (బిసు = వేడి), త. వేనిల్

పులి—త. మళ. పులి; క. పులి, తు. పిలి

చలి—క. చళి, సళి; (కుళిర్) తుళు. చలి, చళి

మడుగు—క. మడు, మడువు; త. మడు

ఊరు—త. మ. క. ఊర్, తు. ఊరు

పేరు—త. మ. పెయర్, పేర్, క. పెసర్; హెసరు; తు. పుదర్

మగవాడు—త. మగన్ (*son*); క. మగ (*son, male*)

బూరుగు—క. బూరుగ, బూరుగె (*a silk cotton tree*); త. పూళై

అలుక—క. అలుగు (= *to be agitated, shake*); త. అలంగు

ఇఁక పెద్దన అచ్చ తెనుఁగు శబ్దములు :—

ఎనుములు—క. ఎమ్మె; త. ఎరుమై, మళ. ఎరుమె; తు. ఎర్మె

గుఱ్ఱములు—త. కుదిరై; క, తు. కుదిరె

పండులు—క. పణ్ణు, హణ్ణు; త, మ. పఴమ్

బండులు—త. వండి

ఉప్పు—త. మ. క. తు. ఉప్పు

పప్పు—త మ. పరుప్పు

ఆకు-క. ఆకు (cf. ఆగు *a seedling, a sprout*).

నేయి-క. నెయ్. త. నెయ్. (*fat, grease*) (స్నేహః?)

పూనె-(నూవు+నెయ్) cf. త ఎళ్+నెయ్=ఎణ్ణె

పాలు-త క. మ. పాల్

ప్రోలు-త. క. ఊరు్ > ప్రోలు.

అప్పకవి ఆంధ్రదేశ్య మని చెప్పినదాని కుదాహరణ ముగా పాలు, నేయి పెరుగు. ప్రోలు, ఊట్టి మొదలగు వానిని ఇచ్చియున్నాఁడు. ఈ ఆంధ్రదేశ్యమని అప్పకవి చెప్పిన దానినే కేతన పెద్దన లచ్చ తెనుఁగని చెప్పినారు. పెరు దేశ్య మని వ్యవహరించినదానినే అప్పకవి అన్యదేశ్య మన్నాఁడు. కేతన దేశ్యమునకు ప్రత్యేక లక్షణము చెప్పక యే "ఎఱుకువ నెత్తమ్మి" ఇత్యాది శబ్దముల నుదాహరించినాఁడు. కాని పెద్దన లక్షణముకూడ నిట్లు చెప్పియున్నాఁడు.

"శ్రేయములై బహుదేశా
నేయములై చక్కదనము నెఱదనములు నై
యాయా నెలవులఁ జెవులకు
దీయములగు పలుకులెల్ల దేశ్యము లరయన్"

దీనినే అప్పకవి యనువదించినాఁడు.

"కేశవ యాంధ్రులై నానా
దేశంబులయందు నిలిచి తెలుఁగులై తత్త
ద్దేశోక్తు లంటఁబలికిన
నా శబ్దము లన్యదేశజాంధ్రము లయ్యెన్."

"బహుదేశానేయములైనవి" గాని, అనఁగా ఇతర దేశములనుండి వచ్చి యీ భాషలోఁ జేరినవిగాని, ఆంధ్రులే యితర దేశములందు నిలిచి తెలుఁగులే తత్తద్దేశోక్తు లంటఁ బలికిన పలుకులుగాని అన్యదేశ్యములగునని తెలియుచున్నది. కాని లాక్షణికు లుదాహరించిన శబ్దములనుబట్టి యివి యెట్లన్యదేశ్యము లనదగునో. అనఁగా నేయే దేశభాగముల లోనివో ఇప్పుడు గ్రహించుట యంత సులభసాధ్యముగాఁ గనఁబడదు. వీనిలో చెక్కు కావ్యభాషయందే విశేషముగా గనంబడుటనుబట్టి పైఁ దెలుపఁబడిన అచ్చతెనుగుశబ్దములవలె నంత విశేషముగా నిత్య వ్యవహారములోనుండి యందరికి సులభముగ దెటపడియెడు మాటలు కావనిమాత్రము చెప్ప వచ్చును ఇవి యిప్పుడు హైదరాబాదు, బళ్లారి, బరంపురము, మద్రాసు మొదలగు ప్రాంతములందు నివసించు వారు తత్తద్దేశోక్త లంటఁ బలుకుచుండిన పలుకుల రీతినే ఆ కాలమున నానా దేశములందు నిలిచిన యాంధ్రుల వ్యవహారములోని మాటలై యుండును. అనగా నా కాలపుప్రాంతీ యాంధ్రశబ్దము (*Provincialisms*) లని తలంపవలసియున్నది కాని వీనిలో చెక్కు శబ్దములు సమాస పదములుగను, గ్రంథస్థములుగను కావ్యభాషా సామాన్యములుగనే యుండుటనుబట్టి నిత్యవ్యవహారములోనివిగాని గ్రాంథిక భాషారూపములనే వీ రిట్లు గ్రహించిరాయనియు సందేహింపవలసి వచ్చుచున్నది.

"ఎఱుకువ, నెత్తమ్మి, ఎరగలి, ఎసకంబు
నాస లంతి, తేఁటి వెక్కసము, నెమ్మి

మక్కువ, చెచ్చెర, మచ్చిక, హెచ్చెము
కడిమి, యేత్తెర. లగ్గు, కలవలంబు

ఎల్లికోఁజలుట. హీఁచోట్ల, లుల్ల ముపిద
పీఁకకాఁడయ, గ్రద్దలు. వేఁట. గ్రేణి
కోను పాలిండు లాఁగి మొగిఁగసయనిట్టి
తెలుఁగుపలుకులు ధర దేశి తనుఁగు బొమ్మ"
(ఆం. భా. భూ.)

వీనిలో 'గ్రద్ద' శబ్దము గృధ్రశబ్దభవ మను తలం పుతో కోశకారులు దీనిని తద్భవ మని చెప్పుటకలదు గాని తమిళమునందలి 'కఱు-కఱుద్దై' అనుదానికి సంబంధించిన దని తలంచినచో నిదియు దేశ్యమే కావచ్చును. ఇట్లు పై పదమున కేతన తెలిపిన శబ్దములన్నియు దేశ్యములేయగును గాని యేయేదేశభాగమునుండి వచ్చినవో చెప్పుట కవకా శము చాలదు. అందు పెక్కు శబ్దములు కావ్యభాషా ప్రా చుర్యముమాత్రము కలవని చెప్పవచ్చును ఇక తమ్మిర, లేమావి, క్రొన్నన, రేఁజెడు. వాలుగంటి. కెమ్మావి. కెంజాయ, తామరకంటి, నలువ, చిగురుబోఁడి మొదలగునవి సమాసపదములు. పెద్దనయు కేతన చెప్పినవానిలో ఎల్లి, నెత్తి మ్మి.క్రొన్నెల,హెచ్చెము అను శబ్దములను గ్రహించి ఇంక వా లాయము, ఆలము, వంగడము, అంగడి, వెన్ను, వాఁవిరి, వాగెంబు, అక్కజము.అచ్చెరువు, వేసలి, వేసవేలు మొద

లను మఱికొన్ని కావ్యభాషలోనే సాధారణముగాఁ గనఁబడు శబ్దములను ఇచ్చియున్నాను. ఇందు వంగడము, అక్కజము అచ్చెరువు తద్భవములుగా నిప్పటి వైయాకరణులచే గ్రహింపఁ బడుచున్నవి. వంగడము వంశ శబ్దభవమును, అక్కజము, ఆశ్చర్య శబ్దభవమును కావచ్చును. తక్కినవానిలో బెక్కు ఇతర దక్షిణదేశ భాషలకు సంబంధించినవియు గలవు.

ఎఱుకవ-త. అఱి, అఱివు, అఱిక్కై

మన్ను-త. మణ్. మణల్

ఇంతి-త. ఇల్ త్తి

తెమ్మెర-క. తెమ్+ఎలర్ (< ఎరల్) = తెమ్మెలర్, తెంబెలర్

కసలి-త. కసల్ = అల.

నాన-త. క. నాణ్, నాణ

ప్రొద్దు-ప్రబుద్ధ శబ్దభవ మందురుగాని త. క. పొఱుదు అనుదానికి సంబంధించినదై యుండును.

తనివి-(తనివు, తనుపు = తృప్తికలుగఁజేయు) త. తణ్ = తని = చల్లని, cf త. తణ్ణిర్

అంగడి-త, క. అంగాడి

కేలు-త. కై. క. కెయ్యి

పోరు-త. క పోర్.

అప్పకవియు అన్యదేశజాంధ్రములలో కేతన పెద్దన లిచ్చిన వాలాయము, ఆలంబు, ఎలనాగ, వెలది, నెలత, తొయ్యలి, బోటి, ఇంతి, పడ్తెఱ, పొలుపు, వీనులు,

వచ్చెను అంతకు పూర్వపు లాక్షణికులు సంస్కృత విభక్తులు. క్రియారూపములు. అవ్యయములు. వైరి సమాసములు నీ భాషలోం జేరకూడదని శాసించి తత్సమ రూపములలో కూడ గలుగు మార్పులను సూచించియు తెలుంగు దేశీయ సంప్రదాయమును నిలువబెట్ట యత్నించిరి. అట్లు ప్రాచీనకర్తలలో సోమనాథాదులు "ఆరూఢ గద్యాపద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠరచనను" ప్రోత్సహింప నారంభించిరి. అప్పటికిం దెనుగుమఱుంగులు భాషలో బయలు దేరలేదు. నాటి కాలమున తత్సమ బహుళమగు శిష్ట కవుల రచనను ప్రతిఘటించుటకొరకై బయలుదేరిన "జాను తెనుంగు" వాక్యమే అప్పటి పండితకవుల యాదరమును బడయలేక దేశమున సంచారవాహినిగా ప్రవహించి మఱి కొంత కాలమునకు "తెనుంగుమఱుంగు' లను మాఱురూపమును వహించి యచ్చ తెనుగురచనమును పేరతో బయలువడ వచ్చినది. కాని యీనాఁడు గా జాను తెనుంగు జాణతనము నకు మాఱుపేరైనదిగాని పొందుగుపెట్టబడినది కాలేదు. సహజముగ దాని తియ్యదనము మఱుగువడి కృత్రిమరుచులు పెరుగుటచే సహృదయుల హృదయము నాకర్షింపజాలక పోయినది. కావున నేయీ యచ్చ తెనుఁగు రచనయు నచిర కాలములోనే యంతరించుటయు దటస్థించినది. దీనితోపాటు వెనుకటి "జానుతెనుంగు" మాటయు నడుగున బడిపోయినది.

అప్పకవి అచ్చతెనుంగునకీ తెలుంగుమఱుంగుల నేకాక "ప్రాఁదెనుఁగు" లనువానినిగూడ జేర్చినాఁడు. "తొల్లింటి

ముడివెట్టు.. '' నేర్పుగల వారని వస్తుస్థితిని వర్ణించినాఁడు. ఈ "నేలయు నింగియుఁ దాలముల్ వాయించు"టను సోమనాథుఁడు. తిక్కనగూడ గ్రహించినారు. అందు తిక్కనార్యుఁడు దీనిని ప్రయోగించి రీతి గమనింపఁదగినది. కీచకునిచే కొంకక కొసరించుకొనియు లేక కూఁతుఁదన్ని బడిన ద్రౌపది భంగపాటును విరటుని యాస్థానంబున నుండి

"కనుగొని కోపవేగమున
కన్నుల నిప్పులురాల నాగము
లనరగ సాంద్రధూమ్రసలి
లంబులు గ్రమ్మ నితాంతదంతసం
ఘనకటకాస్వరంగవిక
టభ్రుకుటీచటుల ప్రవృత్తన
ర్తనఘటనాప్రకారభయ
దస్ఫురణాపరిణద్ధమూర్తియై" న

పవనతనయుని భయంకరాకారమును మన కనుల యెదుట నిలబెట్టుటకుగా తిక్కనార్యుఁడీ విషయమును గ్రహించినాఁడు. నన్నిచోడుని వేశ్యమాతల నేర్పరితన మను వస్తుస్థితి వర్ణనముకంటె తిక్కనార్యుని యీ భావస్ఫోరక వర్ణన సందర్భమున నా వాక్యమునకెట్టి మహత్తరశక్తి, ఔచితి కలిగినవో పరికింపుఁడు.

"నేలయు నింగియు దాలముల్ గావించి
యేఁపున రేగి వాయించియాడ
కులపర్వతంబులుగూర్చి యొంటొంటితో

పాకంగ వీకమై తన్నియాడ
నేడు నాగరములు నిక్కడక్కడ బెట్టి
పలుచని రొంపి మై గలదికొనగ
దిక్కులు నాలుగు నొక్కచోటికి దెచ్చి
పిసికి పిండలుసేసి పిడిచికొనగ
నింగి ప్రహ్లంపె భాండంబు పగుల వ్రేయ
నప్పుడు ప్రళయకాలానలమున
గంపరించిన పాపంబుకైవడి భీము
డతి భయంకరాకారత నతిశయిల్లె.''
నన్నిచోడుడు —(కుమా. సం. ౧-౯)
''ధరణీచక్రము దిరిగిరం
దిరుగ జలనిధులు గలగ దెసదప్పి భయా
తురులై సురకిన్నరగణ
నరవరు లని దూలిపాఱ నరకసు డార్చెన్''
తిక్కన -భీముఁడు ద్రౌపదితో-
''అవనీచక్రము సంచలింపగ దివం బల్లాడ నాశావయం
బవధూతంబుగ గోత్రశైల నికరంబాకంపముం బొంద న
ర్ణవముల్ ఘూర్ణన మొందఁ గ్రోధముగ్రతార్థత్వంబు నొందించి చి
త్రవధప్రౌఢి వహించి సూతునకు రౌద్రం బేర్పడం
జూపెదన్'' (విరా. ౨-౨౮)
నన్నెచోడుడు - గుణధ్వని-
''ధర గంపింప జలనిధుల్ గలగ ది

గ్రంతుల్ భయంబందఁ భూ
ధరముల్ డొల్ల వియత్తలం బద్రువ దై
త్యశ్రేణి భీతిల్ల భా
స్కరసద్ధ్వానములు మ్రొగ్గి మగ్గఁబడ నా
శాచక్రముల్ మ్రోయ భీ
కరమై దారుణమై గుణధ్వనిమహో
గ్రంబై చెలంగెన్ వడిన్''
(కు. సం. ౧౨-౯౧౨)

తిక్కన — పార్థుఁడు శంఖమొత్తినఁ —
''కలగెన్ తోయధిసప్తకంబు గిరివ
ర్గం బెల్ల నూఁగాడె సం
చలతన్ బొందె వసుంధరావలయ మా
శాచక్ర మల్లాడె గ్రాం
దల మందెన్ త్రిదశేంద్రపట్టణము పా
తాళంబు ఘూర్ణిల్లె నా
కులమయ్యెన్ గ్రహతారకాకులము సం
క్షోభించె నవ్యోమయున్'' (విరా. ౪-౧౭౨)

నన్నెచోడుఁడు — ''మన్మథునురుభుజాస్తంభాగ్రమున
జయశ్రీ బొందె నాలభంజిక విధమున'' (౧౨-౯౭౪)

ఈ భావము తిక్కనార్యుని నిర్వచనోత్తర రామాయణమున తొలి శ్లోకమునకే ఎట్లు విస్తరింపఁబడినదో చూడుఁడు

"శ్రీరాస్తాం మనుముక్తిశేఖర భుజాస్తంభే జగన్మండల
ప్రాసాదస్థిర భార భాజి దధతీ శ్రీనాలభంజీశ్రియం"

ఇట్లు వెనుకటికవుల భావములను, మాటలను గ్రహించినను వానిమూలమునఁ జదువరుల హృదయ మలరించు నట్లుగా రచింపఁగలిగిననే కాని సుకవి కాఁడని యీతని భావమైయుండునేమో.

"శాపేన పరిభిన్నానాం తాపేనాప్తవిభూతయః
తథాపి వచ్యాః భవతి కావ్యం గ్రథన కౌశలాత్"

అని యాలంకారికుల యభిప్రాయమునే యీతఁ డనువదించుచున్నట్లున్నాఁడు. ఇట్లు నన్నిచోడుని భావములను గొన్నిటిని గ్రహించి వానికి మెఱుఁగుపెట్టి ప్రయోగించినను, ఈతని సొంత రచనయో యనఁదగిన నిర్వచనోత్తర రామాయణములో నితఁడు చేసిన కుకవినింద, చెప్పిన కవితా లక్షణవిశేషములు, సూచించిన పదప్రయోగపద్ధతి మొదలగునవి యీతఁడు నన్నిచోడుని రచనను మనమున నిడికొని చేసెనా యని తలఁచుటకవకాశము కలుగుచున్నది. భాషా సాహిత్యరచనా పద్ధతుల విషయమున నన్నయార్యుని పక్షము నందే యాదరముగలవాఁడగు తిక్కన యా రీతికి భిన్నములగు పలుకుల పొందులేమి, దానిమూలమున గలుగు రస భంగము, ప్రాతవడ్డ మాటలు, విశేషణవిశేష్యముల లింగ వచనముల భేదము మొదలగు రచనావిషయములను గూర్చి ఖండింపవలసినవాఁ డగుటను బట్టియు, ఈ లక్షణములు కొన్ని నన్నిచోడుని రచనలోఁ గానవచ్చుటం జేసియు నన్నిచోడుని

రచనయే యాతని విమర్శకుఁ గారణమై యుండుననుట యుక్తి యుక్తముగాఁ గనఁబడకపోదు.

పలుకుల పొందు లేకపోవుట యను లక్షణాన్ని యాక్షేపణమును నన్నిచోడుని రచన కన్వయించినచో, నన్నయాదుల రచనలో గానరాని యన్యదేశీయ పద, పదబంధముల ప్రయోగపద్ధతి యొకటి యీరచనలోఁ గానవచ్చుచుండుట మనము గమనింపఁదగిన విషయములలో నొకటి యగును. అయితే నన్నయకుఁ బ్రతిపక్షమైన యీ క్రొత్తరీతి యాతనికిమాత్ర మెచ్చటినుండి వచ్చినది. ఏల రావలయును అను ప్రశ్న వెంటనే కలుగకమానదు. పరిశీలించినచో మన దేశమునందలి తక్కిన పెక్కు విషయములందువలెనే యంత దూరమేల, మన యాంధ్రుల జాతీయ చరిత్ర క్రమమందువలెనే ఆంధ్రవాఙ్మయ రచనారీతులందును ఆర్యానార్య భాషాసాహిత్యపద్ధతుల సహజసమ్మేళనము చక్కఁగా సాధింపఁబడియున్నదని మనము గుర్తింపవలసియుండును. దీనిని మొదట చక్కఁగా సాగించుటలో ప్రోత్సాహకులై కీర్తిగన్న వారు చాళుక్యరాజులు-సత్యాశ్రయుని నాటి చాళుక్య నృపులే కావచ్చును. అట్టి దానిని తొలుదొలుత సాధించి పేరుగాంచినవాఁడు నన్నపార్యుఁడు. వీరి కీ విషయమునఁ గొంతవరకు మార్గదర్శకమైనది కర్ణాట భాషాసాహిత్యము. అందప్పటికి పూర్వమే యీ సమ్మేళన పద్ధతులు స్థిరపడి సాహిత్యము పెంపొందియున్నది. ఆ సాహిత్యరీతులనే తన దేశ కాలాదిపరిస్థితుల కనుకూలమగునట్లుగను, "అనఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై ధరణీసురోత్తమాధ్వర వితాన

పుణ్యసమృద్ధమై పొలుచు" వేగిదేశమండలి గోదావరి తీరంబున నివసించు తన వైదికసంపత్తి కనుగుణమగు నట్లుగను గ్రహించి "తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుఁ" డై వాఁడు నన్నయ. కాని నన్నిచోడునకీ గోదావరీతీర వేంగిదేశపు వైదికసంపత్తి లేదు. ఆంధ్ర దేశ పశ్చిమ భాగమందలి అచ్చు తెలంగాణపు దేశీయాభిమానమునకుఁ దోడు తత్సామీపస్థములగు నన్యదేశీయ సంప్రదాయ ప్రవణత కూడ ప్రబలినట్లగపడుచున్నది కావుననే నన్నయ యవలంబించిన మార్గపద్ధతి నవలంబింపక, దేశిమార్గములను దేశీయములుగా జేసి కవిత నాగింపవలె నని తలచియుండును. ఆంధ్రదేశ పశ్చిమభాగము కన్నడదేశప్రాంత మగుటచే నచ్చటి దేశిక కన్నడ భాషాసంపర్కము హెచ్చుగా నుండక మానదు. గద్యపద్యోభయ సమ్మిశ్రితమగు వాఙ్మయము కన్నడభాషలో నింతకుపూర్వమే వెలసి ప్రసిద్ధిగాంచియుండుటచే నా వాఙ్మయమే, అందును రత్నత్రయమని ప్రసిద్ధిగాంచిన కవిత్రయమే పెక్కు విషయముల నన్నిచోడునికి మేలుబంతి యగుటలో నాశ్చర్యము లేదు. ఈ కారణములచే నీతని రచనలో తమిళ కన్నడ భాషాపదములు, ప్రయోగములు. సంప్రదాయములు మొదలగునవి కొన్ని ప్రబలుట, అవి తరువాతివారికి నచ్చకపోవుట తటస్థించినది. కేవలము నన్నయ యవలంబించిన మార్గమునే యవలంబింపక నన్నిచోడునివలె దేశి పద్ధతికై ప్రాకులాడిన పాల్కురికి సోమన కూడ తరువాతి కవుల యాసడింపులకు గురియగుటను, తక్కినవారి భాషకంటె వీ రిద్దరి భాషలోను, ప్రయోగపద్ధతిలోను

కొంత సామ్యము కనపడుచుండుటకును గూడ కారణము వీరిది పశ్చిమాంధ్రదేశీయ సంప్రదాయ మగుటయే కావచ్చును. కావున వీరి విశేష ప్రయోగములలోఁ గొన్నిటిని పశ్చిమాంధ్రదేశీయములుగను, కొన్నిటిని అన్యదేశీయములుగను మనము గ్రహింపవలసియుండును. కేశనాదులు చెప్పినట్లు తల, నెల గుడి, మడి, ఊరు, పేరు, పాలు, పెరుగు మొదలగు శబ్దములు దక్షిణదేశ భాషలన్నిటికిని మూల మగు తల్లిభాష నుండి వచ్చినవేయైనను, ఈ భాషలు వేరుపడి స్వతంత్రములైన పిదప అందలి సాహిత్యముల పరిచయమువలన గాని, ఆయా భాషలను వ్యవహరించువారి సాన్నిహిత్యము, కలయికలవలనగాని ఒక భాషలోని శబ్దములు మరియొక భాషలోనికి సంక్రమించుచుండును. అప్పు డివి యన్యదేశ్యములుగనే పరిగణింపఁబడునుగదా. ప్రాంతీయములగు నిట్టి శబ్దముల నాయా కవుల ప్రయోగచాతుర్యమును, బలమును బట్టి యితర కవులును శిరసావహించి గ్రహించినచో నవి యా భాషా సాహిత్యమున నిలిచిపోయి యా భాషలో నంతర్భాగమే యగును. లేనిచో నాయా ప్రాంతీయ కవుల రచనలలో మాత్రమే పొడసూపుచు భాషలో విశేషవ్యాప్తి గాంచవు. నన్నెచోడ సోమనాథుల రచనలలోని కొన్ని ప్రయోగముల కిట్టి స్థితియే కలిగినది. తిక్కనవంటి మహాకవి యట్టి యనాధారణాన్య దేశీయ ప్రయోగములను గూర్చి వెంటనే నిరసింప తటపించుట గూడ నట్టివి కాలక్రమమున నంతరించుటకు గారణమైయుండును. పలుకుల పొందు లేక ఒకటన్ హృదయం బలరింప లేని కుకవులను నిందించుటతో పాటు

"తెలుఁగు కవిత్వము చెప్పందలచిన కవి యర్థమునకు దగి యుండెడు మాటల గూన" వలయునని చెప్పుచు తెలుఁగు కవిత్వము చెప్పదలచిన కవి యనుసరింపవలసిన విధాన మునుగూర్చిగూడ తిక్కన చేసిన సూచన నన్నిచోడాదుల విజాతీయ ప్రయోగముల నే లక్ష్యముగాఁ జేసికొన్నదిగా నేకన పడుచున్నది. అట్లన్యదేశీయములుగాఁ బరిగణింపఁ దగిన నన్నిచోడుని కొన్ని ప్రయోగములనుఁ బరిశీలింతము. ఇవి విజాతీయము లనఁగూకుట అప్పటి నన్నయాదుల మార్గ పద్ధతిని బట్టి చూచుటవలనను. ఆ మార్గము నవలంబించిన తరు వాతి కవులు వాని నంతగా గ్రహింపకపోవుటచేతను గలిగి నవే లేని-నో నిజియు అప్పకవి చెప్పిన ప్రాత తెనుఁగులలో జేరవలసినవే. నన్నిచోడుని రచనలో పలుకుల పొందిక లేక పోవుట విజాతీయములగు నన్యదేశపు పలుకుళ్లను ప్రయో గించుటచేతనే యనుదాని కుదాహరణముగా నీ తమిళభాషా ప్రయోగములనుఁ జూపవచ్చును.

నాయి దోర్ప నేర్చుగాక ఏమి సేర్ప నేర్చు-cf. త. నాయి = కుక్క.

ఈ వచ్చినపేళ్ళ యందు-cf, త. పేయర్, పేర్ = నామము. ఎత్తనిపేర్ = ఎంతమంది.

వేల. వేలగొని cf. త. వేలై = పని. ఉద్యోగము.

పురులు-ధనము. cf. త. పొరుల్ ముడి = కిరీటము. పొన్ముడి = బంగారు కిరీటము.

పొయిదల-cf. త. పొయి = అబద్ధము.

తన్నీర-cf త. తణ్ణీర్. తన్ని=ఉదకము, చల్లని నీరు.

పద్మిని యొడమి యెల్ల నూఱనొరి-cf. త. ఒడమై=ధనము.

కట్టాయము—cf. త. క. కట్టాయము=నిర్బంధము. నిశ్చయముగా.

నవ్వులక్ మలరుల కిచ్చి-cf. త. క-మలర్=పువ్వు.
కుళిరు గొన-cf. త. క. కుళిర్=చల్లదనము.
తళియ-cf. త. తళిగె=భోజనము, వంట.

తమిళభాషా పదములకంటె కన్నడభాషాపదములు, ప్రయోగములు, ఈతనిరచనయందు విశేషముగాఁ గానరగును. అవి పంపాది కన్నడకవుల గ్రంథములం దీతనికి గల యాదరమును, పరిచయమునే విశేషముగా సూచింపఁగలవు.

భీతికి కంఠవడంబు సుట్టి (=కాండపటము=తెర), కేనము, కెలసము, అగుర్వు, విగుర్వించు, అప్పగింపక, ఎల్లిదించు, మేలివెంచలు, దేసి, పందల, ఉరి (=దహానే), తుంతురునని (తుంతుర్=drizzling, spray, పని=drop, dew) మేలిల్లు, బాలకి, బేటము, బేటంబేటము, కోలవేళులు, పీలితోంగళ్లు, పేర్బిందులు, ఎలక్, వజిడీయలు, మేఘుడంబరములు, కెడ్పెరసు, ముట్టిమూదలించు, కునిసియాడు, అపమానము, ప్రోయు (=పీణెవాయించుటకు), ప్రుక్కిదము మొదలగు శబ్దములును,

"అయవనీసురాసుర చయంబు దద్గణాధపులగాం చుచు మీదికి మీద జీవముల్ పోయిరి"

"తలచితో-కాను-నిక్కము తపము సేయ వలచితో."

"తడియూరదు నేనియు."

"ఏ ప్రాప్తయే."

"వచ్చు రాడవు గాక."

"బాపితి మీకు నింతతోఁ."

"కూరెఁ గంతులు సవిన."

"గాడె సి వెంలి చేల్లపురులో"

"[illegible]"

ఈ మొదలగువాని విచిత్ర ప్రయోగము కన్నడ భాషాసంప్రదాయ సిద్ధమే యని తలంపవచ్చును. వీనిలోఁ గొన్ని పశ్చిమాంధ్ర దేశ భాగవ్యవహారములో నుండినను ఉండవచ్చును. కాని వాని ప్రసిద్ధి కన్నడదేశ వ్యవహారమునుబట్టియే యగుటచే, ఇవి యన్నియు నీ భాషలో నన్యదేశీయములుగనే పరిగణించవలసి యుండును. కాని యివి తరువాతి కవులకుఁ జెల్లుబడిఁ గాకపోవుటచేఁ గాబోలు ప్రాత తెనుఁగులోఁగూడఁ జేరినట్లు లేదు.

ఇట్లు సంస్కృతాద్యార్యభాషలలో మాతా, పితా, కరోతి, గచ్ఛతి మొదలగు శబ్దములు తక్కిన, గ్రీకు, లాటిన్ మొదలగు భాషలలో వలెనే మూలభాషనుండి వచ్చిన సజాతీయ శబ్దములే యైయుండ, నిటీవల నా భాషల నుండియే సంక్రమించిన పిక, దీనారాది శబ్దము లన్యదేశ్యము లైనట్టులే దక్షిణ దేశీయము లగు అరవము, తెలుఁగు, కన్నడము మొదలగువానిలోఁగూడ తల, నెల, ఊరు, పేరు మొదలగు, మూలభాషలనుండి సంక్రమించిన సజాతీయ

శబ్దములు కేవల దేశ్యములుగాఁ గ్రహింపఁబడుచుండ, తరువాతికాలమున పరిసర ప్రదేశము లందలి హిందూస్థానీ, మహారాష్ట్రి మొదలగు విజాతీయ భాషలనుండివలెనే సజాతీయ భాషలనుండియు సంక్రమించిన శబ్దములు అన్యదేశ్యములుగనే గ్రహింపఁబడవలసియుండును. కావున ఉత్తర హిందూస్థాన భాషలలోని 'దేశి' ఆ భాషలలో నన్యదేశ్యము కావలసినట్లే, దక్షిణదేశభాషలలోని తత్సమ తద్భవములును అన్యదేశ్యములుగనే పరిగణింపఁబడవలసియున్నది. ద్రావిడభాషలు సహజముగ దేశీయములే యగుటచే నందు దేశి విభాగ మావశ్యకమే కాఁబోదు.

# ద్రావిడభాషల పరస్పర సంబంధము.

హిందూదేశములో వ్యవహారమున నున్న భాషలు ఉత్తర హిందూస్థాన భాషలు, దక్షిణ హిందూదేశ భాషలు లేదా దాక్షిణాత్య భాషలు అని రెండు ప్రధాన వర్గములుగా నేర్పడుచున్నవి. ఉత్తర హిందూస్థానభాషల నార్య భాషలనియు, దక్షిణదేశ భాషలను ద్రావిడ భాషలనియుఁ జెప్పుట కలదు. ఉత్తరదేశభాష లార్యులకుఁ ప్రధాన భాషయగు సంస్కృతమునుండియో లేదా దానికి సంబంధించిన ప్రాచీనములగు ప్రాకృతముల నుండియో జనియించిన పంజాబి, గుజరాతి, మరాటి, బెంగాలి, ఉరియా, హిందీ మొదలగునవి. తెలుఁగు, తమిళము, కన్నడము, మళయాళము, తుళు, కొడగు, తుద, కోట, గోండి, కూయి మొదలగునవి దాక్షిణాత్య భాషలు. ఇవి యుత్తర హిందూదేశ భాషలతోడి సాజాత్యము కలవిగాఁ గనఁబడకుండుటచే నివి ద్రావిడ భాషావర్గమను నొక ప్రత్యేక వర్గమునకుఁ జెందినవని పలువురు భాషాతత్త్వజ్ఞులు తలంచుచున్నారు. ఇవి కాక హిందూదేశ మధ్యభాగమందలి కొన్ని ప్రదేశములలోని వ్యవహారమున ముండారి, సంతాలి మొదలగు మఱికొన్ని భాషలును కలవు. ఇవి "ముండా" భాషలనియు, కొలేరియన్ భాషలనియుఁ జెప్పఁబడుచు మఱియొక వర్గమునకుఁ జెందినవిగాఁ దలంపఁబడుచున్నవి. వీనికి హిందూదేశములందలి భాషావర్గములకంటె మలయా మొదలగు ప్రాచ్యద్వీపమునందలి భాషలతో నెక్కుడు సంబంధ మున్నట్లగపడుచున్నవి.

ద్రావిడ భాషలకుఁ బ్రధానస్థానము దక్షిణ హిందూదేశమే యైనను, మధ్యదేశమునను, ప్రాచ్యదేశమునను గల కొండల మీఁదను వసియించు నాటకజాతులచే వ్యవహరింపఁబడు గోండు, కుయి, ఒరాయన్, రాజమహాల్ భాషలకును, హిందూదేశపు వాయవ్యదిశను బెలూచిస్థాన ప్రాంతమున వాడుకలో నున్న బ్రాహూయి భాషకును, నాయా దేశ భాగములఁ బ్రబలవ్యాప్తిగాంచి యున్న యార్యభాషలతోఁ జి సామ్యముకలదు. దక్షిణదేశమందలి ద్రావిడ భాషలతో సామ్య మెక్కుడుగా నుండుటచే నివియు ద్రావిడ భాషావర్గములోఁ జేరినవేయగుచు. నొకానొకప్పుడు ద్రావిడ భాషలను వ్యవహరించు జను లీ యుత్తరదేశమున నెలకొని స్థానమువఱకు వ్యాపించి యుండిరనియుఁ దలంపఁబడుచున్నది. వీరు వాయవ్య దిఙ్మార్గమునను హిందూదేశమునఁ బ్రవేశించిరని చెప్పుదురు. అట్లు ప్రవేశించిన వారిలోఁ గొందఱు దక్షిణదేశమునకు వచ్చి నెలకొని యచ్చటి యాదిమనివాసులతోఁ గలిసిపోయి యుండిరి. ఉత్తరదేశమునందే నిలిచినవారిలోఁ గొందఱు, తరువాతి కాలమున వచ్చి యాప్రదేశముల నాక్రమించుకొనిన యార్య జనసంఘముతోఁ గలిసిపోవుటచే వీరి భాష యనేక విధముల మార్పు నొందుటయే కాక యార్యుల భాషకూడ ననేకములగు మార్పులకు లోనగుట తటస్థించినది. దక్షిణ దేశమున నెలకొనిన ప్రాచీన జనసంఘము మా కాలమున నాక్రమించికొనిన యాయాదేశభాగములనుబట్టి వారిలో వారికిఁ బరస్పర స[illegible]ములు తక్కువయగుటచే, కాల

క్రమముగ వారి భాషయునుఁ గొన్ని ప్రాంతీయ విశేష లక్షణములను బెంపొందించుకొని దేశ భేదమును బట్టి భిన్నమై మఱికొంత కాలమునకు ఆయా దేశములందు స్వతంత్రభాషలుగ నేర్పడుట తటస్థించియుండును. కాలగతిని వీనిలో సహజముగఁ గలిగిన మార్పులకుఁ దోడుగా నా యా ప్రదేశములందు దేశీయములు విదేశీయములును నగు నితర భాషలతోఁ గలిగిన సంపర్క విశేషము వీని నొకదానితో మఱియొక దానికి సంబంధమే లేదనిపించునంతగా మార్చివేసినది. కాని యీ భాషలలోని పదములను. భాషా పద్ధతులను బోల్చి చూచితిమేని వీనిలోఁ జెక్కింటికి మూలరూపములు సమానములే యనియు. ప్రాచీనరూపములలోను ధాతువులలోను గల సామ్యమును బట్టి వీనికి సన్నిహిత సంబంధము కలదనియు స్ఫురింపక మానదు.

వీనిలోని ప్రధాన భాషలలో తమిళ మళయాళములకుఁ దక్కిన వానిలోకంటె నెక్కుడు సంబంధము కలదు. ఒకటొక భాష మాటాడు వారికి రెండవ భాష సామాన్యముగా నర్థమగుచునే యుండును. ప్రాచీన మళయాళమునకును తమిళమునకును దాదాపుగా భేదమే చెప్ప నచ్చునవియుఁ దలంపఁబడుచున్నది. ఇది తమిళమునుండి చిరకాలము క్రిందటనే విడివడిన భాషయై యుండును. తెలుఁగు కన్నడములట్లుగావు. ఇవి మూలభాషనుండియే తమిళముతోపాటు దేశభేదమునుబట్టి స్వతంత్రములై విడివడిన ప్రాంతీయ భాషలు. వీనిలో కన్నడము కంటెఁ దెలుఁగునకును తమిళమునకును విశేష భేద మగపడుచున్నది. లిపి మొదలగు కొన్ని విషయ

ములలో కన్నడము తెలుఁగును బోలియున్నను పెక్కు విషయములలో నది తమిళమునకే చేరికగలదై యున్నది. కన్నడభాషలో తమిళమునందువలెనే స్త్రీలింగ వివక్ష, స్త్రీలింగద్యోతక ప్రత్యయములు గలవు. ఆంధ్రమున నపుంసకలింగ సర్వనామ శబ్దములు. తత్ప్రత్యయములే స్త్రీ లింగద్యోతకములు గూడ నగుచున్నవి మహదమహద్బహువచ ప్రత్యయములుకూడ నీ రెండు భాషలలోఁ దక్కిన సజాతీయ భాషలలోని వానికంటె నేకీభావము కలిగియున్నవి. ప్రథమేతర విభక్త్యంగరూపవిషయమునఁ గూడ నీ భాషలలోఁ దక్కినవానికంటె నెక్కుడు సామ్యముకలదు. దీనిని బట్టి యా ద్రావిడ జనసంఘము తొలుత నెలకొనిన దేశము నందలి భేదమునుబట్టి ప్రాచీనభాష వేఱుపడిన తరువాతఁ గొంత కాలమువఱకుఁ దెలుఁగు కంటె తమిళకన్నడములకు పరస్పరము సంసర్గ మెక్కుడుగా నుండెనని తలంపవలసి యున్నది, ఇట్లీ రెండును కలిసి ద్రావిడభాషాస్రవంతి కొక ప్రత్యేక మూలశాఖగా నేర్పడుచున్నవి. రెండవ మూలశాఖ తెలుఁగు, మళయాళము తమిళమునుండి చీలిన యుపశాఖ. తుళు, కొడగు, తుద. కోట అనునవి తమిళ కన్నడములకు మూలమగు శాఖనుండి విడివడిన యల్పశాఖలుగాఁ గనఁబడుచున్నవి. కురుఖ్. మాల్తో. గోండి, కుయి, కోలామి అనునవి మూలభాషనుండి చీలి తెలుఁగు శాఖను జేరి ప్రవహించిన స్వతంత్ర శాఖలుగా నున్నవి. బ్రాహుయి వీని యన్నిటి కంటెఁ బ్రాచీనమైన యొక స్వతంత్రశాఖ. ఉత్తర భూములలోఁ బ్రవహించిన విశేషసాంకర్యమునకు లోనైనది. ఆంధ్ర

ఇట్లు చిరకాలము క్రిందటనే ప్రత్యేకముగా విడివడిన ద్రావిడభాష యొక్క శాఖగాను, తెలుగు ప్రధానముగాఁ గలిగి కూయి, మాల్తో, గోండి, కుయి, కోలామి భాషలతోఁ గూడినది మఱియొక శాఖగాను కన్నడమును, తమిళ మళయాళములును ప్రధాన శాఖలుగాఁ గలిగి, తుళు, కొడగు, తోడ కోట భాషలతోఁ గూడినది మఱియొక శాఖగాను గలిగి, ప్రాచీన ద్రావిడ భాషామహావృక్షము త్రిశాఖావృతమై చిలవలుపలవలు వెట్టి దక్షిణాపథమంతయు నావరించి గీర్వాణభాషా వాఙ్మయ విజ్ఞాన దోహదముచేఁ బెంపొంది యాయాశాఖల నాశ్రయించిన వారి కతి రమ్యమగు వాఙ్మయ స్వాదుఫలములచేఁ దనియించుచున్నది.

ఇటీవలి కాలమున రాజ్యాంగ సంసర్గమూలమున నాంధ్ర భాషాపదములు కన్నడమునను, కన్నడపదములాంధ్రమునను జేరియుండుటచేతనో, వీని లిపులు తమిళ లిపికంటెఁ గొంత భిన్నమైన యొక ప్రాచీనలిపినుండి బయలు దేఱినవగుటచేఁ నెక్కుడు సామ్యముగల వగుటచేతనో, ఆంధ్రకన్నడములకు తమిళముకంటె విశేష సన్నిహితత్వమున్నటు లగపడుచున్నది. కాని ప్రధానవిషయములలో కన్నడము తెలుఁగుకంటె తమిళమునకే చేరిక గలదై యుండెననుటకు సందేహము లేదు. శ్రీనాథుఁ డాంధ్రమునసే కవిత్వము చెప్పెను, రాజమహేంద్రవర కవులతోఁ దనభాష నిజముగా కర్ణాటకభాషయని చెప్పినాఁడన్న కథా విషయమును గూడఁ బరిహాస గర్భితముగనో రాజ్యాంగ సంబంధపరముగనో గ్రహింపవలసినదేగాని యా భాషల యభేద

మును సూచించుచుఁ జెప్పినదని తలంచుట కవకాశము లేదు. అప్పటి కేడువందల సంవత్సరముల క్రితమే, కుమారిల భట్టు తన రచించిన తంత్రవార్తిక గ్రంథమున దక్షిణదేశ భాషలనుగూర్చి చేసిన ప్రశంసలో వీని "నాంధ్ర ద్రావిడభాష" యను పదముచేఁ బేర్కొనె నన్నప్పుడుకూడ నాంధ్రశబ్దము ఆంధ్ర కర్ణాటక పరమగుననియు, ద్రావిడపదము తమిళ మళయాళ పరమగుననియు కాల్డ్వెల్ పండితుండూహించుట* కేవలము పొరపాటే. ఆంధ్రమునకుఁ దక్కిన ద్రావిడభాషల కంటె నొక విధమగు ప్రత్యేకత కలదనియు, కుమారిల భట్టాంధ్రపదముచేఁ దెనుఁగును, ద్రావిడ పదముచేఁ దక్కిన ద్రావిడభాషలన్నిటిని సూచింప నెంచెననియు నీ రెండు శాఖలును గలిసి యేకభాషగా గ్రహింపఁదగుననుభావమునే ఆతఁడు వ్యక్తముచేయఁ దలంచెననియు స్టెన్‌కొనోపండితుఁడు చెప్పినదికూడ యుక్తి యుక్తమే గాని వాస్తవము కాదు. ఏలయనఁ బరిశీలింపఁగా తంత్రవార్తికమున నీ యాంధ్రశబ్దమే యా సందర్భమున కానవచ్చుట లేదు. ద్రావిడశబ్దము మాత్రమే వేదమునందలి మ్లేచ్ఛపదముల యర్థ నిర్ణయ విషయకమగు చర్చా సందర్భమున నొకటి

*One of the earliest terms used in Sanskrit to designate the family seems to have been that of **Andhra-Dravida-bhasha**, the Telugu-Tamil **language** used by **Kumarila Bhatta.** The term though *vague is* not badly chosen. Kanarese was probably supposed to be included in Telugu and Malayalam in Tamil and

రెండు శ్లోకములం గాంచవచ్చుచున్నవి. వేదమునం గాంచబడు మ్లేచ్ఛ శబ్దముల యర్థ నిర్ణయమును గూర్చిన యీ సందర్భము నిచ్చట తెలిపెదము నిచట యప్రసక్తము కాఁబోదు దీనివలన నా కాలమునందలి భాషాతత్వ విచారణ మెట్టిదో ద్రావిడ భాషలనుగూర్చి వారికిఁగలజ్ఞాన మెట్టిదో కొంచెము తెలిసికొన నవకాశము కూడఁ గలుగఁ గలదు.

తంత్రవార్తికము ప్రథమాధ్యాయము తృతీయపాదమున నార్యభాషాశబ్దముల యర్థ విషయమున వైదిక ప్రయో

*yet both dialects together with any sub-dialects that might be included in them, were evidently regarded as forming but one Basha. Caldwell's Comparative Grammar*

*'The word Dravida forms part of the denomination Andhra Dravidaona' the language of the Andhras (Telugu) and Dravidas (Tamilians) which Kumarila Bhatta (probably of 7th c. A D) employed to denote the Dravidian family ... Tamil and Malayalam are two sister dialects of the same language Kanarese is also closely related to Tamil and the two languages form together one of the pricipal groups of the Darvidian family. If Kumarila's denotation denotes a a difference of dialect, which is by no means certain, Kanarese and Tamil would be included in the Dravida Bhasha as against Telugu the Andhrabhasha.' LSI, Vol IV, p 284*

గమునకును, శిష్టవ్యవహారమునకును విప్రతిపత్తి కలిగినపుడు దేనిని ప్రమాణముగా గ్రహింపవలయును-"కోర్థః స్యాత్ పారమార్థికః" అను ప్రశ్న బయలుదేఱఁగా, వేదమునఁ జెప్పఁబడిన యర్థమే యచ్చట ప్రమాణముగా గ్రహింపవలసినదనియు, లౌకికవ్యవహారము దానికి భిన్నమైనపుడు వ్యావహారికార్థము ప్రధానముగను, వైదికార్థము గౌణముగను గ్రహింపవలయుననియు సమాధానము చెప్పి* లౌకికవ్యవహారమున నాయా శబ్దార్థము లెట్లు నిశ్చయముగా గ్రహింపఁబడునో, అట్లే వైదిక వ్యవహారమున నాయా యర్థములు నిశ్చితములే యగును. కావున శాస్త్రాధారము గలిగిన యర్థజ్ఞానమే విప్రకృష్టము, సంకరము నగు సామాన్యవ్యవహారముపై నాధారపడిన యర్థజ్ఞానముకంటె బలవత్తరము అని సిద్ధాంతీకరింపఁబడినది.

"తస్మాత్ శాస్త్రస్థితైర్ వైకా ప్రతిపత్తిర్బలీయసీ
న సమాముక్తకాచారై ర్విప్రకృష్టైః ససంకరై"రితి

ఇఁక నార్యావర్తనివాసులకు సుప్రసిద్ధములు కానట్టియు, వేదమునఁ బ్రయోగింపఁబడి యున్నట్టియు మ్లేచ్ఛశబ్దముల విషయమున నర్థనిర్ణయమెట్లు? వానికి సంస్కృతభాషా సంప్రదాయానుసారముగా వ్యుత్పత్తిని గల్పించి చెప్పఁబడిన యర్థము గ్రాహ్యమా, లేక మ్లేచ్ఛజన వ్యవహారమునఁగల

* "యత్రతు సంఖ్యేయాన్తరవిషయత్వం తత్ర వైదికోర్థో గౌణోగృహ్యతాం లౌకికోవా ముఖ్య ఇతి. తాదృశే విషయే ముఖ్యార్థత్వా ల్లౌకిక ప్రసిద్ధి రేవ గ్రహీతవ్యేతి ఉత్తర సూత్రే వక్ష్యామః"

సముదాయప్రసిద్ధియే గ్రాహ్యమా? యను ప్రశ్న గలిగినది.

"యోగశక్త్యా న ప్రసిద్ధాస్స్యు రార్యావర్త నివాసినామ్
తేషాం మ్లేచ్ఛప్రసిద్ధోర్థో గ్రాహ్యో నేతి విచిన్త్యతే
నిరుక్తవ్యాకరణాభ్యాం ప్రసిద్ధిః కిం బలీయసీ
సముదాయప్రసిద్ధిర్వా మ్లేచ్ఛస్యైవాథవా భవేత్."

ప్రస్తుతము మ్లేచ్ఛ వ్యవహారమునందలి యర్థము గ్రహింపఁబడవలయునను మాట మాత్ర మెట్లు పొసగును. మ్లేచ్ఛ వ్యవహారమున శబ్దమునకుఁ బ్రసిద్ధార్థ మిది యని నిర్ణయించుట యెట్లు? మ్లేచ్ఛదేశము లనేకములు. వానిలో నన్నిటం దిరిగి యా శబ్దార్థమును గ్రహింపవలెను. మఱియు భిన్న దేశములలో భిన్నముగా నున్నచో నిర్ణయము సాధ్యము కాదు గదా? మ్లేచ్ఛులకు శబ్దప్రయోగము విషయమున స్వేచ్ఛాప్రవృత్తి గలిగియుండుటచే శబ్దస్వరూపమువలెనే శబ్దార్థము గూడఁ దఱచు మాఱుచుండును. కావుననే మ్లేచ్ఛాప భాషణమున నొక్క సంస్కృత శబ్దము కూడ లేదు గదా? ఏవో కొన్ని యున్నను అవి యార్యులచే గ్రహింపఁబడిన వానికంటె భిన్నార్థములై ప్రత్యయాదుల భ్రష్టములై యుండుటచే నర్థబోధకములే కావని చెప్పవచ్చును. మ్లేచ్ఛ భాషలలో సంస్కృత శబ్దములను వెదకు నార్యులు చేయున దేమనఁగా నొక పదమున కితర పదములలోని యక్షరములను ముడివెట్టి యేదో యొక సంస్కృత పదమును గల్పించుటయే యైయున్నది. అప్పుడు కూడ నొక దీర్ఘాక్షరము తక్కువగనో, ఒక హ్రస్వాక్షర మెక్కువగనో కనఁబడుచునే యుండును, అని

చెప్పి యిందుల కుదాహరణముగా ద్రావిడభాషలోని పద ములను గ్రహించి చూపుచున్నాఁడు.

* "తద్యథా ద్రావిడాది భాషాయామేవ తావత్"- అదెట్లనఁగా ద్రావిడాదిభాషలలోని వ్యంజనాంతపదములకు

* "తద్యథా ద్రావిడాది భాషాయామేవ తావద్వ్యంజనాన్త భాషా పదేషు స్వరాన్తవిభక్తి స్త్రీ ప్రత్యయాదికల్పనాభిః స్వభాషాను రూపా నర్థాన్ ప్రతిపద్యమానా దృశ్యంతే. తద్యథోదనం చోరిత్యుక్తే చోరపదవాచ్యం కల్పయన్తి. పన్థానమతరిత్యుక్తే అతర ఇతి కల్ప యిత్వాహుః 'సత్యం దుస్తరత్వాదతర ఏవ పన్థా ఇతి' తథా పాప శబ్దం పకారాన్తం సర్పవచనం అకారాన్తం కల్పయిత్వా సత్యం పాప ఏవాసావితి వదన్తి. ఏవ మాల్ శబ్దం స్త్రీ వచనం మాలేతి కల్ప యిత్వా సత్యమిత్యాహుః, వయర్ శబ్దంచ రేఫాన్తం ఉదర వచనం వైరి శబ్దేన ప్రత్యామ్నాయం వదన్తి. సత్యం సర్వస్య క్షుధిత స్యాకా ర్యేప్రవర్తనాదుదరం వైరికార్యే ప్రవర్తత ఇతి. తద్యథా ద్రావిడాది భాషాయామీదృశీ స్వచ్ఛన్ద కల్పనా తదా పారసీక బర్బర యవన రౌమకాది భాషాసు కిం వికల్ప్య కిం ప్రతి పత్స్యన్త ఇతి న విద్మః."

తస్మాత్ మ్లేచ్ఛ ప్రసిద్ధం యత్పద మార్యై ర్వికల్ప్యతే
నక శ్చిత్తత్ర విశ్వాసో యుక్తః పదపదార్థయోః
నిరుక్త వ్యాక్రియాద్వారా య స్త్వర్థః పరిగమ్యతే
పిక నేమాదిశబ్దానాం స ఏవార్థో భవిష్యతి. ఇతి ప్రాప్తమ్,
ఏవం ప్రాప్తే వదామోఽత్ర పదం విపుల దృష్టిభిః
విజ్ఞాయే తావినష్టం యత్తదరం భవిష్యతి
యత్తు వేద తదంగేషు పదం దృష్ట మవిప్లుతం
మ్లేచ్ఛ భాషాసు తద్రూప మర్థే క్వచనచోదితం
తత్త థైవ ప్రతీయేత ప్రమాణేనా విరోధతః

స్వరాన్త విభక్తి స్త్రీ ప్రత్యయాది కల్పనచేసి సంస్కృత భాషాపదముల కనువగు నర్థము కలవానినిగాఁ జేయుచున్నారు. "చోర్" అను పదము ద్రావిడ భాషలో "అన్నము" అను నర్థము కలదై యుండగా దానిని అకారాంతముగా నెంచి "చోర" పద వాచ్యముగా గ్రహించుచున్నారు. మార్గము అను నర్థము గల "అతర్" శబ్దమును "అతరః" అను దానిగా గ్రహించి తరింప శక్యము కానిది గనుక మార్గమును "అతరః" అనుట న్యాయమే యని దానికి వ్యుత్పత్త్యర్థమును గల్పించి సమర్థించుచున్నారు. పకారాంతమై సర్పము అను నర్థముగల "పాప్" శబ్దమును "పాప" అని అకారాంత శబ్దముగా గ్రహించి వాస్తవముగా నిది పాపియే గనుక దానికా పేరు వచ్చినదనుచున్నారు. స్త్రీ వాచకమగు 'మాల్' ఆళ్ శబ్దమును "మాలా" శబ్దముగాఁ గ్రహించి యది యన్వర్థమే యని చెప్పుచున్నారు. ఉదరవాచకమైన రేఫాంత "వయిర్" శబ్దమును "వైరి" శబ్ద ప్రత్యామ్నాయముగాఁ జెప్పుచు క్షుధితుఁడైనవాఁడు అకార్యమునఁ బ్రవర్తించును గావున నుదరము వైరి కార్యమునఁ బ్రవర్తింపఁజేయున దగుటం జేసి మానవునకు వైరియే యగును. ఇట్లార్యావర్తభాగ

---

పికనేమాది తద్ధ్యేవం నిపుణై రవధారితం
చోదితం హ్యుపదిష్టం వా ప్రయుక్తం వా క్రియాగతం
మ్లేచ్ఛై రవధృతం సశ్చా దార్యై ర్ద్వైభాషికైః క్వచిత్
తాదృశం తు ప్రతీయేత ప్రామాణ్యే నేతి నిశ్చితమ్
నత ద్ధర్మప్రమాణేన వేదాఖ్యేన విరుధ్యతే.

ముననే నివసించు ద్రావిడ జనుల వ్యవహారములోని శబ్ద ముల యర్థము విషయముననే యిట్టి స్వచ్ఛంద కల్పనలు చేయఁబడుచున్నపుడు ఇంకను దూరస్థులగు పారసీకులు, బర్బరులు, యవనులు, రోమకులు మొదలగు వారి వ్యవ హారములోని పదములను సంస్కృత పదములుగాఁ జేయుట కింక నెన్ని మార్పులుచేసి, యెట్ట్ యర్థములనుఁ బడయు దురో చెప్ప నలవి కాదుగదా! కావున నార్యులచే గ్రహింపఁ బడిన మ్లేచ్ఛశబ్దముల స్వరూపార్థము లనేకవిధములగు విక ల్పనలకు లోనగుచుండును గావున నా పదపదార్థములను మన మెప్పుడు నమ్మకముతో స్వీకరింపరాదు. పిక నేమాది శబ్దములకువలెనే వ్యాకరణ నిర్వచన మూలముగా నిర్ణయిం పఁబడిన యర్థమునే వాని యర్థముగా గ్రహింపఁదగును.

అను వాదము సంభవింపఁగా నిట్లు సిద్ధాంతము చేయఁబడినది. నిపుణులగువారు పరిశీలించి వినష్టము కాని పదమున కే యర్థము నిర్ణయింతురో అదే దాని యర్థముగా గ్రహింపనగును. వేద వేదాంగములయందుఁ జెప్పఁబడిన పిక నేమాది శబ్దములు మ్లేచ్ఛ భాషలయందు మార్పులేక యున్నపుడు ప్రామాణ్య విరోధము లేకపోయినచో మ్లేచ్ఛ భాషార్థమే గ్రహింపవచ్చును. అది వేదప్రమాణమునకు విరోధము కాఁబోదు.

ఈ మీమాంసవలన మన మీ క్రింది విషయములను గ్రహింపఁదగియున్నది. ఆర్యులచే మ్లేచ్ఛభాషలని పిలువఁ బడిన యనార్యభాషలగు యవనరోమక ద్రావిడాది భాషల నుండి యనేకశబ్దములు వేదకాలమునుండియు వారి గ్రంథ

ములలోఁ బ్రవేశించినవి. ఆర్యులు వీనిని గ్రహించి నపు డాయా శబ్దముల కాయా భాషలలో నేయర్థము కలదో ఆ యర్థమునే గ్రహించియుందురు గాని వేఱు విధముగా నై యుండదు గదా? కొంతకాలమున కీ పదము లార్యభాషా పదములే యని సమర్థించుటకో, వానికున్న యర్థమును స్థిరపఱచుటకో నార్యభాషా ప్రత్యయాదులను గల్పించి దాని యర్థమున కనుకూలమైన యేదో యొక ధాతువునకు ముడివెట్టి దానికి వ్యుత్పత్తులను కొందఱు వైయాకరణులు గల్పింప యత్నించిరి. కొన్ని సందర్భములలో నాయా యర్థములను సమర్థించుటకు విచిత్రమైన యితిహాసములను గూడఁ గల్పింప దొడంగిరనుటకు బ్రాహ్మణములలోఁగల యనేకములగు కథలే మనకు నిదర్శనములు. ఒకప్పు డొక్కొక్క శబ్దమునకై యొక్కొక నూతన ధాతువు కూడ కల్పింపఁ బడియుండును. కాలక్రమమునఁ గొన్ని యార్య శబ్దములకే వ్యవహారమునం దర్థము మాఱిపోవుట తటస్థించినపుడు ఏ యర్థము ప్రమాణముగా గ్రహింపఁదగినదిఅను ప్రశ్న బయలుదేరినది. ఇట్టివి త్రివృత్, చరు మొదలయినవి కొన్ని కలవు. వీనికి వేదములో తొమ్మిది పర్యాయములు వండబడిన యన్నము అని యర్థము. వ్యవహారమున వీనికి మూఁడు పర్యాయములు, ఒక పాత్ర యనియు వరుసగా నర్థములు గలిగినది. ఏ యర్థమును ప్రమాణముగా గ్రహింపవలెను? అనఁగా, వేదమున వైదికార్థము వ్యవహారమున వ్యావహారికార్థమును సందర్భానుసారముగా గ్రహింపఁదగినదని చెప్పుచు ధర్మము విషయమున వైదికార్థమే బలవత్తర.

మగునని సమాధానము చెప్పినారు. అనఁగా కాలక్రమమున శబ్దములకు రూపములతో పాటు అర్థముగూడ మాఱుచుండుటవలన, ఆర్యులు ధర్మము కొఱకు శబ్దప్రయోగము చేయుదురు గావున శబ్దస్వరూపమును అర్థమును గూడ మార్పు నొందకుండఁ జేయుటకు విశేష ప్రయత్నము చేసిన వారైనను భాషకు సహజమగు మార్పు తప్పకుండుటచే నద్దానిని గుర్తించిన తరువాత వారు వైదిక ప్రామాణ్యమును నిలువఁబెట్టుటకు వైదికార్థమే ధర్మవిషయమున బలవత్తరమని చెప్పినను, వ్యావహారికార్థము గౌణమగుననియు, జెప్పవలసినవారైరి. ఆర్యశబ్దముల విషయ మిట్లగుచుండగా ననార్యులకు శబ్దప్రయోగవిషయమున ధర్మబుద్ధి లేకుండుటచే నవి విశేషముగ మార్పుల నొందుచుండును గావున మ్లేచ్ఛ వ్యవహారమును ప్రామాణ్యముగ గ్రహించుటలో గొప్ప చిక్కేయున్నను, ద్వైభాషికులగువారు పరిశీలించి నిర్ణయించినపుడును వైదికార్థమునకు విప్రతిపత్తి లేనపుడును మ్లేచ్ఛవ్యవహారమే ప్రమాణముగా గ్రహింపవచ్చునని చెప్పఁబడినది. కాని మ్లేచ్ఛశబ్దములను ఆర్యశబ్దములుగనే గ్రహించి కొందరు వానికి వ్యుత్పత్తులను జెప్పఁదొడంగిరనుటకు పిక నేమాది శబ్దములే నిదర్శనములు. ఈ శబ్దములిపుడు సామాన్యముగా నార్యశబ్దములుగనే గ్రహింపఁబడుచున్నవి. కాని కుమారిలుని కాలమునకుఁ బూర్వమే యవి మ్లేచ్ఛశబ్దములని గ్రహింపఁబడిన ట్లగపడును. పిక శబ్దమునకు లింగాభట్టీయమున అపిహితం కాయతీతి – పికః – కైగై

శబ్దే = కనిపించక పలుకునది. "అపిరంతర్ధా" కై, గై ధాతువులనుండి యేర్పడినట్లుగా వ్యుత్పత్తి చెప్పఁబడినది. ("కాకః" శబ్దమునకు కూడ నిట్లే "కా ఇతి కాయతీతి = కాకః అని వ్యుత్పత్తి) కాని యీ "పిక" శబ్దము రోమక భాషా శబ్దముగాఁ గనఁబడుచున్నది. (*cf. Latin-picas*) "పికస్" అను శబ్దము లాటిన్ భాషలోని యర్థముననే కలదు. ఇట్లే "దీనార" శబ్దము లాటిన్ భాషలోని "డెనేరియస్" (cf. *Latin-denarius*) అను దానినుండియు, "ద్రమ్మ" అనునది యవనభాషలోని "డ్రాక్మె" (cf. *Gk-drakhme*) అను శబ్దమునుండియు పరశు శబ్దము యవనభాషలోని "పెలెకస్" శబ్దమునుండియు వచ్చినవనియుఁ దెలియుచున్నది. ఆ కాలమున విదేశీయ భాషాశబ్దములే యార్యభాషలోఁ జేరినపుడు దేశీయములగు భాషలలోనిశబ్దములును పెక్కు చేరియుండుననుటకు సందేహము లేదుగదా! ఇట్లు ద్రావిడభాషా శబ్దములెన్ని చేరినవో! కుట, కుండ, నీల, పుష్కర, పుష్ప, పూజన, ఫల, బీజ, మయూర, రాత్రి, రూప మొదలగునవి ద్రావిడాది భాషలలోనుండి యార్య భాషలలోఁ జేరినవిగాఁ జెప్పుచున్నారు. నీర, మీన శబ్దములు కూడ నట్టివేయై యుండును. వీనికి నిఘంటువులలో నేదో యొక వ్యుత్పత్తి కల్పింపఁబడియే యుండును గాని అట్టి కల్పనమును మన మెల్లప్పుడును విశ్వసింప రాదనుటకే కుమారిల భట్టు ద్రావిడభాషాశబ్దముల నుదాహరణముగాఁ గైకొని చూపినాఁడు. కావున నాతని కాలమున ద్రావిడభాష మ్లేచ్ఛ భాషలలోఁ జేరినదేగాని ప్రాకృత భేదముగా గ్రహింపఁబడ

లేదనుట స్పష్టము. అప్పటికే దేశభాషలనుండి గ్రహింపఁబడిన శబ్దములకు యత్కించిత్ ధ్వని సామ్యమును బట్టి సంస్కృతశబ్దములుగా మారి వ్యుత్పత్తులు కల్పింపబడుచుండగా 'జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్' అను భావము ప్రబలిన యిటీవలికాలమున దేశభాషలన్నియు దద్వికృతులే యనుటలో నాశ్చర్యమేమున్నది? దేశ్య (మ్లేచ్ఛ) పదములు సంస్కృత ప్రాకృతములలోఁజేరి మరల దేశ్య భాషలలో తత్సమ తద్భవములుగ నెన్నో చేరియుండు ననుటలోఁగూడ నాశ్చర్యము లేదు.

ఆర్యులు మ్లేచ్ఛశబ్దముల కర్థనిర్ణయము చేయునపుడు వానిని తాఱుమాఱు చేసి వ్యుత్పత్తి కల్పనము చేయుదురనుట కుదాహరణముగా కుమారిలభట్టు ఇచ్చిన ద్రావిడభాషా శబ్దములలోఁ గొన్నిటి స్వరూపమందే కొంత వ్యత్యాస మగపడుచున్నది. చోర్, పాప్ శబ్దములు కుట్రియలుకార మనఁబడు అర్థమాత్రతో కారాంతములుగా తమిళభాషలోఁ గనఁబడుచున్నవి. పలుకుబడిలో నిది సువ్యక్తము కాదు గావున వ్యవహారమును బట్టి వీనిని హలంతములుగనే యాతఁడు గ్రహించియుండును. ఇట్టి శబ్దములలోఁ గొన్ని కాలక్రమమున వ్యవహారమున ఉకారాంతములే యగుచు వచ్చినవిగాని, సంధిలో-అనఁగా వానికి మఱియొక అజాదిశబ్దము పరమైనపుడా యుకారము లోపించుచువచ్చినది. ద్రావిడభాషలలోని పాప్ శబ్దము నడుమ నొక "మ" కారము కూడ కలదు. త-పామ్పు, మళ-పామ్పు, తెలు-పాము- కన్న. తు. పావు అను రూపములు ద్రావిడ భాషలలోఁ గలవు. కుమారిలభట్టు

మకార విరహితముగ గ్రహించిన రూపము ఆ కాలమున పామర వ్యవహారమునందలి భ్రష్టరూపమా, లేదా శిష్ట వ్యవహారమునఁగూడ నా కాలమున నది యట్లే యుండెనా? యను సందేహము కలిగినది. కన్నడములోని 'వ' కారము 'ప'కారస్థానమున వచ్చునదైనఁ గావచ్చును, లేదా "మ"కారస్థానమున వచ్చునదై నను గావచ్చును. పాపఱేడు జనపనార, ఇనుపకోల మొదలగు తెలుఁగు సమాసములలో మరాంతములగు నీ శబ్దములు విశేషణములై నిలిచినపుడు పత్వమును బొందుచున్నవి తమిళమునఁగూడ పాప్పా క్కొడి, ఇరుప్పుకోల్ అనుపట్ల నిట్లే పకారము ద్విత్వ మును బొందినదై యున్నది. తమిళమునందలి పామ్పు ఇరుమ్పు మొదలగువానిలోని మకార ముచ్చారణ సౌక ర్యము కారణముగావచ్చి చేరినదని చెప్పినచో వానిపూర్వ రూపము కుమారిలభ ట్టుదాహరించినరీతిని పామ్ యనియే యుండియుండు ననవలసియున్నది. పామ్బు లోని మ్బు వు అయినదా? లేదా తొలి రూపము "పాప్" అని యుండుటచే విశేషణ సమాసములలో నా పకారమే పొడసూపినదా? యను విషయము పరిశీల నార్హము. మ్బు వర్ణముతోఁగూడిన తమిళ శబ్దము లనేక ములు—నామ్బు, శణమ్బు, వేమ్బు, ఎలుమ్బు మొదలగు నవి - తెలుఁగున నాము, జనుము, వేము, ఎము(క)—— ఎమ్ము అని మువర్ణాంతములైనవి. ఇవి విశేషణములైన పుడు పవర్ణమే పొడసూపుచున్నది—జనపనార, నాపచేను. కావుననే నామ్వాది కనుమ్వాదులకు పజ్ పవర్ణములను

విధించి వైయాకరణు లా రూపములను సాధించినారు. కాని భాషాశాస్త్రపద్ధతిని వీనిని సమర్థింపవలసివచ్చినపుడు ప్రాచీనరూపములందు గల పవర్ణమే యా పదబంధములలో నిలిచియున్నదనియు, నామవాచకరూపములు కాలక్రమమున మార్పులనొందినవనియుఁ జెప్పవలసియుండును. కావున "పాప్" శబ్దమే "పాము" కంటెఁగూడ ప్రాచీనమేమో!

ఇఁక "అతర్" శబ్దము తమిళభాషలోనే యిటీవల వ్యవహారమున నంతరించినది. అయినను కుమారిలుని కాలమున వ్యవహారమున నుండియుండును. తెలుఁగు కన్నడములలో మాత్ర మీ శబ్దము లేదు. ఇఁక "మాల్" శబ్దము స్త్రీ వాచకముగ ద్రావిడభాషలలో నెద్దానిలోను ఉన్నట్లగపడదు. ఇది 'మాల్' శబ్దము కాదు - "ఆళ్" శబ్దమేయై యుండును. "ఏవంఆల్ శబ్దం స్త్రీవచనం" అని కుమారిలుని పాఠమైయుండఁగా, తరువాత వ్రాతగాండ్రెవరో "ఏవమాల్ శబ్దం" అని తప్పు వ్రాత వ్రాసియుందురు. "తద్యథా ద్రావిడాది భాషాయాం" అన్నదానిని "తద్యథాంధ్ర ద్రావిడభాషాయాం" అను పాఠము కల్పించి "ఆంధ్ర ద్రావిడ భాష" అనునదొకటి కలదని కాల్డువెల్ మొదలగు వారికిగూడ మతిభ్రమ కల్పించినారు గదా!! ఇట్టి "మాల్" శబ్దమును లేదా ఆళ్ శబ్దమును "మాలా" శబ్దముగా గ్రహించి స్త్రీ మాలా శబ్దవాచ్యమే యగునని వ్యుత్పత్తి కల్పింతురఁట.

మఱియొక విశేష మేమనఁగా తంత్ర వార్తికము ముద్రిత గ్రంథమునను, శ్రీ మహామహోపాధ్యాయ గంగా

నాథ ఝాగారి యాంగ్ల భాషా పరివర్తనమునను, "తద్వధా ద్రావిడాది భాషాయాం" అనియే యుండఁగా నీ యాంగ్ల పరివర్తనమున కుపోద్ఘాతము వ్రాసిన గోపీనాథ కవిరాజు గారు పై ద్రావిడ శబ్దములలో తుది రెండిటిని "నడర్" "ఆళ్" అని గ్రహించియున్నారు. వా రుపోద్ఘాతము వ్రాయుచున్న ముద్రిత గ్రంథములో లేని రూపములు వీరి కెక్కడనుండి వచ్చినవో తెలుపలేదు. వేరు ప్రతిలోని పాఠాంతరములై యుండునని మన మూహింపవలసియున్నది. అప్పుడు వారి మూలగ్రంథమున వీనియర్థము వ్యుత్పత్తి మొదలగు వానిని గూర్చిన పాఠముగూడ వేఱుగా నుండవల యుఁగదా! "అతర్" శబ్దమునకు బదులుగా "నడెర్" అను నది పాఠాంతరమనుకొనుట కట్టిశబ్ద మేద్రావిడ భాషలోను నున్నట్లగపడదు. "నడెర్" అను పాఠమును గ్రహించి యది ద్రావిడభాషలోని "నడై" అను శబ్దమే యని యా కవిరాజు గారుచెప్పుచున్నారు. కానిదీనికి "అతరః" అనుదాని వ్యుత్పత్తి యెట్లు పొసగును? ముద్రిత గ్రంథములోని "మాళ్" శబ్దము నకు బదులుగా "ఆళ్" అను పాఠమును గ్రహించి "ఒక వ్యక్తి" అని దాని కర్థము చెప్పినారు. మూలములో స్త్రీ వాచకమని యున్నది. "ఆళ్" శబ్దరూపమే యగు "ఆలు" శబ్దము తెలుఁగున స్త్రీ వాచకముగా నున్నది గాని, తమిళ మున "ఆళ్" అనునది స్త్రీ లింగద్యోతక ప్రత్యయముగా నున్నదేగాని స్త్రీ వాచక పదముగా లేదు. "ఏవంమాల్ శబ్దం స్త్రీ వచనం మాలేతి కల్పయిత్వా" అని "మాల్" అనుదానిని "మాలా" శబ్దముగా గ్రహించి వ్యుత్పత్త్యర్థము

సరిపెట్టుచున్నారనుట, "ఆళ్" అనుపాఠమును గ్రహించినచో పొసఁగనే పొసఁగదు. మఱియు నా యుపోద్ఘాతముననే ఆ కవిరాజు * కుమారిలు "ఆంధ్రద్రావిడ" శబ్దమును తమిళ భాషాపదముగాఁ దెలియరాదనియుఁ దన యభిప్రాయమును వెలుపుచ్చుచున్నాఁడు. దీనినిబట్టి "ఆంధ్రద్రావిడ" శబ్దముతోఁగూడిన పాఠమును గ్రహించియే యీయన వ్రాయుచున్నారనుట స్థిరమగుచున్నది కావున ముద్రితమైన ప్రతి కుపోద్ఘాతము వ్రాయుచు దానిలోని పాఠమును గూర్చియే యీయన ప్రశంసింపకుండుటకుఁ గారణము తెలియదు. ముద్రిత ప్రతిలోని "మాళ్" శబ్దమునుబట్టి చూడఁగా కుమారిలభట్టున కాంద్రావిడ భాషాశబ్దముల యథార్థజ్ఞానమే లేదన్నట్లు తోఁచును కాని, కవిరాజుగారి పాఠాంతర శబ్దములను బట్టి చూడఁగా నామూల పాఠమున నర్థముకాని శబ్దములకు బదులుగా, సందర్భశుద్ధిలేకయే, సులభముగా నర్థమగు ద్రావిడభాషా శబ్దములను నడుమ నెవరో చేర్చినట్లూహింపఁదగియున్నది. కావున నేదో ప్రతిలో నీపాఠాంతరములున్నను వీనినిబట్టి దక్షిణదేశ భాషలకు "ఆంధ్రద్రావిడభాష" యను సంజ్ఞ యొక కాలములో నున్నదని గాని, కుమారిల భట్టీపదము ప్రయోగించెననిగాని వాక్య సందర్భమునుబట్టి యేమాత్రము వాస్తవముగాఁ గనఁబడదు. ఈ యపపాఠములను బట్టి యా కాలమున నార్యులకు దక్షిణ

---

* *Kumarila's reference to Tamil loosely as* 'आन्ध्र-द्राविड' *is a further evidence in favour of general ingnorance of the Aryans about the South.*

దేశమును గూర్చియే విశేషముగా తెలియదని చెప్పుటయు సమంజసముగాఁ గనఁబడదు.

మొత్తముమీఁద తంత్రవార్తికమునఁగల ద్రావిడ భాషలను గూర్చిన యీ వచనమూలముగా మ్లేచ్ఛభాషా పదములనేకములు వైదిక సంస్కృతి భాషలో పూర్వకాలము నుండియుఁ జేరుచు వచ్చెననియు. వానికర్థ నిర్ణయముచేయు పట్ల వైయాకరణులు వాని రూపములను తాఱుమాఱుచేసి వ్యుత్పత్తులను కల్పించుచుండిరనియు, వైదిక ప్రయోగముల కనువ్యవహారమునకును అర్థమునందు భేదముసంభవించినప్పుడు ధర్మప్రయోజనములనుబట్టి వేదమునందలి యర్థమునే ప్రమాణముగా గ్రహింపవలెనను సిద్ధాంతమున్నను మ్లేచ్ఛభాషల నుండి గ్రహింపఁబడిన పదముల విషయమునఁ మాత్రము ఆయాభాషలలోని వ్యవహారమునే ప్రమాణముగా గ్రహింప వలె నను భావము నాఁకాలమునఁ బ్రబలియుండెననియుఁ దెలియుచున్నది. ఇంతేగాక కుమారిలాదులు నాఁకాలమున ద్రావిడ భాషలను మ్లేచ్ఛ భాషలుగాఁ దలంచుటచే వీని నార్యభాషావర్గమునకుఁ జెందినవానిగాఁ గాని, సంస్కృత భవములో, ప్రాకృతజన్యములో యనిగాని తలంచిన ట్లుమాత్రము కనపడదు. తరువాతి కాలమునఁ గొందఱు వైయాకరణులు ఈ దేశమునందలి భాషలన్నియు సంస్కృత భాషాజన్యములే యను అభిప్రాయముకలవారగుట తటస్థించుటచే దక్షిణదేశ భాషల కన్నిటికి మూలమని వారు తలంచిన ''ద్రావిడి'' అనునది గూడ నొక ప్రాకృత భేదమని చెప్పియుందురు. కాని యింతమాత్రముచే వారి

కాడయి. తె–చేయు, త–శెయ్; కన్న – గెయ్; గోండి–కీ. గోండిలో బహువచన ప్రత్యయములు "ఓర్", "క" అని రెండు గలవు. "క" అనునది నపుంసక శబ్దములపై మాత్రము చేర్పఁబడును. తృతీయా ప్రత్యయము (తమిళము నందువలె) "ఆల్". "అది" అనుదాని ప్రథమేతర విభక్తి రూపము తెలుఁగునందువలె "దాని" అని కాక "అదెనా" అనియే కలదు. భవిష్యదర్థక క్రియా రూపమున ధాతువునకు "కా" అనునది చేర్పఁబడుచున్నది. కీ కా= నేను చేయుదును. Cf. త. శెయ్ గు, కన్న.–కెయ్ గు. ఈ విషయములలో నిది ద్రావిడభాషలతో సాజాత్యము కనఁబఱచుచున్నను ఉత్తర హిందూస్థాన భాషల ప్రభావము దీనిపై సోకకపోలేదు. క్రియా విశేషణమునకు బదులు సంబంధార్థక సర్వనామము (హిందీలోని "జో" అనునది) వాడుకలోనికి వచ్చినది. కర్మణ్యర్థక రూపములలోను వ్యతిరేకార్థక రూపములలోను, క్రియారూపముల బాహుళ్యములోను ఇది ఉత్తర హిందూస్థానభాషలను బోలినది. మొత్తముమీఁదఁ జిరకాలమునుండి గలిగిన విజాతీయ భాషా సంసర్గముచే వ్యాకరణ విషయములలోఁ గూడఁ గొంత మార్పు గలిగిన దనవలసి యున్నది.

"కుయి" భాష గోండి భాషకుఁ జాల సన్నిహితము. తుమున్నర్థకము గోండి భాషా రూపముకంటెను తమిళమునకు సన్నిహిత మనవచ్చును. గోండి – ఆయాలే, కన్న–ఆగల్, తమి–ఆగ, కుయి–ఆవ, తె–కా(న్) ఇవి యన్నియు "అల్" శబ్దము చేర్చుటచే నేర్పడినవే. కొన్ని భాషలలో

తుది "ల" కారము లోపించినది. కొన్నిటిలోఁ దుది లకారము 'న్'గా మాఱినది. వ్యతిరేకార్థకము ఈ కుయిలోఁ దక్షిణ ద్రావిడ భాషలలోవలెనే యేర్పడుచున్నది. తె- చేయను; త-శెయ్యేన్, క-గియేను. బహువచన రూపములలో మహత్తులకు "అరు-రు" అనునదియు, అమహత్తులకు 'క' అనునది చేర్పఁబడుచుండును. పుంలింగ శబ్దరూపములు తమిళ రూపములనే పోలియున్నవి. త-అవన్, కన్న.-అవను, కు.-అవాను. ఏకవచనమున స్త్రీలింగ ద్యోతకముగా నపుంసకలింగరూపమునే వాడుటలో కుయి తెలుఁగునకుఁ జేరిక గలదై యున్నది. ఉత్తమ మధ్యమ పురుష సర్వనామమున తృతీయాది విభక్త్యంత రూపములలోను, (నాచేత-నాయందు నీచేత-నీవలన) విభక్తి ప్రత్యయములలోను, అయ్యెడి-అయ్యేటి (కు-ఆటి) మొదలగు క్రియా విశేషణ రూపములలోను కుయి తెలుఁగును బోలియున్నది. వర్తమాన క్రియా విశేషణ రూపములు మొదలగు వానిలో నిది యుత్తర హిందూస్థాన భాషాసంపర్కమును గనఁబఱచుచున్నదనవలయును. బ్రాహుయి భాషాలక్షణము లనేకములు సిథియన్ వర్గమునందలి భాషలకు సన్నిహితములని చెప్పవలసియున్నది. సిథియన్ వర్గమనుదానికి ప్రత్యేక వ్యవస్థ కనఁబడకున్నను ద్రావిడ భాషాలక్షణములే కొన్నిటియందు గనఁబడుచున్నవనుటకు సందేహము లేదు. కాని బ్రాహుయి భాషలో ప్రత్యేక ద్రావిడభాషా లక్షణములునుఁ గొన్ని కనఁబడుచున్నవనుట మనము ముఖ్యముగా గమనింపఁదగినది. మధ్యమ పురుష సర్వనామము ఏకవచన బహువచన రూప

ములు నీ–నుమ్; ఆత్మార్థక సర్వనామరూపము (తాన్); బహువచన ప్రత్యయమగు 'క'; రెండు మూఁడు అను సంఖ్యావాచక శబ్దములు ఇరత్, మునిత్; నిర్దేశార్థక త్రికము దా, ఏ, ఓ, అనునవి, వ్యతిరేకార్థక క్రియలు, ఈ మొదలగు విషయములలో నిది ద్రావిడ భాషలకు సన్నిహిత సంబంధమునే కనఁబఱచుచున్నది. ఇట్టి యనాగరక భాషలు త్తర హిందూస్థాన భాషల నడుమనుండి వాని ప్రభావమునకుఁ గొన్ని విషయములలో లోఁగిపోయియున్నను దూరస్థ భాషలగు తమిళాది ద్రావిడభాషలలోని పెక్కు విషయములతో సన్నిహిత సంబంధము కలవిగాఁ గనఁబడుచుండుటచే ద్రావిడ భాష లొక కాలమున హిందూదేశ మందంతటను వ్యాపించి సంస్కృతాద్యార్య భాషలలోఁ గానరాని కొన్ని విశేష లక్షణములతోఁ గూడినవై యొక ప్రత్యేక కుటుంబముగా నేర్పడి యుండెనని నిశ్చయింపఁ దగియున్నది.

ప్రాచీన ద్రావిడభాష

తమిళము
మళయాళము
తుళు
కొడగు
తోడా
కోట
కన్నడము
కురుఖ్
మాల్తో
గోండు
కూయి
కోలామి, మొ॥
తెలుగు
బ్రాహూయి

# 5

# అఱవము తెలుఁగు వాని ప్రాచీనత

అఱవము, తెలుఁగు-ఈ భాషల ప్రాచీనతను గూర్చి రచియింపఁబడిన యొక విమర్శవ్యాసము ఆంధ్రపత్రిక వృష సంవత్సరాది సంచికలోఁ బ్రకటితమగుట తటస్థించినది. అందు ద్రావిడభాషలలో మిక్కిలి పురాతనమైన భాష యేది? తెనుఁగు అఱవమునుండి పుట్టినదా? అను విషయములు విమర్శింపఁబడినవి. మూల ద్రావిడభాషా స్వరూపము తక్కిన భాషలకంటె అఱవమున నెక్కుడుగాఁ గనఁబడుచున్నదను కాల్డ్వెల్ పండితుని యభిప్రాయముతో శ్రీ లక్ష్మణరావుగా రేకీభవింపక, తద్రచయితలు గ్రియర్సన్ మొదలగువారు చెప్పినట్లుగా అఱవముకంటెను తెనుఁగు మొదలగు నితర ద్రావిడ భాషలలోనే ప్రాచీన భాషాసంప్రదాయము లెక్కువగా నిలిచి యున్నవనియు, కాని గ్రియర్సన్ అట్టి నిదర్శనములను జూపలేదు గావున తామట్టివానిని గొన్ని చూపఁదలచితి మనియుఁ దెలిపియున్నారు. అందుకుగాను కొన్ని సజాతీయ పదములను గ్రహించి, తెనుఁగులో నిలిచియున్న యా పదముల రూపమే తక్కిన యఱవ కన్నడ భాషారూపములకంటె ప్రాచీనమని నిరూపింప యత్నించి యున్నారు. తెనుఁగుభాషలో మూలభాషయొక్క పురాతన స్వరూపమును సూచించు చిహ్నములు - అఱవ కన్నడములను బట్టికూడ గుర్తించుట కవకాశములేనివి-కొన్ని నిలిచియున్నవను మాట వాస్తవమే కాని, యా వ్యాసములోఁ జర్చింపఁబడిన తెలుగుపదముల స్వరూపము తమిళ కన్నడ పదములకంటె మూలభాషా

స్వరూపమునకు సన్నిహితమని, ఆ కారణముచే నవి ప్రాచీనము లని చెప్పుట కవకాశము గలదా యను విషయము మాత్రము పునఃపరిశీలనార్హ్యమని తోచుచున్నది.

దక్షిణ దేశమున వ్యవహారములో నున్న భాషల న్నియు నొక కుటుంబమునకుఁ జెందిన వనియు, ఆ కుటుంబము ద్రావిడభాషా కుటుంబ మను పేర బరగుచున్నదనియు, తెనుఁగు, అఱవము, కన్నడము మొదలగు భాష లొక్క కుటుంబమునకుఁ జెందిన సోదర భాషలని చెప్పఁబడినపుడు వానిలో నేది పురాతనము? దేనినుండి యేది పుట్టినది' యను ప్రశ్నలకు తావు సందర్భము లేదనియు, మూలభాషా స్వరూపమునే తత్తద్దేశ కాలానుగతములగు మార్పులతో నాయా భాషలు వహించియుండుననియు నీ మొదలగు విషయములను శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగా రందు చక్కఁగ వ్యక్తీకరించియున్నారు.

అఱవము, తెనుఁగు నొక్క కుటుంబమునకుఁ జెందిన సోదర భాషలు. వీనికి జన్యజనక భావసంబంధము లేదు. కాని తెనుఁగుభాష పుట్టు పూర్వోత్తరములను గూర్చి తెలిసికొనఁదలచినపుడు మాత్రము అఱవభాష యొక్క సాహాయ్య మత్యావశ్యకముగాఁ గనఁబడును. ఒక్క అఱవము తోడనే కాక తక్కిన దక్షిణ దేశభాషలతోఁ గూడ పోల్చి పరిశీలించినగాని తెనుఁగుభాషయొక్క ప్రాచీన చరిత్రలు దెలిసికొన సాధ్యముకాదు. ఈ విషయ మిటీవలనే దక్షిణదేశ భాషా తారతమ్య పరిశీలనకుఁ గడఁగిన కాల్డ్వెల్

పండితుఁడు మొదలగువారి పరిశ్రమల మూలముగాఁ గనిపట్టఁబడినది.

ఈ దక్షిణ దేశభాషలను ద్రావిడభాషా కుటుంబమని వాడుచుందురు. ఒక మూలభాషనుండి యేర్పడినవై కాల క్రమమునఁ గలిగిన మార్పుల మూలముగా భిన్నములు, స్వతంత్రములు నైన భాషలనే, వానికిఁ గల సజాతీయత్వ మునుబట్టి, యొక భాషా కుటుంబముగా భాషా తత్త్వ వేత్తలు పరిగణింతురు. ఇవి యన్నియు నొక కుటుంబము నకుఁ జెందినవని చెప్పఁబడినప్పుడు ఇవి యన్నియు నొక మూలభాషనుండి కాలక్రమమున బయలుదేరిన సోదరభాష లని తలఁపవలయునే కాని, వీనిలో నెద్దానినుండి యేది పుట్టి నదను ప్రశ్న కవకాశమే లేదు. కాని వీనిలో నొక్కొక్క దానినుండి ప్రాంతీయ భాషలు బయలుదేరి యవి మరల స్వతంత్రములైనపుడు ఆయా భాషలలో శాఖ లేర్పడుననుట కవకాశము లేకపోలేదు. ఒక మూలభాషనుండి యేర్పడిన సజాతీయ భాషలని చెప్పఁబడుచున్న అఱవము, కన్నడము, తెలుఁగు మొదలగువాని విషయములోమాత్ర మొకదాని నుండి మఱియొకటి పుట్టినదనికాని, ఒకటి పురాతనము, ఒకటి యర్వాచీనము అనికాని తలచుట కవకాశ ముండదు. కాని యీ ప్రశ్న తఱచుగా బయలుదేరుచునే యున్నది. అందు కొక కారణము ఎవరి భాషయందు వారికిఁగల యభి మానాతిశయము కావచ్చును. అది పాటింపదగినది కాదు గదా! ఒక భాషయందు లభించిన వాఙ్మయ మితర భాష లలోదానికంటె ప్రాచీనమై యగపడుచుండుటవలనఁ గూడ

నట్టి భావ మేర్పడవచ్చును. తెనుఁగు కన్నడములం దిప్ప టికి లభించిన వాఙ్మయముకంటె మిగుల ప్రాచీనమగు వాఙ్మ యము తమిళభాషలో గల దనుటకుఁ దగిన కారణము లగ పడుచున్నవి. కాని యొక భాషలో నితర సోదర భాషలందు కంటె ప్రాచీన మనదగిన వాఙ్మయము లభించినంత మాత్ర మున దానినుండి యితరములు పుట్టినవని నిరూపింప సాధ్య ముకాదు. ఇతర భాషలలోని వాఙ్మయ మేకారణములచే నంతరించినదో, వృద్ధినొందనేలేదో యను విషయములను చారిత్రక దృష్టితోఁ బరిశీలింపవలసి యుండును. తమిళ భాషలో ప్రాచీన వాఙ్మయ ముండుటయేకాక భాషా రూపములలోఁగూడ ననేకము లితర భాషారూపములకంటెఁ బ్రాచీనములుగఁ గనబడుటచేతనో, ఆభాషతో నితర దక్షిణ దేశభాషలతోడి పరిచయముకంటె నెక్కుడు పరిచయము కలుగుటచేతనో కాల్డ్వెల్ పండితుఁడు అఱవభాష యితర భాషలకంటె మూల ద్రావిడభాషకు సన్నిహితమై యుండు ననియు, మూలభాషా స్వరూపము ఈ భాషలో నెక్కుడు కనఁబడుచున్న దనియుఁ జెప్పినమాట వాస్తవమే. అది వాస్తవము కాదనియు, తెలుగు మొదలగు నితర ద్రావిడ భాషలలో నఱవమునందుకంటె నెక్కుడు పురాతనములైన విశేషరూపములు కనఁబడుచున్నవి గావున నఱవము కూడ నితర భాషలవలెనే యొక సోదర భాషయే కాని, దీనికంటె ప్రాచీనమని చెప్పుట కవకాశ మేమియు లేదనియు గ్రియ ర్సన్ పండితుఁడు మొదలగువారు చెప్పియున్నారు. విచా రింపఁగా నీ యిద్దరు పాశ్చాత్య పండితుల యభిప్రాయముల

వేత్తలు కొందరు ఈ మధ్యపరగణాలలోని యాటవిక జాతులు వ్యవహరించు గోండు మొదలగు ద్రావిడభాషలే ద్రావిడ భాషాతత్వ పరిశోధనము విషయమున తమిళభాష కంటెను గూడ నెక్కువగా తోడ్పడగల వనియు, నా కారణముచే నీ పరిశోధనము దక్షిణపు కొననున్న తమిళభాషతో ప్రారంభించుటకన్న మధ్యదేశమందలి యా యాటవికుల భాషల పరిశీలనముతోనే ప్రారంభించుట మిక్కిలి ప్రయోజనకారి కాగలదనియు చెప్పఁదొడగిరి.* ఈ పరిశోధనము విషయమున సంస్కారము గలిగిన తమిళాది భాషలకు గల ప్రాధాన్యమును సంస్కార హీనములగు గోండు మొదలగు వానికిని ఇవ్వవలసియుండునని చెప్పుట న్యాయమేమోకాని, తమిళాది

---

* *"If we want to understand the history of the languages of the South, we should begin from the Northern side"—E. Tuttle*

*"The Dravidian language which has almost always been chosen for comparison is Tamil, which, in fact is best known of all the dialects for various reasons. Even if we admit that from the Vedic up to the present time, Tamil has changed very little, there still remains the fact that the domain of this Dravidian dialect is the further most off from the region of Vedic civilization. On this principle alone, it should have been the last one to be taken into consideration for the sake of comparative study. If we want to understand the history of the languages of the South we should begin from the Northern side."*

*(Pre-Aryan & Pre-Dravidian)*

భాషలకు గల ప్రాధాన్యమును తగ్గింపఁ జూచుట సాహస మనక తప్పదు. ఒక భాషలో నెంత ప్రాచీనమగు వాఙ్మయము లభించిన నంత ప్రాచీన కాలమువరకు నా భాష యొక్క స్వరూప పరిణామము నన్వేషించుటకు సులభావకాశము దొరకును గదా! వాఙ్మయ శూన్యములగు భాషలలో గొన్ని యతి ప్రాచీన లక్షణములు నిలిచియున్నను, వాని ప్రాచీనత యిట్టిదని నిర్ణయించుటకు దగిన యాధారముండదు కావున నితర విధముల జేసికొనిన నిర్ణయముల సరి చూచుకొనుటకుమాత్రమే యుపయోగించును. అవి సంస్కార హీనములగు భాష లగుటచే నా భాషా రూపములు తొందర తొందరగా పెక్కు మార్పులకు లోనగుచుండుటయుఁ దటస్థింపవచ్చును.

పైని జెప్పిన జూలిస్ బ్లాక్, టటిల్ పండితుల యభిప్రాయము దక్షిణ దేశీయములగు ద్రావిడభాషలకు ఉత్తర దేశీయములగు నార్యభాషలపై గల ప్రభావ మెట్టిది యను విషయమును గూర్చి చర్చించునపుడు తెలుపబడిన దేయైనను ద్రావిడభాషా విశేషలక్షణములను దెలిసికొనఁదలచినప్పుడు తమిళభాషయొక్క ప్రాముఖ్యమును తగ్గించుటకే విధమగు నవకాశమును లేదనియే చెప్పవలసియున్నది. ప్రాచీన ద్రావిడ భాషాలక్షణములు దానినుండిబయలు దేరినభాషలన్నిటిలోను గనబడుచుండుననుట సహజమేయైనను, తమిళ భాషకు దక్కిన వానికంటె ప్రాచీన కాలముననే సంస్కారమేర్పడుట చేతను, అందు వాఙ్మయము బయలు దేరుట చేతను, అవి మనకిప్పుడు లభ్యములై యుండుట చేతను వానినిబట్టి తక్కినభాషలలో

గూడిన పదము లనేకము లున్నవి. కాని యా భాషలలో నవి యుచ్చారణ సౌకర్యార్థమై ఆ భాషను వ్యవహరించు జనులచే, నా సంయుక్తాక్షరములు విడదీయఁబడి పలికినట్లుగాని, ఆ భాషలో నట్టి శబ్దములకు ద్వైరూప్యము కలిగినట్లుగాని కనఁబడదు. కాని ఆ పదములు ద్రావిడ భాషలను వ్యవహరించు జనులచే నుచ్చరింపఁబడినప్పుడు అందలిసంయుక్తాక్షరములు తరచుగా విడదీయఁబడియేపలుకబడుచున్నవి. ఒకవేళ విడదీయఁబడి నడుమ అచ్చు చేర్పఁబడనిచో నా సంయుక్తాక్షరములోని యొక వర్ణము రెండవదానితో సావర్ణ్యమును బొంది, అది ద్విత్వాక్షరముగా నేర్పడుచున్నది. తమిళాంధ్ర కర్ణాటకాది భాషలలో నే నిఘంటువును తెఱచిచూచినను పెక్కుపదము లిట్టివి మనకు వెంటనే గోచరింపగలవు.

| | | |
|---|---|---|
| సం. శ్రీ. | తె. సిరి. | త. తిరు. |
| అగ్ని | తె. అగ్గి | అగిని |
| ఉద్యోగ | | ఉత్తియోగం |
| యుక్తి | జుత్తి | ఉత్తి |
| ఋక్ష | రిక్క | |
| బ్రాహ్మణ | బాపడు | పిరమిన |
| శుక్ర | చుక్క | |
| ఇంగ్లీ. *Hospital* | ఆసుపత్తిరి. | |

సంస్కృతాది భాషాశబ్దము లీ ద్రావిడ భాషలలోఁ బొందిన మార్పులను బట్టి చూడగా నందలి భిన్నాక్షర

సంయోగము నుచ్చరించుట కలవాటుపడని వా రాపదముల నుచ్చరింపవలసి వచ్చినపుడు స్వోచ్చారణ సంప్రదాయముల కనుగుణముగాఁ జేసికొన యత్నించియుండుటచే నక్లేర్పడి యుండునేగాని కేవల ముచ్చారణ సౌలభ్యము కొరకు మాత్రమే యేర్పడినట్లగపడదు. ఏలయనఁగా సంయుక్తాక్షరములతోఁగూడిన సంస్కృతశబ్దములు తద్భవములై దక్షిణదేశభాషలలో నెద్దానఁ బ్రవేశించినను ఒక్కరీతినే యాయక్షరముల సంయుక్తత్వము విశ్లేషతను బొందుచున్నది. తెనుఁగున తత్సమరూపమునఁ బ్రవేశించినవానిలో మార్పు లేకున్నను, తద్భవరూపము లన్నిటిలోను తమిళమునందువలెనే సంయుక్తవర్ణత్వము సహింపఁబడుట లేదు. దీనిని బట్టి పదములందు సంయుక్తవర్ణాసహిష్ణుత్వము ద్రావిడభాషా ముఖ్యలక్షణములలో నొకటిగా గ్రహింపవలసియున్నది. పదముల యందు అనునాసికలతో తప్ప నితరవర్ణములకు సంయుక్తత్వము సహింపకుండుట, మహాప్రాణములను వ్యవహరింపలేకుండుట, రెండు మూడు పదములకు మించిన దీర్ఘ సమాసములు లేకుండుట మొదలగునవి యీ భాషలకు సహజ లక్షణములు. ఇట్టి యుచ్చారణ సంప్రదాయముల కలవాటుపడిన వారు గనుకనే తొలుత సంస్కృతభాషతో వీరికి సంసర్గము గలిగి యా పదములను వీరు వ్యవహరింపవలసివచ్చినపుడు అందలి సంయుక్తాక్షరములను విడదీసి పలికియు, మహాప్రాణముల నల్పప్రాణములను జేసియు నాయాపదములను తమ భాషలోనికిఁ దెచ్చుకొనిరి. ఇది ఈ భాషలకు సహజసంప్ర

దాయస్థితి పుట్టుటచేతనే కాని కేవల తాత్కాలిక సాక్ష్యము మాత్రమే కారణముగా జరిగిన పని కాదు. అట్లయినచో సంస్కృతమును వ్యవహరించువారిలోఁగూడ నిట్టిమార్పు గలిగి సంస్కృతమునకుఁ గూడ రూపాంతరములతో ద్వైరూప్యము సిద్ధించియుండునుగదా.

ఇక సంస్కృతజన్యము లనఁబడిన ప్రాకృతములలో నట్టిమార్పు కలిగినదా యను ప్రశ్న కలదు. ప్రాకృతభాషలలో నట్టిమార్పు కలుగుటకుఁ బ్రధానకారణము సంస్కృతభాషను ప్రాచీనకాలమున నవలంబించి వ్యవహరింపవలసిన యార్యజనపదములందలి క్రిందితరగతివారు నానావిధ ప్రాకృతజనులలో నిప్పటి ద్రావిడులవలె ద్రావిడభాషాసంప్రదాయముల కలవడినవారై విశేషముగా నుండి యుండుటయే యని చెప్పవలసియున్నది. హిందూదేశపు వాయవ్యదిగ్భాగమున నిలిచియున్న బ్రాహూయీ భాషను బట్టియు, మధ్యపరగణాలలో నిప్పటికిని వ్యవహరింపఁబడుచున్న గోండు, కోయ, రాజమహాల్ మొదలగు భాషలను బట్టియు, నింక ననేక కారణములనుబట్టియు నొకకాలమున నుత్తర హిందూదేశమునఁగూడ ద్రావిడభాషలను వ్యవహరించు జనులు నివసించియుండిరని యూహింపక తప్పదు. ఈ ద్రావిడభాషాసంప్రదాయముల కలవడిన యుత్తరహిందూస్థానమునందలి ప్రాకృతజనుల మూలముననే-అనఁగా వీరు దేశమున వ్యాప్తిలోనున్న యార్యభాషను స్వీయోచ్చారణ సంప్రదాయానుసారముగా వ్యవహరించుటచేతనే హిందూ

దేశమునందలి ప్రాచీనార్యుల వైదికభాష కాలక్రమమున ప్రాకృతభాషగా మారిపోయియుండును. కావుననే దక్షిణ దేశమున నెలవుకొనిన ద్రావిడభాషల సంప్రదాయములు కొన్ని యుత్తరహిందూస్థానమునందలి ప్రాకృతభాషలలోను విశేషముగాఁ దత్ప్రాకృతభవములగు నాధునికార్యభాషల లోను గానవచ్చుచుండుట. అట్టి లక్షణములలో సంయుక్తాక్షరములను విడదీసికాని, లేదా సావర్ణ్యమును బొందించికాని పలుకుటయనున దొకటి. కావుననే యీలక్షణము దక్షిణము నందలి ద్రావిడభాషలకును, ఉత్తరదేశమునందలి ప్రాకృతాద్యార్యభాషలకును సమానమై యుండుట తటస్థించినది.

ఇదియే ద్రావిడభాషలకు సహజ లక్షణమైనచో తెలుఁగు కన్నడ మలయాళములలో ననేక పదములలో సంయుక్తవర్ణములు కనఁబడుచున్నవే యను ప్రశ్న కలుగును. దీనికి ప్రధానకారణ మాభాషలపై సంస్కృతభాషకుఁగలిగిన ప్రబలప్రభావమే. అదియైనను సంస్కృతసమశబ్దములలోఁ గానచ్చునేకాని దేశ్యశబ్దములలో విశేషముగఁ గానరాదు. సంస్కృతసమ మీభాషలలోఁగలిసినట్లుగాఁ దమిళభాషలోఁ గలిసియుండలేదు. ద్రావిడభాషా సంప్రదాయానుసారముగా వర్ణసంస్కారమును బొందని సంస్కృత శబ్దమునకు తమిళ భాషలోఁ బ్రవేశమే లేకపోయినది. కావుననే యాభాషలో తక్కిన తెలుఁగు కన్నడములందువలె ననునాసికాదులతో తప్పభిన్నవర్ణసంయోగముతోఁగూడినశబ్దము లేకనఁబడవు.

ఇట్టిది ద్రావిడభాషా సహజమగు సంప్రదాయమే యయినట్లయినచో, తెలుఁగునమాత్రము అందులో పదాదిని

సంయుక్తవర్ణముతోఁ గూడిన యిన్ని పదము లెట్లువచ్చిన వన్న ప్రశ్న నిలిచియున్నది. దీనిని గురించి మఱియొక విశేషము గమనింపఁదగియున్నది. తెనుఁగున పదాదిని సంయుక్తాక్షరము గల పదములలో ననేకములు—బహుశః సర్వమును గూడ-రేఫసంయోగముతోఁ గూడినవే కాని మఱియొకటి కావు. ద్రావిడభాషా సంప్రదాయమునుబట్టి పదమధ్యమున నైన ద్విత్వరూపాక్షరసంయోగ మొప్పునుగాని పదాదినదియు రాఁగూడదు; రాదు. అట్టి సందర్భములో తెనుఁగుననైనను పదాదియందు రేఫసంయోగము వచ్చుట వింతగా కనఁబడకమానదు. ఇట్టిపదము లితర ద్రావిడభాషలలో నెచ్చటను గానరావు గదా! కావున నాంధ్రమున నిదియొక వికృత లక్షణ మనక తప్పదు. ఇది సంస్కృతభాషా సంసర్గబలముచే వచ్చినదై యుండిన నుండవచ్చును. ఈ భాషలో ప్రత్యేకముగ వెలసినదని చెప్పినను చెప్పవచ్చును. ఇది యితర ద్రావిడభాషలలో నెచ్చటను గానరాకుండుటచేతను, విదేశీయ భాషలనుండి సంగ్రహించిన,సంగ్రహింపఁబడుచున్న పదములలో నిప్పటికి నీ భాషలన్నిటిలోఁగూడ నట్టి సంయుక్తత్వము తొలగింపబడుచునే యుండుటచేతను ఇది తెనుఁగునకు మాత్రమే యొక కాలమున గలిగిన విశేషలక్షణమనియు, సామాన్య ద్రావిడభాషా సంప్రదాయసిద్ధము కాదనియు చెప్పవలసివచ్చుచున్నది.

తెలుఁగులోని యీ విశేషరూపములు 'వర్ణప్లుతి' యను స్వరసూత్రము ననుసరించి యేర్పడినవై యున్నవి. దీనినే *Metathesis* అని శబ్దతత్త్వశాస్త్రవేత్తలు చెప్పెదరు.

వర్ణప్లుతి యనగా నొక పదమునందలి సమీపాక్షరములలోని యొకవర్ణము తన స్థానమునుండి యెగిరిపోయి ప్రక్క వర్ణముపై నిలుచుట. 'విరల్' శబ్దములోని రేఫము తనకు సన్నిహితమునందున్న వి' అనువానిలోని ఇకార వ్యవధానమును తప్పించుకొని వకారముపై నెగిరిపడగా వ్ + ఇ + ర్ + అ + ల్ > వ్ + ర్ + ఇ + అ + ల్ = వ్రిఅల్-వ్రేల్-వ్రేలు అని వకార రేఫసంయోగము ప్రాప్తించి తరువాతనున్న ఇకార అకార సంయోగముచే ఏత్వసిద్ధిగలిగి వ్రేల్ > వ్రేలు రూపము సిద్ధించుచున్నది. ఇది యథాస్థితియొక్క వర్ణనముమాత్రమే. భాషలోనిట్టిమార్పు లనేకస్థలములఁ గలుగుటను జూచి, అది యాభాష కొక ప్రత్యేక లక్షణముగా గ్రహించి, యిట్టివి యితర భాషలలో నెచ్చటనైన నున్నచో వానికిఁగల కారణముల నారసి భాషాతత్త్వవేత్తలు కొన్ని సామాన్యస్వరసూత్రముల (*General phonetic laws*) నేర్పాటు చేయుదురు. ఈ వర్ణప్లుతి యనునదియు నట్టివానిలో నొకటి. ఇట్టిది గలుగుటకు మూలకారణ మేమి యని విచారించినచో నొక పదములోని వర్ణముల నుచ్చరించుటలో గలుగు త్వరయే యయియుండును. ఆ త్వరితోచ్చారణమును బట్టి వర్ణములు తారుమారగుచుండును. ఇట్లొక రేఫమే కాక ఒక పదమందలి యక్షరములే మాఱుచుండుటయు గలదు. అప్పుడా పదములకు ఒక్క భాషలోనే ద్వైరూప్యమును సిద్ధించును. చూడుడు :

అరల్-అలర్-అలరు = పుష్పము. cf. క. అరళ్- *to expand, to open.*

గులివి_గుబిలి

ఎలర్-ఎరళ్ cf. తె. తెమ్మెరలు. కన్న. తెంబెలర్.

అగప-అబక

చమురు-చరుము

పాడగము-పాగడము

పిచ్చిలు-చిప్పిలుఁ cf. తమి. పిచిర్-*to drizzle*

దబ్బ-బద్ద cf. త. తప్పై=*Split bamboo*

కుతకుత-తుకతుక

పొక్కిలి-క. పొక్కుళ్ ; త. కొప్పుళ్

పిగులు-క. పిళిగు, cf. త పిళ = *to be rent*

సం. ఆత్మ శబ్దమునుండి (ఆత్ప మూలముగా) అప్తశబ్ద మేర్పడుటకు గారణ మా వర్ణప్లుతియే యని పిషెల్ పండితుని యభిప్రాయము. 'వారాణసీ' శబ్దమునుండి వర్ణప్లుతిచేత 'వాణారసి' యను రూపము గలుగుటచేతనే ఇంగ్లీషులో 'బెనారస్' (*Benares*) అను శబ్దమేర్పడినది. ఇట్టి వనేకములు కలవు.

దీనినిబట్టి యుచ్చారణమందలి త్వరనుబట్టి పలుకు నప్పుడొక పదమునందలి వర్ణములు తడబడుచుండును, లేదా తారుమారగుచుండును అని తెలియుచున్నదిగదా. ఈ కారణముచేతనే తెలుఁగుభాష మూలద్రావిడభాషనుండి విడివడి ప్రత్యేకభాషగా నేర్పడిన పిదప నెప్పుడో కొంతకాలమునకు ద్వితీయాక్షరము రేఫగా గలిగిన మూలభాషాపదముల

యుచ్చారణమున గొంతమార్పు గలిగి యందలి రేఫము తొలి వర్ణముమీఁదికి దూకివచ్చి దానితోఁ గలియుటచేఁ బదాదియందు రేఫసంయుక్త వర్ణములు గలుగుట తటస్థించినది. పదాదియందలి రేఫసంయుక్త వర్ణముతోఁ గూడిన రూపమే ప్రాచీనము. ఉచ్చారణ సౌకర్యమునకై నడుమ నచ్చు చేరుటచేతనే తక్కినరూపము లేర్పడిన వనరాదా యన్నచో, పదాదియందు సంయుక్తాక్షరము గలుగుట యీ భాషలకు సహజలక్షణము కాదనియు, పదాదియందే కాక పదమధ్యమందైనను ద్విత్వాక్షరములు తక్క స్పర్శవర్ణములకు పరస్పర సంయోగము పొసగదనియు నిదివరకే సూచింపఁబడినది గదా! ఇదియే సహజ లక్షణమని చెప్పఁగలుగుట యెట్లన్నచో నీ భాషలలోని పదజాలముయొక్క వైఖరిని పరిశీలింపుఁడనియే చెప్పవలసియుండును. ఇతర ద్రావిడభాషలలోనే కాదు. తెనుఁగునందలి కోశములను బరీక్షించినను దేశ్యపదములలో నీ రేఫసంయోగముతక్క సంయుక్తాక్షరమాదియందుగల శబ్దము లేమియు గానరావు. ఇంతేకాక సజాతీయములగు భాషలన్నిటిలో నీ శబ్దములు సంయుక్త వర్ణ రహితములై కనఁబడుచుండగా నొక్క తెనుఁగుననే యిట్లుండుటనుబట్టి యిది యీ భాషకు విలక్షణమని తలపవలసినదే కాని యొక్క భాషలోమాత్రమే కనఁబడు విశేషలక్షణమును సజాతీయభాషల కన్నిటికి సహజలక్షణమని కాని యది దాని ప్రాచీనతకు చిహ్నమని కాని గ్రహించుటయెంత మాత్రమును యుక్తముకాదు, ఈ భాషలలోని శబ్దములు సామాన్యముగా రెండు మూఁడక్షరములకు మించినవిగా

రము రేఫగానున్న ప్రాచీన పదములలో గలిగిన రేఫప్లుతి వలన నేర్పడిన యర్వాచీన రూపము లనుటకు సందేహము లేదు. ఇది తెలుఁగుననే విశేషముగాఁ గానవచ్చుటచే నిది దీని కొక విశేషలక్షణ మనవలసి వచ్చినది. ఇదియొక కాలమున భాషలో బయలుదేరినను ఇది సామాన్యముగా ద్రావిడ భాషా సంప్రదాయమునకు విరుద్ధమగుటచేతనే కాఁబోలు నిటీవల నిది యీ భాషలోకూడ నిలువక మరల మార్పు నొందుట తటస్థించినది. కావుననే పదాది రేఫసంయోగ మీ భాషలో నిటీవలి కాలమున నంతరించినది. అనఁగా మరం-మ్రాన్రై, మరల మ్రానైనది. విరల్-వ్రేలై, మరల వేలైనది. ఇట్లే భాషలోని పదాద్యక్షరములోని రేఫము లోపించుటచే నా పదము లన్నిటికిని ద్వైరూప్య మిప్పుడు సిద్ధించినది. పదాదియందు సంయుక్తాక్షరము నిలుచుట యీ ద్రావిడభాషా సంప్రదాయ మేమాత్రమును కాదని చెప్పఁదగియుండుటచేతను-అందుకు నిదర్శనముగా నే యితర భాషలోకాని, యీ తెలుఁగులోనే కాని మఱి యే పదములోని ఆదిని సంయుక్తాక్షరము కనఁబడక పోవుటచేతను కొన్ని తెనుఁగుపదముల మొదట చేరిన యీ రేఫసంయోగము మధ్యకాలమున నెప్పుడో వచ్చి, సహజ సంప్రదాయ సిద్ధము కాకపోవుటచే మరల నంతరించినదని తలపవలసిన దేకాని యది యీ తెనుఁగుపదముల పురాతనత్వమునకు చిహ్నముగా గ్రహింపఁగూడదు. ఆ పదముల పరిణామక్రమము నించుక పరిశీలింతము :

| త. | మ. | క. | తు. | తె. | ధాతువు. |
|---|---|---|---|---|---|
| మరమ్ | మరమ్ | మర | | (మ్రాను మాను | మర్ |
| విరల్ | విరల్ | బెరల్ | బెరల్ | (వ్రేలు వేలు | విరు = *to expand* |
| పొటుదు | పొట్ దు | పొట్టు | | (ప్రొద్దు పొద్దు | పొట్ = *to shine, shoot* |
| తిరుప్పు | తిరుప్పు | తిరుపు | | (త్రిప్పు తిప్పు | తిర్ = *to turn* |
| పరుత్తి | పరుత్తి | పత్తి | | (ప్రత్తి పత్తి | పర = *to spread* |
| పొటిల్ | | పొటిల్ | | (ప్రోలు ప్రోలు-వోలు | — |
| పరమ్బు }<br>పమ్బు } | పడరు | పబ్బ }<br>పర్బు } | | (ప్రమ్మ }<br>పంబు }<br>పర్వు } పంబు | పరె = *to spread, extend*<br>*etc.* |
| ముటంగు | ముటఙ్గు | మొటగు | | (మ్రోగు }<br>(మ్రోయు }<br>మొరయు }<br>మొరగు } మోగు | ముట |
| కురుడర్ | కుఱ్ఱడర్ | కుఱ్ఱడ | కురుడ | (గుడ్డి గుడ్డి | — |

| | | | | | |
|---|---|---|---|---|---|
| కురుంగు | | కుఱ్ఱు<br>కుగుఱ్<br>కుగ్గు<br>కుంగు | క్రుంగు | కుంగు | కురు = *to bend, shrink* |
| కొలు<br>కొలుప్పు | కొలు<br>కొలుప్పు | కొబుఱ్<br>కొవుఱ్<br>కొబ్బు | క్రొవ్వు<br>కొవ్వు | కొవ్వు | కొలు = *to grow fat* |
| | కఱుగఱు | కర = *on imitative word for some harsh grating sound* | క్రంగు | | (ధ్వని విశేషము) |
| కరై | కరకు- | కరంగు, కరగు = *to be dissolved, to melt* | క్రాఁగు = కాఁగు తపనము | | కర = *to melt* |
| తరువు | | తరువు = *grating, scraping* | త్రుప్పు | తుప్పు | తురు = *to grate, scrape* |

వికృతి యెప్పుడును శబ్దోచ్చారణమును సులభము చేయునేకాని కఠినపఱచదను సిద్ధాంతము చాలవరకు సంశయ జనకమైనదే. ఆ సిద్ధాంతమునుబట్టి 'ప్రాన్' నుండి 'మరిమ్' 'ప్రేల్' నుండి 'విరల్' పుట్టిన వచులు యుక్తియుక్తములుగనే కనఁబడునుగాని. వాస్తవ స్థితి తెలిసికొనుట కొకప్పు డింకను లోఁతుగాఁ బరిశీలింపవలసి వచ్చుచుండును. అనఁగా నాయాపదములయొక్క పూర్వచరిత్రను. వాని నిర్మాణక్రమము, మూలధాతు స్వరూపము మొదలగు వానిఁ గ్రహించి తత్పరిణామక్రమము నన్వేషించినఁగాని యిదమిత్థమని నిర్ణయింప వీలుండదు. వీనికిఁ దోడుగా నాయాభాషల సహజ లక్షణములను గూడ గమనించి పరిశీలింపవలసి యుండును. పదాదియందు సంయుక్తాక్షరము పలుకుట ఈ భాషలలో స్వభావ విరుద్ధము, కష్టతరమునైనను పొఱుదు, పుఱోలు, ముంటుగు, కొఱుప్పు మొదలగు శబ్దములు ద్రుతతరోచ్చారణముతో వ్యవహరింపఁబడినప్పుడు ఆద్యక్షర నడిమి యచ్చు లోపించుట, లేక వర్ణములు తాఱుమాఱగుట మొదలగు మార్పులు జరుగుటచే ప్రొద్దు, ప్రోలు, మ్రోగు, క్రొవ్వు మొదలగు రూపము లేర్పడినవి. అట్లేర్పడినప్పుడు పదాది సంయుక్త వర్ణోచ్చారణమందలి కాఠిన్యము పాటింపఁబడెను. కాని యీ భాషను వ్యవహరించువారి కది పరిపాటిలోనిది కాకపోవుటచేతనే కాఁబోలు కాలక్రమమున రేఫము మరల జారవిడువఁబడుట తటస్థించినది.

మఱియొక విశేషము: పై శబ్దములందుఁ గొన్నిటిలో ద్రావిడభాషలలో వింతయక్కర మనఁబడు 'ఱ' కారమొకటి

కనఁబడుచున్నది. ఇది తమిళ కన్నడ మలయాళములలో ప్రధానముగ మూలధాతువులందుఁ గానవచ్చుచున్నది. ప్రాచీనభాషలో నీ 'కారము రెండవ యక్షరముగా గూడిన శబ్దములలో నిది రేఫముగమారి వర్ణవ్యత్యయముచే పదాదిసంయోగమునకుఁ గారణమైనది. ప్రేగు. ప్రోలు ప్రోగు. క్రొవ్వు మొదలగు తెలుఁగు శబ్దములు మూల ద్రావిడభాషారూపము లైనచో, నందలి తొలి సంయుక్తాక్షరము విడఁదీయఁబడి నఱుకు పేరుగు, పొరోలు, మురగు - మొరగు. కొరవు మొదలగు రూపము నేర్పడునేకాని యీనిలోని రకారస్థానమున నెన్నఁడైన నిదువాని కాలమున 'ఱ' కారము వచ్చెననుట సమంజసము కాదు. ఒకటి - తెలుఁగులో తక్కిన ద్రావిడ భాషలలో-ముఖ్యముగా తమిళ కన్నడ మలయాళములలో పాటు. పుట్టలు, మాట, కోటి మొదలగునవి మూలరూపములుగాఁ గనఁబడుచున్నవి వీనికైనను. అను మొదలగు ప్రత్యయములను, పదములను చేర్చినగాని పై రూపము లేర్పడుట లేదు. ఈ కారణములచే తమిళ కన్నడరూపముల కంటె తెనుఁగు రూపములు ప్రాచీనములనికాని, మూల భాషకు సన్నిహితములనికాని చెప్పుటకు వీలులేదు ప్రాకృత భాషలలోని యీ సంప్రదాయములు సంస్కృతమునుండి వచ్చినవికావు, ద్రావిడభాషాసంసర్గముచే వచ్చినవియే కావున నీ విచారణలో వాని సామ్యము ప్రయోజనకారి కాదు.

ప్రాయిల్లు, క్రీగాలు మొదలగు సమాస పదములలో గూడ ప్రా, క్రీ రూపములు ప్రాచీనము లనుటకు వీలులేదు. వీని తమిళ కన్నడ రూపములు పట, కీళ్ (పఱయిల్

కీఱ్ క్కాల్) అనునవి ద్రావిడ వింతయక్కరమగు 'ఱ' కారముతోఁ గూడియున్నవి. ఈ 'ఱ' కారము సామాన్యముగా 'డ' కారముగా తెలుఁగులో మాఱుచున్నది. పఱం = పండు, కీఱ్ = కేడు. ఈ దృష్టిచేతనే వెనుక వచ్చిన పట్టికలో 'కొఱుప్పు' అను దానిని 'కొడుప్పు' అనియు. 'పొఱుసు' అను దానిని 'పొడుసు' అనియు శ్రీ లక్ష్మణరావుగారు వ్రాసియుందురు. ప్రొద్దుపొడిచిన దన్నప్పుడు, 'పొడుచు' లోని పకారమునకును 'పొఱుదు' లోని. లేదా 'పొఱు'లోని 'ఱు' కారమునకు సంబంధించినదే 'అప్పాసు' లోని 'ఱు' వర్ణముకూడ 'అ + పొఱుదు' = 'ఆప్పొఱుదు' లోని 'ఱ' కారమునకు సంబంధించినదే. కొన్ని శబ్దములలోని 'ఱ' కారము తరువాతి కాలమున రేఫముగ గూడ మాఱియున్నను రేఫము 'డ' కారముగ మాఱినదని చెప్పుటకు తెనుఁగుభాష లోని యీ రూపములు తక్క తక్కిన భాషలనుండి నిదర్శనము లగపడవు. కొన్ని సంస్కృత శబ్దములు కన్నడమున జేరినప్పుడా శబ్దములలోని ట, స, త, ర కారములకు బదులుగా కన్నడమున 'ఱ' కారము వచ్చినట్లు (అట్లు వచ్చినదని కేశిరాజు శబ్దమణిదర్పణమునఁ జెప్పియున్నాఁడు) తెలుఁగునందలి యీ పదాద్యక్షరమందలి రేఫము తమిళ కన్నడములలో 'ఱ' కారముగా మాఱియుండఁగూడదాయను వాదము యుక్తియుక్తముగాఁ గనఁబడినను సమంజసము కాదు. దేశ్యశబ్దములలోను, అందును పెక్కు భాషలలోను 'ఱ' కారముతోఁ గూడిన శబ్దము కనఁబడినప్పుడదియే దాని ప్రాచీనరూపముగాఁ గ్రహించుట న్యాయముగాని, యొక

భాషలో గొన్నిరూపములలో మాత్రమే కనఁబడు రకార డకార, ళకారాదుల స్థానమున నీ 'ఱ' కార మిటీవల వెలసిన దనుట యుక్తముగా లేదు. శకట రేఫమునుగూర్చిన ప్రతివాదమే దీని కుపలక్షకము.

ఈ ఱకారము తోఁడిదే యీ ద్రావిడభాషలకుఁ బ్రత్యేక వర్ణమని చెప్పఁదగిన శకటరేఫమనునది మఱియొకటి కలదు. దీనికి పూర్వకాలమున స్వతంత్రోచ్చారణ ముండి, యది క్రమముగ నశించి రేఫముయొక్క యుచ్చారణమును. దీని యుచ్చారణమును సమము లగుటచేఁ బూర్వము బండిరాగ బలుకఁ బడిన శబ్దములు క్రమముగ రేఫయుతముగ బలుకఁ బడ జొచ్చెననియు, నా కారణముచే బండి 'ఱ' యుతరూపములే ప్రాచీనములుగ నిశ్చయింప వలయుననియు వారు చెప్పియున్నారు. తెనుఁగున రేఫ శకట రేఫముల భేదమూఁగా నిటీవల పాటింపఁబడక పోయినను, అప్పకవి మొదలగు లాక్షణికులు రేఫ శకట రేఫములతోఁగూడిన పదముల పట్టికను తయారుచేసి వాని భేదమును నిలువఁ బెట్టఁజూచి యున్నారు. యతి ప్రాసములలో నీ భేదమును పాటింపని వారిని లాక్షణిక కవులుగా గ్రహింపక తూలనాడినారు. అట్లు యైనను యతిప్రాసములలో సంకరము గలిగినప్పు డట్టివానికి ద్వైరూప్యమును సాధించి సరిపెట్టుకొనినారు. ఈ రీతిగా తెనుఁగుపదములలోని రేఫ శకట రేఫములనునిర్ణయించుటకు నిష్కృష్టమైన సాధనము లేదు. వాని నితర ద్రావిడ భాషా పదములతోఁ బోల్చిచూచుటయే కొంతవరకైన నిశ్చయించుటకు సాధనము కాగలదు. అట్టిసందర్భములలోఁ గూడ తెనుఁగు

రూపములలో శకట రేఫము కనఁబడినంత మాత్రమున వానిని ఇతర భాషా రూపములకంటెఁ బురాతనములుగా గ్రహింపవలెనని వాదించుచు. తెనుఁగులో నన్నయ్యకుఁ బూర్వకాలమునందే యంతరించిన 'ఱ'కార మితర భాషాపదములలోను, మూల ధాతువులలోనుగూడ కనఁబడినప్పుడు, ఆపదములనే ప్రాచీనములుగా గ్రహింపక, తత్స్థానమున వచ్చిన రేఫయుక్త పదములనే ప్రాచీనములుగా గ్రహింపవలెననుట యెట్లు పొసగును? ఇచ్చట నుచ్చారణసౌకర్యమును స్వరసంప్రదాయమునకుఁ బ్రాధాన్య మిచ్చితిమని వారు వాదింపవచ్చునుగాని యది యితర సంప్రదాయ విరుద్ధము కాకుండిననే సమంజసము కాఁగలదు. కాని యట్లు గానిచో గ్రాహ్య మెట్లగును? ఇట్టి శకటరేఫము విషయమున కూడ తెనుఁగుననే యనేక పదములకు ప్రాధాన్యము కలుగుటచేతను ఇతర భాషా రూపములతోఁ బోల్చి నిర్ణయింపవలసియుండునేకాని, యీ భాషారూపములను బట్టి యేదియో నిర్ణయింప వీలు లేదు. పెక్కు భాషలలో శకటరేఫమున్నప్పుడుగాని, లేదా యితర కారణములను బట్టి యిది శకటరేఫమని నిర్ణయింపఁదగినపుడు గాని యీ రూపము ఏ భాషలో నున్నను ప్రాచీనమే యగును. మేఁక యను నర్థముగల 'వఱకు' అనునది పేరు గ్రహించిన వానిలో తొలిపదము. దీని విషయమునందే యీ చిక్కు విశేషముగా గనఁబడుచున్నది. దీనికి ప్రాధాన్యము కలదని లక్ష్మీనారాయణీయమను నిఘంటువు ఆంధ్రపద పారిజాతమును బట్టి తెలియుచున్నది. కావున నిదె మొదట సందేహమునకుఁ గారణము. ఈ సందేహమును దీర్చుకొనుట

కితర భాషారూపములను బరిశీలించినచో, తమిళమునందలి వరై, వరైప్పు, వరమ్బు లనువానిలోను, కన్నడమందలి వరె, బరె, వరెగం (*Limit, boundary, until, upto, as far as*) అను పదములలోనుగూడ రేఫమే కానవచ్చుచున్నది. ఇంతే కాక కన్నడ నిఘంటుకారుఁడగు కిటెల్ వరె-వరెగం అనుపదమును దేశ్యముగాఁగూడ గ్రహింపలేదు ; తద్భవ శబ్దముల క్రిందఁ జేర్చినాఁడు. ఇంతేకాక దీనికి "నీళ్లు వచ్చుటకేర్పరచిన కాలువ, లేక పొలములోని కట్టవ" అను నర్థముగల 'వరవ' అను శబ్దముతో సంబంధము కల్పించినాఁడు, ఇట్టి సందర్భములో తెనుఁగుననే ద్వైరూప్యము గలిగి యితరభాషలతో పొందికలేకయున్న యీ 'వఱకు' అను శకటరేఫ యుక్త రూపమును గ్రహించి యిదియే మూలరూప మనికాని, దీని వలన నాభాషయొక్క-పురాతనత్వము ద్యోతకమగుననికాని యెట్లు చెప్పనగును ? మఱియొక దానిని గ్రహించిచూతము : 'తేఱు' అనుదాని కఱవమున రేఫయుక్తరూప మున్నట్లు చెప్పినారు. కాని ఆ భాషలో 'తేఱు' (*To be clarified, to become clear as water*) అని శకటరేఫయుక్తరూపము కలదు. కన్నడమున మాత్రము 'తేరు' (*To reach, as the end*) అని రేఫమే కనఁబడుచున్నది. తెనుఁగునగూడ తేటపడు అనునర్థమున 'తేరు' రూపము కలదని ఆంధ్రపద పారిజాతము సూచించుచున్నది. ఇప్పుడు నిర్ణయమెట్లు? 'వరకు' శబ్దము వలెనే ద్వైరూప్యమునుబట్టి త్రోసిపుచ్చుటా అనివిచారింపగా పైని దీని కర్థముగా జెప్పబడిన 'తేటపడు' అను శబ్దమే ఇందలిది శకటరేఫ మని మనకు సూచించుచున్న దన

వచ్చును. 'తేట' అనునది 'తేఱు' అనుదానినుండి యేర్ప
డిన నామవాచకరూపమే. శకటరేఫముద్విత్వమై యుచ్చరింప
బడినపుడు 'ట్ట్ర' అనుదానివలె పలుకఁబడుట ద్రావిడభాషా
సంప్రదాయములలో నొకటి. తమిళమలయాళముల నామవా
చకరూపము 'తేఱ్ఱ' అనునదే. ఇది యుచ్చారణలో 'తేట్ట్ర'
యై తుదకు 'తేట' యైనది. ఈరూపమే తెనుగుననే కాక
కన్నడమునగూడ 'తేట' అని నిలిచియున్నది. కావున శకట
రేఫముతోఁ గూడినదే యీ శబ్దమని మనము నిర్ణయింప
వచ్చును. కాని దీని ప్రాచీనత తెలుగు రూపమును బట్టి
మాత్రమే నిర్ణయింపనగునా? శకటరేఫము టవర్ణముగా బరి
ణామమందిన రూపము లీ భాషలలో ననేకములు గలవు. cf
చిఱు-చిట్టి, చిటి; మాఱు-మాట; కఱచు-కాటు; మిఱ్ఱు-
మిట్టు, మెట్టు; కుఱు-కుట్టి, కుట్టుసురు; ఊఱు-(తె. నీరూరు,
త. ఊఱు-ఊఱ్ఱు-ఊట్టు)) ఊట మొ.' ఎఱుపు' శబ్ద విషయము
సందేహమే. తమిళ కన్నడముల రెంటను రేఫమే కనఁబడు
చున్నది. తెనుఁగులోవలె నా భాషలలో నుచ్చారణభేదము
సంపూర్ణముగా రూపుమాసిపోలేదని తద్భాషావేత్తలుచెప్పు
దురు. కన్నడమున ఎరె అనగా ఎఱ్ఱనిరంగు(*Dark red colour*)
అనియే కాక తమిళమున 'ఏఱువై' అనగా రక్తము, రాగి
(*Blood, copper*) అను నర్థములు కలవు. దీనినిఁబట్టి రక్తము,
రాగి అను వానినిబట్టి వానికి గలరంగు అను నర్థము వచ్చిన
దేమోయనియుఁ దలఁపనచ్చును. మొత్తముమీఁద తెనుఁగు
లోని 'ఎఱుపు' శబ్దము అఱవమునందలిదానికంటె శకటరేఫ
మునుబట్టి పురాతనమని మాత్రము చెప్పుట కవకాశమే

మాత్రమును లేదు. తీఱు శబ్దమునకును ద్వైరూప్యము కల దని తెలుఁగు లాక్షణికుల మతము. నిర్ణయించుటకు వేరు సాధనములు లేవు.

ఇక రెప్ప, రెక్క, రేయి మొదలగు తెలుఁగుశబ్దముల పురాతనత్వమును సాధించుటకుఁగా తమిళ భాషా సంప్రదాయము సహాయముగా గైకొనబడినది. ఈ ద్రావిడ భాషలలో పదాదియందు సంయుక్తాక్షరము రానట్లే పదాదియందు రేఫ ఱకార లకారములు కూడ రావు. తమిళ కన్నడములలో నట్టి శబ్దము లేవియు లేవు, సంస్కృతాద్యన్య భాషలనుండి యట్టి పదము లీ భాషలోఁ బ్రవేశించినచో వాని మొదట అ, ఇ, ఉ లలో నేదో యొక వర్ణము చేర్చబడును. రాజ అను శబ్దము తమిళమున 'అరశన్' అయినది. రామ—ఇరామన్, లోకం—ఉలగం మొ. ఈ పద్ధతినిబట్టి విచారింపగా, అనగా సంస్కృతాద్యన్య భాషాపదము లీ భాషలో బొందుమార్పుల ననుసరించి చూడగా రకారముతోఁ బ్రారంభింపఁబడిన రూపము తరువాతిదియనియు తెలియవచ్చుచున్నదన్నమాట నిజమే. అట్లగుటకు కారణ మేమనగా — రకారాది శబ్దముల నుచ్చరించుట ప్రాచీన ద్రావిడజనులకు నలవాటు లేకుండుటయే. కావుననే యట్టిపదము లా భాషలలో లేకుండుటయే సంభవించినది. అట్టి పదము లితరభాషలలోనివి వారు వ్యవహరింపవలసి వచ్చినపుడు ఉచ్చారణసౌకర్యమునకై అకారే కారోకారములను ముందుఁ జేర్చికొని యుచ్చరించెడివారు. ఇది తమిళమున మాత్రము నిలిచినది. తక్కిన భాషలలోను, తెనుఁగున నంతరించినది. రథము > అరదము మొదలగువానిని

బట్టి తెనుఁగున నొకప్పుడీ సంప్రదాయ ముండె ననవచ్చును. స్కూలు అను నింగ్లీషు పదమునందలి తొలి సంయుక్తాక్షర మును పలుకలేక, యుచ్చారణ సౌకర్యమునకుఁగా 'ఇ'కార మును జేర్చి పలుకుట తెనుఁగునను గలదుగదా! స్కూలు–ఇస్కూలు; తమి. స్టేషన్–ఇస్టేషన్. ఇట్లు అన్య భాషా పద ముల విషయమునఁ గలిగిన సంప్రదాయము దేశీయపదముల పట్లగూడ నన్వయింపగూడదు. అట్లుచేసిన నాసంప్రదాయ మే తారుమారగుట తటస్థించును. ఏలయన దేశీయ పదములలో రకారాదులే యుండవుగదా! అయితే పదాదిని రేఫము పలు కుట ద్రావిడులకు అలవాటులేకపోవుటచేతనే యట్టి పదము లీ భాషలలోనే లేవని చెప్పఁబడినచో తెనుఁగులో రెప్ప, రెక్క మొదలగు పదము లెట్లు వచ్చినవి? అను ప్రశ్న బయలుదేరక మానదు. దీనికిని వెనుకటి క్రారతోఁగూడిన శబ్దముల విషయమందు వలెనే ద్వితీయాక్షరము రేఫగా గలి గిన శబ్దములలోని రేఫ వర్ణప్లుతియే ముఖ్యకారణము. ఇందు వలననే తెనుగున పదాదిని రేఫసంయుక్తవర్ణము గలిగినట్లే, రేఫలకారములతో గూడిన శబ్దములుకూడ బయలుదేరినవి. ఇఱక్కై > ఎఱక్కై > ఎఱక > ఱెక్క; ఇరవు–ఇరా > రేయి; ఉరల్ > ఒరల్ > రోల్ > రోలు, ఇరట్టి (ఇరండు) > రెట్టి–రెట్టింపు మొదలగునవి. తెనుఁగు కన్నడ కోశములలోఁజూచి నచో నిట్లు రకారాదులగు దేశీయ పదములు పదిపదునైదు కంటె నెక్కుడుగా కనఁబడవు. కొన్నిటికి మూలరూపములు తెలియక పోయినను, అవి అన్నియు నజాది పదములలో ద్వితీయ స్థానమందున్న రేఫ వర్ణముయొక్క ప్లుతిచే నేర్పడిన

వనియే చెప్పవచ్చును. లకారాదిపదములు నట్టివేయైయుండు ననుటకు సందేహము లేదు. మిగిలినపదము లనేకములున్నను అవి సంస్కృతాద్యన్య భాషలనుండి వీనిలో సంక్రమించినవై యుండునే కాని దేశీయములు కావు.

శ్రీ లక్ష్మణరావుగారి రేఫాది పదముల విషయమున నీ వాదము నెఱుగనివారు కారు. కావుననే 'ఇరప్పై' మొదలగురూపములే మొదటివనియు, వానిలోని మొదటి యచ్చులు కప్పగంతులువేసి రకార మందలి యచ్చుతోఁ గలిసి రెప్ప మొదలైన రూపములు సిద్ధించెనని తలఁచు లాక్షణికులు గలరనియు చెప్పుచు, నది స్వభావ విరుద్ధమైనదని వారి తాత్పర్యమగుటచే, దానిని త్రోసివేసి రేఫాంత తెలుఁగు శబ్దముల పురాతనత్వమును సాధింపఁగడఁగిరి. అచ్చు పూర్వమందుగల రేఫ ముచ్చారణకు సులభమని, దానిని రేఫాదిగా మార్చుట కఠినమగుటచే నస్వాభావికమని వారి మతము. నిజమే కావచ్చును గాని, వర్ణోచ్చారణమందలి సౌలభ్యా సౌలభ్యములు ఆ యా భాషలను మాటలాడు జనుల యుచ్చారణ సంప్రదాయములు, నలవాటులను బట్టియుండును. ఇతర భాషా సంసర్గముచే నివి యొక్కొ-క్కప్పుడుమారినను మారవచ్చును గాని సహజ సంప్రదాయములు కొన్ని యుండుననుటకు సందేహము లేదు. ఒక దేశమునందలి వారికి, లేదా ఒక భాష మాటలాడు వారికి కఠినముగాఁదోఁచిన యుచ్చారణము మఱియొక భాష మాటాడువారికి సులభముగనే కనబడి వారికి పరిపాటి యగు సంప్రదాయ మగుటయుఁ దటస్థింప వచ్చును. వీని నన్నిటిని గమనించి కాని యే నిర్ణ

యమునకును రాలేము. సంస్కృతమునందు సహజములగు మహాప్రాణాక్షరములు ద్రావిడభాషలలో లేవు. ఆ వర్ణములతోఁ గూడిన పదముల నెరువు తెచ్చుకొన్నప్పుడుగూడ నా మహాప్రాణములను దొలఁగించి వానిస్థానమున నల్పప్రాణములను జేర్చుకొనియే వీరు గ్రహింతురు. అనఁగా సంస్కృత భాషా వ్యవహర్తలు సులభముగా నుచ్చరింప నలవాటుపడిన మహాప్రాణములను ద్రావిడ భాషలను వ్యవహరించు జను లుచ్చరింప లేకపోయిరనుట. కాని యిందలి శకటరేఫ, 'ఱ' కారములను వింత యక్షరము లితరులకు కష్టతరముగాఁ గన బడును. హిందూస్థానీ భాషలకు సహజమగు కంఠ్యకకారో చ్చారణ మితర భాషల వారికి కష్టతర మగును గదా. సంస్కృతమందలి 'గౌః' మొదలగుశబ్దములలోని 'గ' కారము గ్రీకు భాషలో సన్నిహిత సంబంధ మేమాత్రమును లేని 'బ' కారముగా మాఱినది. సం. గౌః-గ్రీకు. 'బౌస్' (*bous*) కావున నుచ్చారణ సౌలభ్యము కొఱకుగా గలుగు మార్పుల విషయమైన సామాన్య సూత్రములు కొన్ని సహజములు, నుచితములుగనే కనబడినను, ఆ యా భాషలలోఁ బ్రత్యేక సంప్రదాయము లెట్టివో యను విషయమును గూడ తత్తద్భాషాలక్షణపరిశీలనము మూలముగాఁ దెలిసికొననిదివానిని సర్వత్ర అన్వయింపఁగూడదు. 'ఇరవు' నుండి 'రేయి' పుట్టిన దనుట స్వభావ విరుద్ధమని వారి తాత్పర్యముగాఁ జెప్పుటయే కాక 'ఇరాత్రి' నుండి సంస్కృతమందలి 'రాత్రి' పుట్టినదన రాదా? యని కూడ లక్ష్మణరావుగారు ప్రశ్నించుటచేతనే ఇంత విపులముగా నీ విషయమును జర్చింపవలసి వచ్చినది.

'రాత్రి' శబ్దము సంస్కృత మనుట ప్రసిద్ధము. రేయాదిశబ్దముల నుచ్చరింపనేరకపోవుట ప్రాచీన ద్రావిడ సంప్రదాయసిద్ధము. కావున 'రాత్రి' శబ్దమును వీ రుచ్చరింప వలసినప్పుడు దాని కొక అచ్చును ముందుచేర్చి 'ఇరాత్రి' యని చేసి యుందురు కాని 'రేయి' శబ్దము ద్రావిడభాషాపదము కాదే. వీరి భాషోచ్చారణ సంప్రదాయమును బట్టి ఏరి భాషలో రేఫము పదాదిని రాకూడదుగదా. తెలుగుభాషకూడ అరవముతోపాటు ద్రావిడకుటుంబమునకే చెందినదని చెప్పుచు నా భాషలో మాత్రము దేశీయమగు 'రేయి' అను రేఫాది శబ్దము కలదని. ఇదియే మూలభాషకు సన్నిహితమని, అరవమునందలి 'ఇరవు' అను దానికంటె ప్రాచీనమని, సజాతీయమగు తెలుగుభాషలోని 'రేయి' అనుదానిని పలుకలేక సౌలభ్యముకొరకు అరవము 'ఇ' కారము చేర్చుకొనినదని. ఈవిధముగానే అరవముకంటె తెనుగునకే యెక్కువ పురాతనత్వము సాగుచున్నదని వాదించుట యెట్లు? కావున వారిచ్చిన రేఫాదిపలుకు తెనుగురూపములు పురాతనములు కావు, అరవరూపము ఆధునికములు కావు. అయితే వస్తుస్థితి ఏమి? వీనివాక్యసత్యమునకు నిర్ణాయక మెట్టిదని అడుగవచ్చును. ద్రావిడసంప్రదాయమును బట్టి రేఫాది శబ్దములు ప్రాచీన భాషలో నుండవు గదా. కావున దేశ్యశబ్దములు రేఫాదులు తెనుగునను ఉండకూడదు. ఇప్పు డగపడుచున్న శబ్దములన్ననో ఇవి యిటీవలి కాలమున నేర్పడియుండవలయును. తమిళ కన్నడ శబ్దములతో వీనిని బోల్చి యివి యీ భాషలలో నెట్లు ర్పడి యుండునో, వీని మూలధాతువు లేవో పరిశీలించినచో

దెలియనగు వాని పరిణామ క్రమమునుబట్టి మనము వీని పౌర్వాపర్యమును నిర్ణయింపవలసి యుండును. 'రేయి' శబ్దము సంస్కృత 'రాత్రి' శబ్ద భిన్నమన్నచో దీనినుండి తమిళమందలి 'ఇరాతిరి' గాని, 'ఇరవు' గాని వచ్చె ననుట కభ్యంతరము లేదు. కాని ఇది దేశీయ పదమే యన్నచో దీనిని తమిళమునందలి 'ఇరా' శబ్దముతోను, ఈ రెంటిని తమిళ కన్నడాంధ్ర తుళు భాషలు నాలుగింటిలోను గాన వచ్చు ఇరుళ్, ఇరులు, ఇర్ళ్ మొదలగు రూపములతోను బోల్చి చూడవలసియున్నది. వీనికిఁ గల చీకటి,అంధకారము అను నర్థమును బట్టి 'ఇరవు' అను శబ్దముతో సంబంధము కల్పించినచో ఇరా, ఇరవు అనువాని ప్రాచీనత్వము,ఇరా> రే > రేయి అను తెనుఁగు శబ్దముయొక్క నిష్పత్తిక్రమము తెలియనగును. ఇరుళ్ అను పద మీ నాలుగు భాషలలో గూడ గనబడుచుండుటచే నిదియే మూలభాషకు సంబంధించిన దనవలసి యున్నది. దీనికి సంబంధించియే ఇరా, ఇరావు, ఇరవు అనున వేర్పడియుండు ననుట సంభావ్యము. 'ఇరా' నుండి తెలుఁగులో 'రేయి' తరువాతి కాలమున నేర్పడి యుండును. ఈ వర్ణప్లుతి యనునది తక్కినభాషలలో కంటె తెనుఁగున నేదో యొక కాలమున ప్రబలమై యున్న ట్లగపడుచున్నదని యిదివరకే గ్రహించితిమి గదా.

ఇట్లే తెనుఁగున రేఫాది పదముల యర్వాచీనత్వము ఈ భాషలలోఁ గనఁబడు సజాతీయ మూలశబ్దములు, లేదా ధాతువులనుండి వాని పరిణామ క్రమము నన్వేషించినచో వ్యక్తము కాగలదు. ఉరల్ > ఒరల్ > రోలు అయినది.

గాని 'ఱోలు' ఉఱోలు–ఉరలు కాలేదు. cf. త. ఉరల్, మ. ఉరల్ ; క. ఒరళు; తుళు. ఒరల్. ఇట్లిది యీ నాలుగు భాషలలోను సమానరూపము గలదై యున్నది. ఒక్క తెలుఁగులోనే 'ఱోలు' అయినది. దీనికి మూలధాతువు త. ఉరళ్ ; క. మ–ఉరుళ్. తెనుగున గూడ ధాతువు ఉరలు–ఉర్లు అనునదే. ఇది తిరుగు, భ్రమించు అను నర్థముల గలదు. ఉలూఖల మన్న యర్థమున తెనుగున 'ఱోలు' అని శకట రేఫముకూడ నేర్పడినది. కాని యితర భాషలలో దేనిలోను శకటరేఫము లేకుండుటచేతను, మూలధాతువు రేఫసహితమే యగుట చేతను 'ఱోలు' అను రూప మపభ్రంశ మనవల యును. తెలుగులో శకటరేఫముతో నీ 'ఱోలు' శబ్ద మగ పడుచున్నది. గనుక ఇదియే పురాతన రూపమని, తక్కిన నాలుగు భాషలలో రేఫయుక్తములై యున్న వర్వాచీనము లని వాదించిన నెంత యాభాసముగా నుండునో విచా రింపుడు.

త. ఇఱక్కై–>ఱెక్క. తమిళమునందలి 'ఇఱక్కై' అనునది తెనుఁగు'ఱెక్క' అనుదానినుండి యేర్పడిన యర్వా చీన రూపమని తమిళ నిఘంటు చూపుచున్నది. అనగా 'ఱెక్క' అను తెనుఁగుపదము తమిళమున నిటీవల సంక్ర మించిన దనుట. మూలభాషనుండి యేర్పడినవి కాక ఒక భాషలోని పదములు మఱియొక భాషలో నాయాకాలముల సంక్రమించుచుండుటయు గలదు. కాని తమిళమునందలి దీని ప్రాచీనరూపము 'ఇఱకు' అనునది. త. ఇఱకు; మ. ఇఱహు; క. ఎఱకె. తెనుఁగునగూడ 'ఎఱక' శబ్దమున్నది. తెనుఁగున

తె. రేగు, రేచు. రేపు=పై కెగురగొట్టు cf. తె. ఎగురు, ధాతువు–త. క. మ. – ఎట్ (To rise, stand up etc-) cf. తె. ఎత్తు, ఎక్కు, ఎగయు మొ. క. ఎట్తర, ఎచ్చు మొ.

తె. రేవు-ధాతువు-ఇట్ > డిగు > దిగు. cf. త. ఇఱంగు.

తె. రుబ్బు, త. మ. ఉరై, ఉరె (to grind) క. ఉర్దు (to rub on.) తె – రుద్దు. క, ఒరెగల్; త. ఉరైగల్; తె. ఒరగల్లు–ఒరపిడిరాయి.

రోజు, రొట్టె, రుసుము, రవిసు, రుజువు, రుమాల్ మొదలగు రేఫాదిశబ్దములు విదేశీయ భాషలనుండి ఎరువు తెచ్చుకొనినవిగాని దేశ్యములుకావు,

దీనినిబట్టి తెనుగునందలి రేఫాదిశబ్దము లా భాషలోని కెట్లు వచ్చినవో, అరవకన్నడ మలయాళ తుళురూపముల కంటె వాని పురాతనత్వ మెంతవరకు సాధింపనగునో గ్రహింపవచ్చును.

ఇక తెనుఁగునందలి నాలుక–నాల్క యను రూపములు శ్రీ లక్ష్మణరావుగా రనినట్లుగా తమిళము నందలి 'నాక్కు' అను దానికంటె పురాతనములు కావచ్చును. 'నాక్కు' అనుదానికి 'నా' అనికూడ మఱియొకరూపముకలదు. కాని నాలుక (tongue) అనునర్థమున మిక్కిలి పురాతనపు టరవమున 'నాల్కురి' అను రూపముండెననుట పొరపాటుగా గనఁబడుచున్నది. వారు చూపిన పౌనరర్ ఆఱ్ఱుపడై యను గ్రంథమున గల 'నాల్కు' అను శబ్దమునకు నాలుగు (four)

అని యర్థమే కాని నాలుక అను నర్థమున ఈ శబ్దము తమిళ భాషలో లేదని తద్భాషావేత్తలు చెప్పుచున్నారు. అచ్చట రథమునకు నాలుగ శ్వములను బూన్చు సందర్భమున 'నాల్కు' శబ్దము ప్రయోగింపఁబడినది. 'నాలుక' అను నర్థమున తమిళము, మలయాళముల 'నా' 'నాక్కు' అను రూపము లే కానవచ్చుచున్నను, కన్నడ తుళుభాషలలో 'నాలగె', 'నాలాయి' యను రూపము లగపడు చుండుటచే నీ 'ల' కారము కూడ మూలశబ్దములో నుండియుండు నని యూహించుట కవకాశము లేకపోలేదు. తెలుగున 'నాలు' అను ధాతు వంతరించిపోయినను తమిళమున 'వ్రేలాడు' (*to hang, to be suspended,*) అను నర్థమున నాల్-నాలు అను ధాతువు నిలిచియున్నది. దీనినుండియే 'నాలుక' వచ్చి యుండును. 'నాయి' (కుక్క) శబ్దముకూడ దీనినుండియే వచ్చినదని చెప్పుదురు. దీనికి తెనుఁగులో వ్యవహార మంతగా లేదుగాని నన్నిచోడుడు తెనుగు కవిత్వమున దీనినిఁ జేర్చి నాఁడు. తమిళమునుండి తెనుఁ గెరువు తెచ్చుకొనిన శబ్దము లలో నిది యెకటిగాఁ దలపవచ్చును. నాల్కు శబ్దములోని లకారము క కారముతో సమీకరణము (*assmilation*)నొందు టచే 'నాక్కు' రూప మేర్పడియుండును. అయినను దెనుఁ గులో నాలుకతో నాకుట యే కాని 'నాల్కుట' లేదు. 'నాకు' అను ధాతువునుండి 'నాక్కు' అను నామవాచకరూప మేర్పడ వచ్చును గాని 'నాల్క-నాలుక' యేర్పడినదని చెప్పుటకు వీలు లేదుగదా. కావున తెనుగులో నిలిచిన 'నాకు' అనునది యిటీవల ఏర్పడిన ధాతువేగాని మూలధాతువు కాదనియు,

'నాలుక-నాల్క' యను తెలుఁగునందలి నామవాచక శబ్దమునకును, తమిళమునందలి' నాక్కు' అనుదానికినిగూడ 'నాలు-నాలుకు' అనునదే మూలధాతువై యుండుననియు నూహింపవలసి యున్నది. ఇట్లే మన భాషలో వైయాకరణులు సామాన్యముగా ధాతువులని పేర్కొనునట్టివి - వచ్చు, పుచ్చు, వెలుగు, తునుగు, ఎక్కు, తగ్గు మొదలగునవి మూల ధాతువులని తలచుటకవకాశము లేదనియు, వీని నితరభాషలలోని ధాతురూపములతోడను, ఈభాషలోని యితర సన్నిహిత శబ్దముల తోడను పోల్చిచూచినగాని మూలధాతు స్వరూపమును నిర్ణయించుట సాధ్యము కానేరదనియు దీనినిబట్టి మనము గ్రహింపవలసియున్నది.

తెలుఁగున మూలార్థము నిలిచి తమిళాదులలో అర్థము మాఱిపోయినశబ్దముల కుదాహరణముగా 'మగఁడు' అను దానిని వారు చూపిరి. ఇట్టివింక ననేకము లుండుననుటకు సందేహము లేదు. కార్ష్ణ్యము అను నర్థమున నల్ల, నలుపు అను శబ్దములు తెలుఁగున గలవు. 'నల్ల' యనగా నిప్పటి తమిళమున వ్యవహారమున 'మంచిది'(*good, excellent*) అని యర్థము. కాని ప్రాచీన తమిళమున నలుపను నర్థము కలదట. 'నిల్లం' అనగా బొగ్గు (*charcoal*), నల్లందనము (*blackness,darkness*)అను నర్థములు కలవని తమిళ కోశమును తెలుపుచున్నది.

వ్యాకరణ రూపముల విషయమున నొక్క 'పోదుమ్' అను తద్ధర్మార్థకరూపమే కాక భూతకాలిక క్రియా రూపములు, తుమున్నంత రూపములు మొదలగు మఱి కొన్నిటి

విషయమునఁగూడ తెలుఁగున నిలిచియున్న రూపములు తమిళకన్నడాదులందలి రూపములకంటె పురాతన స్వరూపమును వహించి యున్నవనియేకాక, అట్లుండుటచే మూల భాషనుండి వీని పరిణామక్రమము నన్వేషించుట కెక్కువ తోడ్పడు చున్నవనియు జెప్పుట కవకాశము కలదు. అట్టి వానిని గూర్చి మఱియొక వ్యాసమున వివరించెదను.

ఈ రీతిగా నొక్క కుటుంబమునకుఁ జెందిన భాషలలో నొక్కొక్కదానియందు కొన్ని ధాతువుల యొక్కకాని, పదముల యొక్కకాని, క్రియారూపముల యొక్కకాని మూల రూపములు కాలగతిని ఉచ్చారణభేదము వలన గలుగు పరిణామములకు లోనుగాక నిలిచి యుండుట తటస్థింప వచ్చును. అట్టివి యీ తెనుఁగు, అరవము మొదలుగాగల వాఙ్మయ సంస్కార రహితములై యున్న కోదు, కుయి మొదలగు ననాగరక భాషలలోఁగూడ గనఁబడవచ్చును. కావుననే యీకుటుంబమునకుఁ జెందిన భాషలలోని సమానార్థకములగు నాయా రూపములనన్నిటిని బోల్చి పరిశీలించి తత్తత్సంప్రదాయాను సారముగా వాని పరిణామక్రమమును దెలిసికొనిన గాని మూలభాషస్వరూపమును గుర్తించుట కవకాశము లేదని చెప్పబడు చుండుట. ఏవో కొన్ని పదముల సాదృశ్యము నెత్తి చూపినంత మాత్రముచే అరవమునుండి తెనుఁగు పుట్టినదని సాధింపయత్నించిన యీకాలమునందలి యరవపండితుల వాదమును ఖండించు నుద్దేశముతో శ్రీ లక్ష్మణరావుగారీ వ్యాసమును వ్రాసియుందురు. ఆ వాదమును ఖండింప యత్నించినందులకు వీరు ప్రశంసనీయులు. కాల్డ్వెల్ పండితుఁడైనను

తమిళమును తక్కిన భాషలకంటె బాగుగా నేర్చినవాఁడగుటచే దానినుండి యుదాహరణము లెక్కువగా నిచ్చి, కొన్ని సంప్రదాయముల విషయమునను, కొన్ని రూపముల విషయములోను తమిళము మూలభాషా స్వరూపమును నిలువ బెట్టుకొని యున్నదిగావున నా మూలభాషా లక్షణముల నన్వేషించుటలో మన కెక్కుడు తోడ్పడగలదని చెప్పనేకాని యితరభాషల సహాయ మక్కర లేకయే తమిళము మూల భాషా స్వరూపమును మనకు దెలుపుచున్నదని చెప్పియుండ లేదు. వీని పురాతనత్వము విషయముగూడ నట్టిదే. ఒక భాషలో గొన్ని పురాతన రూపములు నిలిచి యుండవచ్చును, మఱియొక భాషలో నవి మాఱిపోయినను మఱికొన్ని నిలిచి యుండవచ్చును. సజాతీయ భాషారూపముల నన్నిటిని బోల్చి పరిశీలించిన గాని వాని పరిణామ క్రమము, పురాతనత్వము నిర్ణయింప వీలుకాదు. ఒక కుటుంబమునకు జెందిన సోదరభాషలన్నప్పుడు వానిలో దేనినుండి యేది పుట్టినది, ఏది పురాతనమైనది అను ప్రశ్నలకు దావులేదు. ప్రాచీన ద్రావిడభాషా స్వరూపనిర్ణయమును బట్టి, మూల రూపముల నిర్ణయమును బట్టి మారవచ్చును. తెలుగున దేశ్య శబ్దముల స్వరూపము విశేషముగా మారినట్లున్నను, భాషారూపములలో ప్రాచీనత ఎక్కువగా గనబడుచున్న దనుటకు సందేహము లేదు.

# 6

# భాషా కుటుంబములు

భూభాగమందు దాయా ప్రదేశముల నివసించుచుండెడి మానవకోటి యంతయుఁ గొన్ని జాతులుగా విభజింపఁ బడుచుండినట్లే, యీ మానవకోటిచే వ్యవహరింపఁబడుచుం డెడి భాషలుకూడఁ గొన్ని కుటుంబములుగా విభజింపఁదగి యుండును. భాష యనునది మానవుఁడు తన జన్మకుఁగారణ భూతులగు పూర్వపురుషులనుండి వడసిన యొక యపూర్వం బగు సొత్తు. ఇట్లపూర్వ సంపత్సంపన్నుఁ డగుటచేతనే మానవుఁడు తక్కిన జంతువులకంటె భిన్నుఁడై జంతు కోటిలో నగ్రస్థానమును వహించుచున్నాఁడు. అనుకరణ శక్తి, జ్ఞాపకశక్తి, విశ్వాసము, బుద్ధిబలము, సుఖ దుఃఖా ద్యనుభవము, మొదలగు విషయములలో మానవులకుఁదక్కిన జంతుకోటికిని విశేష భేద మగపడదు. కాని యీ భాష యనునదిమాత్ర మీ జీవకోటిమధ్య నొక సరిహద్దుగా నేర్పడి మానవకోటిని తక్కిన జీవకోటినుండి వేఱుపఱచి దాని యాధిక్యమును జాటుచున్నదివలె నున్నది.

భాషయనున దెట్లు ఏకారణమున నేర్పడినది? ఒక భాషనుండి యనేకము లేర్పడినవా, లేక యేక కాలమున పలుచోట్ల పలుబాసలు బయలుదేరినవా యను విషయ ములు వివాదముతోఁ గూడినవిగా నున్నవి. కాని ప్రస్తు తము వ్యవహారములోనున్న భాషలను వాని స్థితిగతులను, అవి పొందుచున్న మార్పులనుబట్టి విచారింపఁగా, భాషలకు మార్పు సహజగుణమైనట్లును, అనేక విధములగు కారణము

లచే నొక్క భాషయే యనేక విధములగు మార్పులనుజెంది, యొక్క జనసంఘముచేతనే భిన్న రీతుల వ్యవహరింపఁ బడుచుఁ దుదకుఁ గాలక్రమమున భిన్న భాషలుగా మాఱి పోవుచున్నట్లునుఁ దెలియవచ్చుచున్నది. ఒక్కయాంధ్రభాష యే దేశభేదమునుబట్టియు, వర్ణభేదమును బట్టియు, నెన్నివిధ ములుగా వ్యవహరింపఁబడుచున్నదిమన మెఱింగినవిషయమే. మొట్టమొదట భాష లనేకముగఁ బుట్టి కాలక్రమమున నవి కొంత సంస్కారమును బొందినకొలఁది కొన్ని ప్రమాణరూప ములు లేక ప్రత్యేకాకారములు (Types) కలవిగా నేర్పడి యుండి, వానినుండి యిప్పుడు భూభాగమున వ్యవహార ములోనున్న భాషలు బయలుదేరి యుండవచ్చును. అట్లు గాక అనాదియగు నొక భాషనుండి బయలుదేరిన వేవైనను, ఆయా దేశకాల స్థితులబట్టియు, నాయా జనుల ప్రకృతు లను బట్టియు నుచ్చారణరీతులనుబట్టియు, భిన్నములై వేఱు వేఱు రూపములఁ బొందినవై యుండవచ్చును. కాని మొత్తముమీద నిప్పుడువ్యవహారముననున్న భాషలన్నియుఁ గొన్ని మూలభాషలకుఁ జెందినవై కొన్ని కుటుంబములుగ నేర్పరుపఁదగియున్న వను విషయమున మాత్రము భాషా తత్త్వవేత్త లందఱు నేకాభిప్రాయులై యున్నారు. భాషా కుటుంబముల నేర్పఱచుట యనఁగా గొన్నికొన్ని భాషలలోఁ గల పోలికలనుబట్టి యా పోలికలకుఁ గల కారణములను వానికిఁ గల సంబంధమును గూర్చి విమర్శించి యవి పరస్ప రము జన్యజనక భావసంబంధమో, లేక సోదరభావ సంబం ధమో కలవై యుండెనని సనిదర్శనముగ నిర్ధారణచేసి యా

సంబంధమునుబట్టి వానికొక వంశవృక్షము క్రింద నమర్చ యత్నించుటయే మైయున్నది. భిన్న భాషలు మాట్లాడు వారికిఁబరస్పరము నేమాత్రము నర్థము కాకుండునంతగా మాఱి వేరుపడిపోయిన యాయా భాషలకుఁ గల సంబంధ మిట్టిదని నిర్ధారణచేయుటకుఁ దగిన మార్గము లేవో మన మిప్పుడు విచారింపవలెను.

భాషల పరస్పర సంబంధమును నిర్ధారణ చేయుటలో మనకుఁ దోడుపడినవి రెండు ముఖ్యములగు నంశములు కలవు. అందొకటి యాభాషలయందలి పదపరికరము (*Material*), రెండవది యందలి పద వాక్యముల సంఘటనా పద్ధతి (*Method of expression*) లేక వ్యాకరణాంశములు. మొదటిది కొంత సులభమైన మార్గము. ఆయా భాషల యందలి పదపరికరమును సరిపోల్చి చూచుట. అట్లు సరిపోల్చి చూచినపు డాయా భాషలయందు సమానార్థకములగు పదములు గాని; లేక పదముల మూలరూపములు (*Root elements*) గాని నేకరూపము గలవై (లేక తుల్యరూపములు గలవై కన్పడినచో నా భాషలు పరస్పర సంబంధము కలవని యూహింప వచ్చును. సంబంధము కలవనేకాదు, అవి యన్నియు నేదో యొక కాలమున నొక ప్రాచీన భాషనుండి బయలుదేరి కాలక్రమమున విడిపోయి తుదకు భిన్నత్వమును జెందినవనికూడఁ జెప్పుదుము. చరిత్ర మనకుఁ దోడ్పడినచో నీ భిన్నభాష లేయే కాలమున నేయే మార్పులను జెందినవో సూచించుచు ప్రాచీన భాషనుండి యాకాలమున విడివడి యుండవచ్చునని సూచించుచు వాని చరిత్రను

లగు జాతులు బ్రిటన్ దేశము నాక్రమించిరనియు, నప్పుడే తమ భాషనుకూడ నచ్చట నెలకొల్పిరనియుఁ దెల్పెడి చారిత్రకాంశములు సమర్థింపఁగలుగుచున్నవి.

ఒకవేళ నీ పై విషయములను సమర్థించుటకు చారిత్రక నిదర్శనము లేమియు లేకున్నను, ఈ భాషలయందగపడుచుండెడి సమానార్థకమగు సరూప పదజాలమును బట్టి భాషా శాస్త్రజ్ఞుఁడు వీనికిఁ గల సంబంధమును నిర్ధారణ చేయలేకపోఁడు. కాని యట్లు నిర్ధారణచేయుటకుఁబూర్వము మాత్రము కొంచెము నిదానించి యా పదములను బాగుగఁ బరిశీలించును. రెండు భాషలలోఁ గొన్ని పదములు సమానముగఁ గన్పడినంతమాత్రమున నా భాష లొక కుటుంబమునకే చెందినవని నిశ్చయింప వీలులేదు. ఏలయనఁగా నొక దేశముపై మఱియొక దేశమువారు దండెత్తుటవలనఁ గాని, వర్తక వ్యాపారముల వలనఁగాని, వలసపోవుట మొదలగు కారణములవలనఁగాని, భిన్న దేశములందు భిన్న భాషలు మాట్లాడువారికి పరస్పర సంబంధము కలుగుచుండును. అప్పుడా జనులతో పాటు ఆ భాషలకు నన్యోన్యసంబంధము కలుగుటచే, నొక భాషనుండి మఱియొకభాష యనేకములగు పదముల నెరువు తెచ్చుకొని స్వభాషా పదముల వలెనే (ఒక్కొక్కప్పుడు స్వభాషా సంప్రదాయానుసారములగు యత్కించి త్సంస్కారములతో) వాడుకొనుచుండవచ్చును. ఈ రీతి నెరువు తెచ్చుటచేఁ గలిగిన యా భాషలలోని పదముల సారూప్యమును బట్టి యవి యేక కుటుంబమునకుఁ జెందినవేయని నిశ్చయింప వలనుపడదు కదా! కావున

భాషలసాజాత్యమునునిశ్చయించుటకుఁబూర్వమా భాషలలో
సరూపములై కన్పడెడు పదజాలము, ఒకదానినుండి యొకటి
యెరువుగాఁ దెచ్చికొనినది కాదని ఋజువు కావలెను. ఒక
ప్పుడీ యెరువు తెచ్చికొనిన పదములకే యా భాషలలోఁ
బ్రచారం బెక్కువ యగుటచే నంతకు బూర్వమందా భాష
లలో నాయా యర్థముల వాడుకలోనున్న నైసర్గిక పదములు
(*Native words*) బహిష్కృతములై క్రమముగా వాడుకలో
నుండి తప్పిపోవుటయుఁ దటస్థించును. అట్టి పదముల సంఖ్యను
బట్టి మనము స్థూలదృష్టితో విచారించి యా భాషల సంబంధ
బాంధవ్యములను నిశ్చయించినచో నది సత్యమునకు దూరము
కాకమానదు. ఆధునిక పరిషియన్ వాస్తవముగ
ఇండో యూరోపియన్ భాషా కుటుంబములో (సంస్కృ
తము, ల్యాటిన్, గ్రీకు, ఎవెస్టాభాష, ఇంగ్లీషు మొదలగు
వానిలో) జేరిన దేయైనను, ఇప్పుడా భాషలోఁ గలసిపోయిన
అరబిక్ పద సమూహమును బట్టి స్థూలదృష్టితోఁ జూచి
నచో నది సెమెటిక్ (హీబ్రూ, అరేబిక్ మొదలగుభాషల)
కుటుంబములోఁ జేరినదిగాఁ జెప్పఁదగియుండును. ఇంగ్లీషు
భాష వాస్తవముగ ఇండో యూరోపియన్ కుటుంబమునకుఁ
జెందిన ట్యూటానిక్ శాఖలోనుండి బయలుదేరినదై జర్మన్
మొదలగు భాషల కత్యంత సన్నిహితమై యున్న భాష. కాని
తరువాతికాలమున దేశము నార్మనులచే నాక్రమింపఁబడిన
పిదప, నీ భాషకు ల్యాటిన్, ఫ్రెంచి భాషలతోఁ గలిగిన
యత్యంత సాంగత్యమును బట్టి యా భాషలనుండి యమితం
బగు పదజాలమును సంగ్రహించికొనియుండుటచేఁ గోశముల

యందలి పదజాలమును బట్టియే విచారించినచో నింగ్లీషు భాష ల్యాటిన్ శాఖకుఁ జెందినదని చెప్పవలసి యుండును, గాని జర్మన్ భాషకుఁగాని, ట్యూటానిక్ శాఖకుఁగాని వాని కంటె సన్నిహిత సంబంధము కలదని చెప్పుట కవకాశము చాలదు. ఇంతయేల? మన యాంధ్రభాష విషయమునఁ గూడ నిట్టి సందిగ్ధస్థితి లేకపోలేదు.

ఆంధ్రభాష వికృతియని యాంధ్రవైయాకరణు లందఱు చెప్పుదురు. అనఁగా సంస్కృత ప్రాకృతములు ప్రథమ ద్వితీయ ప్రకృతులనియు, వానినుండి వచ్చినది గావున నిది వికృతి యనియు వారి మతము. కాని సంస్కృతాంధ్ర భాషలకుఁ గల సంబంధము ప్రకృతి వికృతి సంబంధమే యగునా యను విషయముమాత్రము విచారణీయమై యున్నది. ఏలయన నాంధ్రభాషయనునది సంస్కృత భాష యొక్క వికారము లేక వికృతియే యైనట్లయితే "తజ్జా, సమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి" (ఆంధ్ర శబ్దచింతామణి) అనియు;

ఆ. "తత్సమంబునాఁగ దద్భవంబన నచ్చ
తెనుఁగునాఁగ మఱియు దేశ్యమనఁగ
గ్రామ్యభాషనాఁగ గల వైదు తెలుఁగులు
వేఱువేఱ వాని విస్తరింతు."

(కేతన-ఆంధ్రభాషా భూషణము)

అనియు నీరీతిగ నాంధ్ర భాషను నాలుగు విధ ములుగనుము, నైదు విధములుగను విభాగం బొనర్చిన

యాంధ్రలక్షణకర్తల యభిప్రాయమేమో దురూహ్యంబగు చున్నది. ఆంధ్రభాష నాలుగు, ఐదు తెఱఁగు లన్నప్పుడు, తత్సమభాష, తద్భవభాష, దేశ్యభాష, అచ్చు తెనుఁగుభాష, గ్రామ్యభాష యనియీ వీరి భావము అని సందేహము కలుగకమానదు. తెనుఁగుభాష, గ్రామ్యభాష యనఁగా నేమో కొంచె మర్థమగును గాని తత్సమభాష తద్భవభాషయనఁగా నర్థమేమి? మనము అచ్చ తెనుఁగుగాని, గ్రామ్య భాష గాని మాట్లాడవచ్చునుగాని తత్సమ భాష తద్భవ భాష మాట్లాడుటలేదు. కావున "తెల్లమగు నైదు తెఱగులఁ దెనుఁగుబాస" (కూచి.తిమ్మ) యని తెలుఁగు బాస యైదు తెఱఁగులని చెప్పిన లక్షణకర్తల యభిప్రాయము, తెలుఁగు నందలి పదము లైదు తెఱఁగులుగా నున్నవనియే కాని తెలుఁగుభాష యైదు తెఱఁగులని కాదని, వారా "యాంధ్ర భాషాభేద చతుష్టయము–లేక పంచకము" నకుఁ జెప్పినలక్షణమునుబట్టి మనము తెలుసుకొనవలసియున్నది.

"క. మును సంస్కృత పదములపైఁ
దెనుఁగు విభక్తులు ఘటించి తేఁటపడఁగఁ జె,
ప్పిన నది తత్సమ మనఁజను
వనము, ధనము, పురుషుఁ, డబల, వసుమతి
యనఁగన్ ॥

(కేతన–ఆంధ్రభాషా భూషణము)

తే. ఆంధ్రదేశ పురస్థాయులైన సకల
జనములకును మఱుంగు లేశంబు లేక

తేట తెల్లమిగాఁ బల్కు మాటలెల్ల
నవని శుద్ధాంధ్ర దేశ్యంబు లనఁగఁ బడును.''
(అప్పకవీయము.)

దీనిని బట్టి ఆంధ్రభాషా పదము - అనఁగా నాంధ్ర భాషా పదములయందలి భేదము అని యర్థమైనట్లు స్పష్టమగు చున్నది. అయితే ఒక భాషలోని కొన్ని పదములు మఱియొక భాషనుండి వచ్చిన పక్షమునైనప్పు డాభాష యంతయు దీని వికృతియని చెప్పవలసినదేనా? ఒక వేళ అట్లు చెప్పఁ దలంచినచో నీ లక్షణకర్తలు చేసిన యాంధ్ర భాషా పదముల విభాగములోఁ జేరిన దేశ్య పదములు, అచ్చ తెనుఁగు పదములు అనునవి యాద్యప్రకృతినుండిగాని ద్వితీయప్రకృతి నుండిగాని వచ్చునవి కావే, ఈ పదములతోఁ గూడిన భాషనే వికృతియని చెప్పఁదలంచినచో నది యెట్లు పొసఁగును? అను సందేహములు కలుగుట కవకాశము లేకపోలేదు. దీనిని సావకాశముగఁ బరిశీలింపవలసియున్నది. పూర్వలాక్షణికులు సంస్కృతము దేవతల భాషయని, దానియందుండెడి యభి మానముచేఁ గాఁబోలును "జననిసమస్తభాషలకు సంస్కృత భాష ధరాతలంబున" అని ధరాతలంబునందలి (అనఁగా బహుశః హిందూదేశమునందలి) భాష లన్నిటికిని తల్లి భాషయే యని చెప్పఁగఁ దగినప్పు డాంధ్రభాష వికృతియనుటలో నాశ్చర్య మేమియు లేదు. ఇట్లు లాక్షణికులు సంస్కృతాంధ్రములకుఁ బ్రకృతి వికృతి భావ సంబంధమును నిరూపింప మఱికొందఱు జన్యజనకభావ సంబంధమే యని

చెప్పుచు నీ రెంటికి న భేదమును సాధించుచున్నారు. సంస్కృత భాషాభిమానముయొక్క విలాస మిట్లుండ, "ఆంధ్రవాఙ్మయ చరిత్ర" కారులు :

"కాశ్మీర దేశమునందలి శారదవుల నివసించువారు మొదలు కన్యాకుమారికడ వసించువారి వఱకు మాటల లన్నియు సంస్కృత జనితములు; కొన్ని యనాగరక జాతుల మాటలు, కొన్ని విదేశజుల మాటలు నుండవచ్చును. వానికైన వ్యుత్పత్తులు లేకపోవు. ప్రపంచ భాషలకే సంస్కృతము తల్లిభాషయనుట యసత్యమని నాకుఁ దోఁపదు" అని సంస్కృతమే ప్రపంచభాషలకుఁ దల్లియను వాదమును బలపఱుచుచు, కాశ్మీర దేశమునుండి కన్యాకుమారివఱకు వ్యవహరింపబడుచుండెడి భాషలలో నెక్కడనైన కొన్ని యనాగరక జాతుల మాటలు (ఇవి దేశ్యములా?), కొన్ని విదేశజుల మాటలునుండినచో వానికిఁగూడవ్యుత్పత్తులుండకపోవనుచు, అనఁగా నే సంస్కృత ధాతువునుండియో – ఇవి విశేషములుగఁ గలవు గావునను, "ధాతునామనేకార్థత్వా" త్తమ సూత్రసహాయముచేతను – ఏదోయొక ప్రత్యయము కలుపుటచే వ్యుత్పత్తి కల్పింపవచ్చునని సూచించిరి. ఇంతమాత్రము వారు తృప్తిఁ బొందలేదు. ఇఁక నేమనఁగా నాంధ్రభాషయే ప్రాచీన ప్రాకృతమునుండియో వచ్చినదగుటచేతను ఈ ప్రాకృతములు వేదకాలముననే గ్రంథగౌరవమంది, సంస్కృతముననే మాతృకలై నట్లగపడుటచేతను, ఆంధ్ర భాషయే సంస్కృతభాషకుఁగూడ జనని కావచ్చునని సూచించుచు, సంస్కృతభాషాభిమానముకంటెఁగూడ నెక్కుడగు మాతృ

భాషాభిమానమును వెల్లడించినారు. "కావున నా యూహచే ప్రాకృతములలో నొకటియైన యాంధ్ర భాషయు, లిపియు, నవీనభాషయగు సంస్కృతముకంటెను, దేవనాగర లిపికంటెను ప్రాచీనములని తలంచుచున్నాను. (ఆం. వాఙ్మయ చ. 26 పుట.) కావున నిట్లాంధ్రభాష ప్రపంచ భాషల కన్నిటికిని జననియగు (సంస్కృత) భాషకు జనని—వృద్ధపితామహి—యగుచున్నది. ప్రపంచ భాషల కన్నిటికిఁ గాకపోయినను ఇండో యూరోపియన్ కుటుంబమునకంతకు నీ సంస్కృతమే తల్లి భాష యయియుండునని శాస్త్రజ్ఞులు తలంచిన కాలము లేకపోలేదు. కాని సవిమర్శంబును, సువ్యాప్తంబునగు నధీతాభ్యాసము చేసినపిమ్మట పాశ్చాత్య శబ్దశాస్త్రవేత్తలీ సంస్కృత వాఙ్మయము ఇండో యూరోపియన్ కుటుంబములకుఁ జెందిన భాషా వాఙ్మయములలో నతిప్రాచీనమై, ప్రాచీన భాషా లక్షణముల నధికముగఁ జూపుచున్నను గ్రీకు, ల్యాటిన్, జర్మానిక్, ఇంగ్లీషు మొదలగు భాషలు మఱికొన్ని ప్రాచీనతరములగు లక్షణములను జూపుచున్నవనియు, దీనికిని సంస్కృత భాషకును సోదర భావమే కలదనియు, ఇవియన్నియుఁ గూడ నతి ప్రాచీనంబగు ఇండో యూరోపియన్ భాషనుండి వచ్చినవేయనియు సనిదర్శకంబుగ నిర్ధారణ చేసిరి. దీనికిఁ దగిన నిదర్శనంబులఁ జూపుట కిచ్చట నవకాశము చాలదు; కాని యొక్క విషయము మాత్రము గమనింపఁదగియున్నది. యూరపు ఖండము యొక్క పశ్చిమపుఁ గొననున్న బ్రిటిషుద్వీప నివాసుల భాషయగు నింగ్లీషుకు పెక్కువేల మైళ్ళదూరమున ఖండాంతరమం

దున్న యీ సంస్కృత భాషకును, సమీపమున నొక దేశము ననే కలసియున్న తెనుఁగుకంటె, సన్నిహిత సంబంధంబు కలదని మాత్రము వ్యక్తమగుచున్నది.

భాషల సంబంధ బాంధవ్యముల నిర్ణయించుటలో సరూపపదము లొక సాధనమనియు, నా సారూప్యము సహజమై యుండవలయునుగాని యెరవు తెచ్చుకొనుట వలన వచ్చినది కాఁగూడదనిగదా సూచింపఁబడినది. అయితే మన వాఙ్మయ చరిత్రకారులు సంస్కృతాంగ్లములకుఁ గల సంబంధముకంటె సంస్కృతాంధ్రముల సంబంధమే సన్నిహితంబని తెలుపుటకుగా "సారూప్య పదములే జన్యజనక సంబంధమును, సన్నిహితత్వమును నిర్ణయింపఁగలిగినచో నీ క్రింది యుదాహరణముల వలన నాంగ్లేయభాష తెలుఁగు కంటె సంస్కృతమునకుఁ జేరువగఁ గన్పడును" (గాని నిశ్చయముగ నట్లుకాదు.) అని వ్రాయుచు నా క్రింది యుదాహరణములలో నేరీతి పదములయందు సారూప్యము కనఁబడినచో నవి యాభాషలసహజసంబంధమును సూచించునో అట్టి పదములనే కొన్నిటిని గైకొనిరి. వానిలోఁగల సారూప్యము కేవలము యాదృచ్ఛికమే కాని కొన్నిటిలోనైనను సహజము కాదని యభిప్రాయపడినట్లు కనఁబడుచున్నది, ఇంతే కాక యిట్టి పదములయందుఁ గల సారూప్యము సంస్కృతాంగ్లముల సన్నిహితత్వమును నిరూపింపలేదని యాయన తలంచిరి గావున "సారూప్యపదము లున్నంతమాత్రమున నఱవము మన భాషకంటెఁ బ్రాచీనమైనదని కాని, మన భాషకుఁ దల్లివంటిదని కాని తలంచుటకు వీలులేదు" అని యా

పై పదముల పరిశీలనవలనఁ దేలిన ఫలితముగా నొక యపూర్వ సిద్ధాంతమును జేసిరి. ఉదాహృత పదములలోని కొన్నిటికిఁ గల సాదృశ్య మీ భాషల సన్నిహిత సంబంధము నెట్లు తెల్పుచున్నదో ముందు చూపఁబడును. ఇంతేకాక మఱికొన్నిటియందుఁ గల వైసాదృశ్య మీ భాషలకు సన్నిహిత సంబంధము లేదనికూడ నెట్లు సూచించుచున్నదో ముందే తెలుపఁబడును. మఱియొక్క విషయము గమనింపఁదగియున్నది - ఏమనఁగా సాదృశ్యము గలిగిన పదము లున్నంత మాత్రమున తమిళము తెలుఁగునకు తల్లివంటిదగునని యెవ రందురు? భాషాశాస్త్రజ్ఞు లెవ్వరు చెప్పరు. తెలుఁగు భాష అరవమునుండి వచ్చినదనుట కేవలము పొరపాటుమాట. ఈ రెండును సోదర భాషలనుటయే నిశ్చయము.

కావున భిన్న భాషలలోని యెట్టి పదముల సాదృశ్య మెంతవఱకు వాని సాజాత్యమును వెల్లడించుచు నిర్ణయించు చున్నది యను విషయమును ముందు పరిశీలించి, తరువాత వా రుదాహరించిన యింగ్లీషు పదములలోని సాదృశ్యము యొక్కయు, తెలుఁగు పదములయందలి భేదముయొక్కయు లక్షణములను చూచినవలనఁ దేలు ఫలితమును గూర్చియు విమర్శించుకొందము

భిన్న భాషల కొక్కొక్క కాలమునఁ గలిగెడి సంసర్గమువలన నొక భాష మఱియొక భాషనుండి విశేషముగా పదజాలము నెరువు తెచ్చుకొనుచుండును గావున, భాషాశాస్త్రజ్ఞుఁడు పదజాలములబట్టి భాషల సంబంధమును నిర్ణయించు తఱి, ఆ పదములను గొంత జాగ్రత్తగాఁ బరిశీలింపవలసి

యుండునని పైనం జెప్పంబడియే యున్నదిగదా! ఈ పరిశీల నములో నాతండు చేయుపని యేమనంగా, నాతండు పదజాల ములో నేవి సహజములో, యేవి యితర భాషలనుండి యెరువు తెచ్చుకొనంబడినవో తెలిసికొనుటకు యత్నించును. ఈ సందర్భమున నిజముగా భాషయనంగా నేదో మనము గుర్తింపవలసియున్నది. ప్రతిభాషయందును నేయే పదజాలము ఏయే పదవాక్య సంఘటనారీతులు సామాన్యముగా నా భాష మాట్లాడువారందరికి సులభముగా నర్థమై, నిత్యవ్యవ హారమున వారిచే వాడుకొనంబడుచున్నవో ఆ పదములే, సామాన్య పదజాలమే నిజముగా నా భాషయని చెప్పందగి యున్నది. ఇట్టి పదములు నిత్యపరిచితములగు వస్తువులు, జంతువులు. వ్యాపారములు, గుణములు, మొదలగు వానిని గూర్చి చెప్పునవియు, తల. ముక్కు. కన్ను మొదలగు నవ యవ వాచకములు, తల్లి, తండ్రి. అక్క. అన్న. మొదలగు సంబంధ వాచకములును. నేను. నీవు. వాడు, అను సర్వ నామములును సంఖ్యా వాచకములు మొదలగునవియై యుండును. కాని శాస్త్ర విషయములకు, కళలకు సంబం ధించిన పదములుగాని, మత వేదాంత విషయములకు సంబం ధించినవిగాని యీ భాషయందు కొన్నియున్నను, అవి జన సామాన్యమున కర్థమగునని కాని, ఆయా విషయములవారికం ప్రసక్తి కలిగినపుడెక్కడ యవి నిత్యవ్యవహారమునం బ్రయో గింపంబడుచుండుననిగాని చెప్పుట కవకాశము లేదు. అంత మాత్రమున నీ పదజాలమంతయు నా భాషలోనిది కాక పోదు. కాని సర్వత్ర నిత్యవ్యవహారమునమాత్ర ముండదు.

కోశములందు సంగ్రహింపఁబడిన పదజాలములో నిట్టి పదములనేకము లుండుటచే నిత్యవ్యవహారమందున్న పదముల సంఖ్య మిగుల తక్కువమై యున్నట్లు కనఁబడవచ్చును. మఱియుఁ గోశములందలి పదజాలములోఁ గొన్ని పదములొక భాషాపదములతో సాదృశ్యము గలవై మఱికొన్ని మఱియొక భాషాపదములతో సాదృశ్యము గలవైన నో నందెక్కువ పదము లే భాషాపదములతో సాదృశ్యము కలిగియుండునో యాభాషతో దీనికి సహజ సంబంధమున్న దనికూడ మనము నిర్ధారణ చేయఁగూడదు. అనఁగాఁ గేవల సదృశపదముల సాదృశ్యమునుబట్టి మాత్ర మనము భాషల సాజాత్యమును నిర్ణయింపలేమనుట. ఇంక నేమనఁగా నా సదృశ పదములు పైఁ జెప్పిన నిత్యవ్యవహారములోనివై యుండవలయును. నిత్యవ్యవహారములోనున్న పదములతోడి సాదృశ్య మే భాషతో నీపదములకు విశేషముగాఁ గలదో యా భాషకు దానితోడి సాజాత్యము కలదని నిర్ణయింపవచ్చును. కాని భాషల సాజాత్యమును నిర్ణయించి కుటుంబములుగా నేర్పఱచుటకుఁ బదముల గూర్చిన సంబంధ మొక్కటియే ప్రమాణము కాదనియు, నందలి వ్యాకరణాంశములును, వాక్యరచనా విధానమును, దీనికంటెఁ గూడ బలవత్తరమైన ప్రమాణమగుచున్నదనియు, నిదివరకే సూచింపబడినదిగదా! మన ప్రస్తుతాంశము పదముల విషయమైనది. ఇంగ్లీషులో ననేకపదము లనేక భాషలనుండి, మాటుమూలలనుండి

వచ్చి చేరినవి. ప్రపంచమునందుఁ బ్రతిష్ఠగాంచిన దేశభాషల లోఁ దన పదముల నింగ్లీషుభాష కెరువివ్వని భాషయే లేదనుట యత్యుక్తిగాదు. ల్యాటిన్, గ్రీకు, హీబ్రూ, కెల్టిక్, ఫ్రెంచి, స్పానిష్, హిందూస్థానీ, చీనాభాష, అరవము తెలుఁగు, మలయాళము మొదలగు భాషలలోని పదము లెన్నియో యా భాషయందుఁ గలసి తత్కోశములందు సంగ్రహింపఁబడినవి. తక్కిన భాషలలోని పదములమాట యటుండ, బ్యాండికూట్ (*Bandicoot*) జాగరి (*Jaggery*) జాక్ (*Jack-fruit*) మొదలగునవి తెలుఁగు, తమిళము, మలయాళములలోనుండి గ్రహింపఁబడినపదములై యున్నవి. మొత్తముమీఁద కోశములందలి 43566 పదములకును 29853 పదములు ల్యాటిన్ కుటుంబమునకుఁ జెందినవనియుఁ 13230 మాత్రమే ట్యూటానిక్ కుటుంబమునకుఁ జెందినవ నియు తక్కినవి మిగిలిన భాషలనుండి వచ్చినవనియు లెక్కలఁజూపి తేల్చిరి. ఇట్లు పదముల సంఖ్యను బట్టి మాత్రమే చూచినచో నింగ్లీషుభాష ల్యాటిన్ కుటుంబమునకే చేరి యున్నదని చెప్పవలసివచ్చును. కాని యేదైన నొక చిన్న పుస్తకమును దీసికొని అందొక పత్రమునందలి పదములను లెక్కపెట్టినచో తక్కిన భాషలమాట యటుండ, ల్యాటిన్ కుటుంబమునకుఁ జేరిన పదములకంటెఁగూడ ట్యూటానిక్ కుటుంబమునకుఁ జేరిన ఆంగ్లో-సాక్సన్ పదములే యెక్కుడుగాఁ గన్పట్టును. నిత్య వ్యవహారమందలి పదములలోఁ గూడ నాంగ్లో-సాక్సన్ పదములే కాక ప్రత్యయములు, క్రియలు మొదలగునవికూడ నీ భాషకు జెందినవేయగుటచే,

కోశమందలి లెక్క తేల్చుచున్నను. ఇంగ్లీషు భాష ట్యూటానిక్ కుటుంబమునకే చెందియున్నదని నిశ్చయింపఁబడియున్నది.

ఇట్లే యాంధ్రభాషాపదముల విషయమునఁ గూడ శబ్దరత్నాకరమందలి పదములు చూడఁగా దేశ్యపదములు 12337 అయియుండఁగా, సంస్కృతపదములు 14814 ను, తద్భవములు 2000 ను ఉన్నట్లు తెలియుచున్నది. ఇట్లు తెలుఁగులోని సంస్కృత పదములు దేశ్య పదములకంటె నెక్కుడుగాఁ గన్పడుటచేఁ దెలుఁగు సంస్కృతము నుండి వచ్చినదిగనే కన్పడును. కావుననే సంస్కృతభాషా పండితులు. దానియందు విశేషాభిమానముగల ప్రాచీనాంధ్ర వైయాకరణులందఱు నిది సంస్కృతమునుండి పుట్టిన భాషయే యని చెప్పుటకూడ కటస్థించినది. సంస్కృత పదములేకాక యింక ననేక భాషలనుండి యనేక పదములు తెలుఁగులో వచ్చి చేరినవి. అయితే యింతమాత్రమున వాఙ్మయకర్తలు చెప్పినట్లు "నూటికి నేబదికంటె నధికముగఁ దత్సమ పదములు, నూటికి 15 వంతునఁ దద్భవములు, నూటికి 10 వంతున వైకృతములు, 4 వంతున తురక పదములు, 5 వంతున నాంగ్ల పదములు నిజముగఁ దీసివేసికొనుచు వచ్చుచున్న యెడలఁ దెలుగు భాషయే శూన్యమగును" అను భయమెంతమాత్రము మనము పడవలసిన యవసరములేదు. నిత్యవ్యవహారములోనుండి సుమారు రెండుకోట్ల జనులచే మాట్లాడఁబడుచుండెడి భాష హఠాత్తుగా శూన్యమగుట యెట్లో తెలియకున్నది. ఇట్లే మైసూర్ భూభాగమం దనేక ప్రదేశముల వ్యాపించి యెక్కువవ్యాప్తి కలదని చెప్పఁబడు

చున్న ఇంగ్లీషుభాష యింతకంటె శూన్యమైనది కావలసి వచ్చునే! ఒకభాష మాటలాడుజాతి లేక సంఘమంతయు అల్పసంఖ్యాకంబై హఠాత్తుగా నశించుట సంభవించినఁ గాని, లేక, కారణాంతరములచే వారు తమకుఁ బరిసర ప్రదేశములఁగల మఱియొకభాష నవలంబించి, మాతృభాష యందలి అభిమానమును బొత్తుగా విడుచుట తటస్థించిన గాని భాషకు నాశమను నది కలుగఁజాలదు. మఱియు నొక్కొక్కప్పుడు గ్రాంథిక భాషకును వ్యావహారిక భాషకును విశేషభేదము కలిగి కాలక్రమమున నా గ్రాంథికభాష వ్యవహారమునుండి తప్పిపోయి వ్యాకరణ నియమ బద్ధమై మార్పులేక అభివృద్ధిఁబొందుటకు వీలులేని స్థితిలోనికి వచ్చినచో నద్దానిని మృతభాష (*Dead language*) యని చెప్పుట కలదు. సంస్కృతము, ప్రాచీన ల్యాటిన్ మొదలగు భాషలిప్పుడు నిత్యవ్యవహారములో నంతగా లేనివై క్రొత్తమార్పులకు లోఁబడని వగుటచేఁ గొందఱు వీనిని మృతభాషలని చెప్పుదురు. మార్పు అభివృద్ధి యను నవే భాషయొక్క సజీవత్వమును వ్యక్తపఱచునవగుటచే నొకభాష యితర భాషాపదముల నెరువు తెచ్చుకొని వానిని స్వసంప్రదాయానుసారముగ మార్పులనొందించితనలోఁగలు పుకొనుచుఁ దానభివృద్ధినొందుచున్నప్పుడాభాషనశించునని తలంచుట కవకాశము లేదు. ఒకవేళ నితర భాషలనుండి యెరువు తెచ్చుకొనిన పదము లీ భాషకు సహజములగు పదములను గొన్నిటిని నిత్యవ్యవహారమునుండి పారఁద్రోలినఁ ద్రోలవచ్చును గాని యంతమాత్రమున నా భాషాతత్వమే

మాఱుననిగాని యది నశించుననిగాని తెలుప వీలులేదు. తెలుఁగున 'విందు' శబ్దమునకొక విశేష్యము కలదు. దీనికి చుట్టములు మొదలగువారికిఁ బెట్టెడు భోజనము అనియు, ఆతిథ్యమనియు నర్థములు కలవు. ఇంతేగాక ఇది చుట్టము. 'అతిథి' యను నర్థములగూడ మును పు వాడుకలో నున్నట్లు క్రింది యుదాహరణమువలనఁ దెలియుచున్నది.

"... భూసురేశ్వరు ప్రీతిఁ
బొందితి నినుఁగని పోయెదు
విందవయితె నాకు ... "

భార. శాం. 3 ఆ

క. భూసుర కైతవపసుమశ
రాసన మాయింటివిందు వైనిది కైకొ
మ్మా సముదంచన్మణిభవ
నాసీనత సేవదేరి యాలెక్కంబున్ మను. 2 ఆ.

కాని యిప్పు డతిథి శబ్దము వాడుకలోనికి వచ్చుటచేఁ గాఁబోలు నీ 'విందు' శబ్దమున కిట్టి వ్యవహారము తప్పిపోయినది. మన బంధుమిత్రుల కిప్పుడు 'విందు' చేయుట కలదుగాని వారిని 'విందుల'ని పిలుచుట వ్యవహారమున గానము. ఇట్లే తమిళమున 'కక్షు' శబ్దభవము వాడుకలోనికి వచ్చిన తర్వాత 'చంక' పదమునకుఁ బ్రాచీన రూపమగు 'కైక్కుళి' యనునదిగాని, దానినుండి వచ్చిన పదముగాని యా భాషయందంత వాడుకలో లేదు. పరిశీలించి నచో నింక నిట్టి వనేకములు గన్పడకపోవు.

ఇట్లొకవేళ భాషకు సహజములగు పదము లనేకములు వ్యవహారమునుండి తొలఁగిపోవుట తటస్థించినను, అందలి వాక్యరచనా రీతులు, వ్యాకరణాంశములు, జాతీయములు మొదలగు భాషాసాంప్రదాయము లా భాషయొక్క వ్యక్తిత్వమును నిలుపుచు నది సహజముగ నే కుటుంబమునకుఁ జెందునో సూచించుచునే యుండును. లేనిచో మనుచరిత్ర యందలి

"అటఁజని కాంచె భూమిసురుఁ
డంబరచుంబి శిరస్సరర్ఝరీ
...............కలాపిజాలమున్
కటకచరత్కరేణుకరకంపితసాలము
శీత శైలమున్"

మొదలగునవి కొన్ని సంస్కృతపద్యము లేమోయని భ్రమపడుట కవకాశము లేకపోలేదు కాని మొదటి అట, చని, కాంచె యను పదములును, తరువాతి దీర్ఘసమాసముల తుదినున్న 'ము' ప్రత్యయములు నీ పద్యము తెలుఁగు పద్యమనియే కాని సంస్కృతభాషాపద్యము మాత్రము కాదని సూచింపఁగలవు. అట్లే "మాకు *necessary things* అన్నీ *supply* చేయడానికి ఒక *cooly* ని *engage* చేసినాము" అని యిప్పుడు మనము సామాన్యముగా వినుచుండెడి 'ఇంగ్లీషు-తెలుఁగు' వాక్యములలో నింగ్లీషు పదములే విశేషముగఁ గనబడుచున్నను, ఇందలి సర్వనామములు, సుప్తిఙాది ప్రత్యయములు, సహాయ క్రియలు

(*auxiliary verbs*) వాక్యరచనారీతి మొదలగునవన్నియు, అనఁగా నెరువు తెచ్చుకొనిన యాపదముల నర్థబోధకంబగు నొక వాక్యములో నుపయోగపఱచుకొనుటకు వలయు సాధనములన్నియు, నాంధ్రభాషకు సంబంధించినవే యగుటచే నిది యాంధ్రభాషావాక్యమే యగుచున్నది. కాని యాంగ్లభాషా వాక్యమనుటకు వీలు లేకున్నది. కావుననే భాషాకుటుంబముల నేర్పాటుచేయుటలో, అనఁగా నే భాష యే కుటుంబమునకుఁ జెందు నను విషయములోఁ బదములకంటెఁ గూడ బలవత్తరములగు ప్రమాణము వ్యాకరణాంశములే యగుచున్నవనియు, నొక భాషకు సహజములగు పదము లితర భాషాపదముల దాడికాఁగలేక వ్యవహారము నుండి తప్పిపోయినను, ఆ భాషయొక్క వ్యాకరణాంశములే దాని నిజతత్త్వమును, సంబంధ బాంధవ్యములను గూర్చి తప్పక తెలుపఁగలుగుననియే భాషాతత్త్వవేత్తలు తెలుపుచున్నారు.

*"This is the reason why grammar is made the criterion of the relationship, and the base of the classification in almost all languages. We may form whole sentences of English consisting entirely of Latin or Romanic words, yet whatever there is left of grammar in English bears unmistakable traces of Teutonic workmanship."*

ఇట్లు వ్యాకరణాంశములందలి సామ్యమే భాషల సంబంధ బాంధవ్యములనుఁ దెల్పుటలో పరమ సాధనమగుచున్నది. భాషకుఁ బరస్పరము గలిగెడి సంసర్గముచే నొక

దానినుండి మఱియొకటి యెన్నియేని పదముల నెరవు తెచ్చుకొన్నను వ్యాకరణాంశములనుమాత్రమే భాషయు నెరవు తెచ్చుకొనుట సంభవింపదు. అన్యభాషాసంసర్గముచే వేదభాషయందువలె వ్యాకరణాంశములందుఁ గొన్ని మార్పు లేమైన కలుగుటగాని లేక యనవసరములైన యంశము లేమైనఁ గొన్ని లోపించుటకాని తటస్థింపవచ్చును. ప్రాచీనంబగు 'ఇండో-యూరోపియన్' భాషయందలి విభక్తి రూపములు (సంస్కృత భాషలోవలె) నేడు గ్రీకు మొదలగు భాషలలో సంక్షిప్తములగుటయు, (గ్రీకులో నేడు సప్త విభక్తులు లేవు. మూఁడే విభక్తులు) వైదికభాషలో తుము న్నర్థ రూపములు (*infinitives*) అనేకములై యుండ (cf. "తుమర్థేసేసేనసే అసేన్ క్సేకసే నధ్యై అధ్యైన్, కధ్యైన్, శధ్యై శధ్యైన్, తవైతవేఙ్ తవేనః" పాణిని అష్టాధ్యాయి) కాలక్రమమున నివియన్నియు వ్యవహారము నుండి పోయి, యొక్క తుమున్నంతమే మిగిలియుండుటయు, లేడాది (*subjunctive mood*) తిఙంతరూపములుగూడ వ్యవహారమున జారిపోవుటయు, నీ మొదలగు మార్పులన్నియు నన్య భాషా సంసర్గ ఫలితములే కావచ్చును. కాని వ్యాకరణము మాత్రము క్రొత్తది కాదు.

*"It is almost unanimously admitted by philologists that however large a borrowing of foreign vocables may take place, there is no satisfactory evidence that foreign grammar is ever borrowed to any appreciable extent by a truly live and spoken language"* (*Tucker's Natural History of Language.*)

కావున భాషల సంబంధ బాంధవ్యమును నిర్ణయించుటలో పదముల సారూప్యముకంటెనుఁ గూడ వ్యాకరణాంశములందలి పోలికయే యుత్తమసాధనమని తేలుచున్నది. ఇంత మాత్రముచేఁ బదపరికరమువలనఁ గలుగుప్రయోజనమేమాత్రము తగ్గదు. సామాన్యముగా భాషలకు సంబంధ మున్నదని తెలిసికొనుట సారూప్యపదసహాయముననే జరుగుచుండును. రెండు భాషలయందొకే యర్థముగలిగి సరూపములగు పదములు కొన్ని కనఁబడినపుడే యాభాషల కేమైన సంబంధము కలదేమో చూడవలయు నను కుతూహలమును, అట్టి వింక నెన్నికలవో వానిని సంగ్రహింపవలయు నను తలంపును గలుగును. పిదప నివి నిత్యవ్యవహారమున నుండి యందఱకుఁ దేటతెల్లంబుగ నర్థంబగు పదములే యైనచో నీ భాషల సహజ సంబంధమును స్థిరముచేసికొనుటకు, వ్యాకరణాంశముల పరిశీలన యావశ్యకంబగును. కావున పదముల సారూప్యవిషయమైన పరిశోధన ఫలరహితము గాదు. కాని పరిశీలించునపు డాయా సారూప్య మెట్టి పదములలోఁ గన్పడుచున్నది యను విషయమును మాత్రము దృష్టియందుంచుకొనవలయును.

ఇంతేకాక భిన్నభాషలలోని పదముల సారూప్యమును బట్టి వాని సాజాత్యము నిశ్చయించునపుడు మఱియొక విషయమును గూడ మన దృష్టిపథమున నుంచుకొనవలెను. ఒక మూలభాషయందలి ఒక పదము కేవలమా రూపముననే తజ్జన్యభాషయందు కూడ నగపడుచుండు

నని తలంచుట కవకాశము లేదు. ఒక్కచో నివసించుచు నొక్కభాష మాట్లాడువారిలోనే కొందఱొక ధ్వని నొక రీతిగను మఱికొందఱు మఱియొక రీతిగను నుచ్చరించు చుందురు. కావున నొక్క మూలభాషనుండి వచ్చినవై నను కాలక్రమమున భిన్నములైన యా యా భాషలను మాట్లాడు వారి యభ్యాసవిశేషములను బట్టియుం గొన్ని కొన్ని ధ్వనుల యుచ్చారణ విషయమున వారికిం గలుగు వికారపు టలవాటులను బట్టియు, మూలభాషకుం జెందిన యొక పదములోని ధ్వనులే యనేకవిధముల మారు చుండును గావున. నాయా భాషలలో నాపద మొకప్పుడు విశేష పరిశీలనవలనంగాని గుర్తించుటకు వీలు కాకయుండును. కావున నాయా వికారములను దెలిసికొని తదనుగుణంబుగ నా యా పదముల సాదృశ్యమును నిర్ణయింపవలెను. ఒక కాలమున నొక రీతిగ నుచ్చరింపఁబడిన పదము మఱికొంత కాలమునకు మఱియొకరీతి నుచ్చరింపఁబడి వేఱొక రూప మును బొందవచ్చును. సంస్కృతమునందలి 'పితా' 'పితృ' లేక 'పితర్' అను శబ్దము కలదు. దీనికి మూలభాషయందలి మూలరూపము 'పెటేర్' (Peter) అనియుండెనని గ్రీకు, ల్యాటిన్ భాషలలో విశేష భేదములేక (Pater, Peter) అనియు, సంస్కృతమున 'పితర్' అనియు (ఇందు మొదటి 'అ' కారము 'ఇ' కారముగ మారినది) నుచ్చరింపఁబడఁగా గాథిక్ భాషలో *fadar* అనియు ఆంగ్లో-సాక్సన్ భాషలో '*faedar*' అనియు నైనది. తుద కింగ్లీషు భాషలోని (*Brother*) శబ్దసామ్యముచే *father* అను రూపమును బొందినది.

ఇట్లే, సంస్కృత పదములు తెలుఁగులోనికి వచ్చినప్పు డనేక మార్పులఁ జెందినవి. యజ్ఞంబు జన్నంబైనది. యత్నము జతన మైనది. యంత్రంబు జంత్రంబు; యముఁడు జముఁడు; యక్షులు జక్కులు; యోధు జోదు; శాణము సాన; శవము సబము; యశము అసము; దోషము దోసము; రోషము రోసము, భాష బాస; ఇత్యాదు లనేకములు గలవు. సమానార్థకములగు పదములలో తమిళమున 'క'కారము కన్పడిన కొన్ని పదములలోఁ దెనుఁగున 'చ' కారము కన్పడుచున్నది. తమి, కివి, తె. చెవి; గిళి—చిలుక; కెయి—చేయి; కెంబొన్—చెంబు. ప్రాచీన ద్రావిడభాష యందలి కైక్కళి యను పదము కైజ్కళి, చైంకళి, చంకళి, చంకల్, అయి తుదకు 'చంక' అను రూపమున నిప్పుడాంధ్రమున వ్యవహారములో నున్నది. ఇట్లే యొక్కొక్క విధమగు మార్పు అనేకములగు పదములలోఁ గన్పడుచుండును. ప్రాచీన ద్రావిడ భాషలోను తక్కిన ద్రావిడ భాషలన్నిటిలోను, ప్రాచీన కన్నడమునను గూడ నున్న యనేక పదములలోని 'ప' కార మాధునిక కన్నడ భాషలో 'హ'కారముగ మాఱినది. పొన్ను—హొన్ను; పాలు—హాలు; పసరు—హసిరు; పది—హది.

ఒక భాషలోని పదము లనేకింటిలో నిట్టి మార్పులు నియతముగ పొడసూపుచుండుటచే నది యా భాషను మాట్లాడుజనుల యుచ్చారణకు సహజంబగు నొక వికారమని చెప్పవలసినదేకాని వేఱువిధమున దానిని సమర్థింప వీలులేదు. కావున ననేక పదములను బరిశీలనచేసి యాయా

భాషలయం దిట్టి వికారములను గుర్తించి యొకధ్వని యా యా భాషలయం దాయా కాలముల నాయా వికారముల బొందుచున్నదని నిరూపించినచో, సోదర భాషలయందుఁ గల సజాతీయ పదములయందలి యత్కించి ద్భేదములు సహేతుకములుగనే కన్పడును. ఇట్టి ధ్వని వికారములఁ గూర్చిన నిరూపణములనే స్వరసూత్రములు లేక స్వర నియమములు (*Phonetic laws*) అని చెప్పుదురు. ఈ స్వర నియమముల కపవాదములు అనఁగా నీ నియమములను దాటిపోయిన పదములు భాషలో నుండిన నుండవచ్చును గాని, యవి యట్లు దాటిపోవుటకును గారణము లుండకపోవు. ఆ కారణముల నన్వేషించి వానిని సహేతుకముగ సమర్థించుట భాషా శాస్త్రజ్ఞుని పనియై యున్నది.

దీనిని బట్టి యొకవేళ నొక పదము సోదర భాష లన్నిటిలో నొకేరూపము కలదై యుండకపోయినను, అనఁగా సారూప్యము గలదిగాఁ గన్పడకపోయినను అవి యా యా భాషల స్వరనియమములకు లోఁబడి యుండినచో నాపదముల సోదర భావమును గూర్చి మనము శంకింప నవసరము లేదు అని తేలుచున్నది. కావున పితర్ *father*; మాతర్, *mother*; అశ్వ, *horse*; కిళి–గిళి–చిల్క, కిబి–చెవి; కంకుల్–చంక, మొదలగు పదముల సహజ సంబంధము లేక సోదర భావమునుగూర్చి శంకింప నక్కర లేదు. ఒక్కొక్కప్పుడు సహజ సంబంధము లేని భాషలలో నక్కడక్కడ కొన్ని పదములు సరూపములును, సమానార్థకములునై కన్పడుటయుఁ గలదు. అట్టివి ఆంగ్లమున *prop*, తెలుఁగు ప్రాపు; *mouth*,

మూతి మొదలగునవి. ఆంగ్లమునందే విశేషణ, విశేష్య భావ ములను దెల్పెడి 'sorry' (విచారకరమైన) sorrow (విచారము) అను రెండు పదములు సమానార్థకములై కన్పడినను వాస్తవముగ నా రెండు నొక్క మూలరూపమునుండి వచ్చినవికావు. కావున పదములయందలి కేవల సారూప్యమే దాని సాదృశ్యము నెల్లప్పుడు దెలుపునని కూడ తలంచుటకు వీలులేదు. యత్కించిద్భేదము కలదైయున్నను, ఆ పదముల యందలి భేదము లా యా భాషలయందలి స్వరనియమములకు లోబడియుండి. వాని రూపనిష్పత్తి క్రమమును పరిశీలించినప్పుడవి యొక్క మూలరూపము లేక ధాతువు నుండియే యేర్పడ్డవైనట్లు తెలియవచ్చినచో నా పదముల సాజాత్యమే కాక వానిమూలమగు నా భాషల సంబంధ బాంధవ్యములు కూడ నిశ్చయింపఁదగియుండును.

ఇఁక (నెట్టి) పదములందలి సారూప్యము (కూడ) భాషల జన్యజనక సంబంధమును, సన్నిహితత్వమును నిర్ణయింప లేవనియు, అవి యట్లు నిర్ణయింపగలిగినచో నీ క్రింది యుదాహరణములఁ బట్టి యాంగ్లేయ భాష తెలుఁగుకంటె సంస్కృతమునకుఁ జేరువగఁ గనఁబడునని చెప్పవలసి వచ్చుననియుఁ జెప్పుచు, నాంధ్ర వాఙ్మయ కర్తలు గైకొనిన యుదాహరణములనే గ్రహించి యా పదముల పరస్పర సంబంధమెట్టిదో పరిశీలించి దానివలనఁ దేలు ఫలితమును విచారింతము. ఆ యుదాహృత పదముల పట్టిక నీ క్రిందఁ బొందుపఱచుచుఁ, దెనుఁగు పదముల ప్రక్కను తమిళ కన్నడ పదములను గూడ నిచ్చుచున్నాను.

| ఇంగ్లీషు | సంస్కృతము | తెలుఁగు | తమిళము | కన్నడము |
|---|---|---|---|---|
| *Father* (ఫాదర్) | పితర్ | తండ్రి | తందై | తందె |
| *Mother* (మదర్) | మాతర్ | తల్లి | తాయి | తాయి |
| *Brother* (బ్రదర్) | భ్రాతర్ | అన్న | అణ్ణన్ | అణ్ణ |
| *Horse* (హార్స్) | అశ్వ | గుఱ్ఱము | కుదిరై | కుదిరె |
| *Heart* (హార్ట్) | హృదయ | గుండెకాయ | | గుణ్డిగె |
| *Debauchery* (డిబాచరీ) | వ్యభిచార | అంకుతనము | | |
| *Book* (బుక్) | పుస్తక | పొత్తము | పుత్తగం | పుస్తగం |
| *Orange* (ఆరెంజ్) | నారంగ | నారింజ | నారంగ | నారంగ |
| *Pot* (పాట్) | పాత్ర | కుండ | | కుంబొ, కుండె |

పై పట్టికలోని పదములు తొమ్మిదింటిలో మొదటి మూఁడును బాంధవ్య రూపసబంధమును (*Relationship*) తెలియఁజేయు పదములు. నాలు, గైదు, తొమ్మిది పదములు మనకు పరిచితములగు వస్తువులను గూర్చి తెలుపునవి. ఎనిమిదవ పద మీ భాష లన్నిటిలోనుగూడ మఱియొక భాష నుండి ఎరువుగాఁ దెచ్చుకొనఁబడిన పదము. ఏడవది సంస్కృతమునుండి తెలుఁగు, తమిళ, కన్నడములలోని కెరువుగా వచ్చినది. ఆఱవపదముయొక్క వ్యుత్పత్తి సందేహాస్పదమగుటచే నింగ్లీషు నంస్కృతరూపములతోఁగల పోలికయాదృచ్ఛికమని చెప్పవచ్చును. కావున నీపైనఁ జూపఁబడిన సంస్కృత పదము లన్నిటి కాంగ్ల పదములతోఁ గల సారూప్యము కేవలము యాదృచ్ఛికమని కొట్టివేయుటకుఁ గాని యా కారణమున సంస్కృతాంగ్లములకు సంబంధము లేదని తలంచుటకుఁగాని యాధారము కనఁబడదు.

తల్లి, తండ్రి. అన్న యను సంబంధ వాచకములను బాలురు పిన్ననాఁటనే నేర్చికొని వ్యవహరించుచుందురు. కావున నిట్టి ప్రథమ సంబంధములనుఁ దెలియఁజేయు పదములు ప్రతి భాషకును సహజములై యుండును. సామాన్యముగా నట్లత్యవసరములై నిత్యవ్యవహారములో నుండు పదము లితర భాషలనుండి యెరువు తెచ్చుకొనుట సంభవింపదు. కావున నిట్టి పదములలోఁగల సారూప్య మాభాషల సోదరభావమునే సూచించునని యింతకుఁబూర్వమే చెప్పఁబడినదిగదా! పై పట్టిలోని మొదటి మూఁడు పదము లిట్టి సంబంధమును తెలియఁజేయున వగుటయు, నివి యొక్క

సంస్కృతాంగ్లముల యందే కాక ఇండో-యూరోపియన్ కుటుంబమునకుఁ జెందినవిగాఁ జెప్పఁబడిన భాషలన్నిటిలోఁ గూడ సమానరూపము గలవియు నగుటచే సంస్కృతాంగ్ల పదములందు గన్పట్టిన సారూప్యము యాదృచ్ఛికమని గాని, దానివలన నీ భాషలకు జన్యజనక భావ సంబంధముగాని, సోదర భావ సంబంధముగాని లేదని నిశ్చయించుట కేమాత్రమును వీలులేదు. తక్కిన భాషలలో నీవి రూపముల నిచ్చుటఁ జూపుచున్నాను—

| ఇంగ్లీషు | సంస్కృతము | లాటిన్ | గ్రీకు | గాథిక్ |
|---|---|---|---|---|
| *Father* (ఫాదర్) | పితర్ | *pater* (పతెర్) | *Pater* (పతేర్) | *Fadar* (ఫదర్) |
| *Mother* (మదర్) | మాతర్ | *Mater* (మాతెర్) | *Mater* (మాతెర్) | *Mouter* మాతెర్ |
| *Brother* (బ్రదర్) | భ్రాతర్ | *Frater* (ఫ్రటర్) | *Phrater* (ఫ్రటేర్) | *Brothar* బ్రోథర్ |
| *Horse* (హార్స్) | అశ్వస్ | *Equos* (ఎక్వాస్) | *Hippos Ihkos* (ఇక్కోస్) | *Aih-va* (ఎయిహ్వా) |
| *Heart* (హార్ట్) | హృదయ | *Cord* (కోర్డ్) | *Kardia* (కార్డియ) | *Hairto* (హైర్టొ) |

ఆ యా భాషలలోని కొన్ని పదములు యత్కించి ద్భేదములు కలవై యున్నట్లు కన్పడినను, అవి యా యా భాషకు స్వాభావికములగు స్వరనియమముల (*Phonetic. laws*) ననుసరించి యున్నవే యగుటచే వాని సోదర్యమును గూర్చి శంకింప నవసరము లేదు. పై పదములన్నియు ఇండో యూరోపియన్ కుటుంబములోని భాష లన్నిటిలో సమానా ర్థకములై కన్పడుచు, సంస్కృత భాషకు (లేక ఆర్యభాషా శాఖకు) సోదరియగు జర్మానిక్ భాషాశాఖకుఁ జెందిన గాథిక్ భాషనుండి ప్రాచీనాంధ్రభాషామూలముగా నాధుని కాంగ్ల మునఁ జేరినవి. కావున నాంగ్ల భాషకు సంస్కృతము వృద్ధ మాతామహియగునని చెప్పవచ్చును. పదముల యందలి సారూప్యము సూచించిన యీ భాషల యేక కుటుంబత్వము వ్యాకరణాంశములు కూడ దృఢపఱచుచున్నవి.

| సం. | గ్రీ. | లా. | గా. | ఇంగ్లీషు. |
|---|---|---|---|---|
| భరా(మి) | *Phero* (ఫెరో) | *Fero* | *Baira* | *Bear* |
| భరామః | *Pheromes* (ఫెరోమెస్) | *Ferimus* | *Bairam* | |
| భరన్తి | *Pheronti* (ఫెరోంతి) | *Ferunt* | *Bairand* | |
| అస్తి | *Esti* (ఎస్తి) | | *Ist* | *Is* |
| అశ్వస్ | *Hippos* (హిప్పోస్) | *Equos* | | |
| అస్వం | *Hippon* (హిప్పాన్) | *Equom* | | |
| అశ్వాయ | *Hippoi* (హిప్పోయ్) | *Equi* | | |
| అహం | *Ego(n)* (ఎగో(న్)) | *Ego* | *Ik* | *I* |

ఇట్టి క్రియారూప నామరూపములయందును (అనఁగా తిఙంతములయందును, సుబంత రూపముల యందును) సర్వనామముల యందును, ఆయా ప్రత్యయముల యందును గన్పడుచున్న పోలికలనుబట్టి యీ భాషలన్నియు నొక మూలభాషనుండి వచ్చినవేయని చెప్పకున్నచో, నా పోలికలకుఁ దగిన కారణమును మనము నిరూపింపలేము. వీనిలో నొక భాషకు మఱియొక భాషకు బాంధవ్యము దగ్గర కావచ్చును, దూరమును కావచ్చును; కాని యివి యన్నియు నొక కుటుంబమునకుఁ జేరినవి యని మాత్రము నిశ్చయించుటకు సందేహ మక్కఱలేదు. ఇట్టి పోలికలు హిందూదేశము మొదలుకొని ఐరోపాఖండమందలి పడమటికొనవఱకుఁ గల భూభాగములో వ్యవహరింపఁబడుచుండెడి భాషలు లేక భాషాశాఖ లన్నిటిలో అనఁగా ఆర్య భాషాశాఖ, ఆర్మీనియన్, ఆల్బేనియన్, బాల్టో-స్లవోనిక్, ఇటాలిక్, జర్మానిక్, గ్రీక్, కెల్టిక్ అను భాషాశాఖ లన్నిటిలోఁ గన్పడుచుండుటచే, నీ భాషా శాఖల నన్నిటికిని "ఇండో - యూరోపియన్" భాషా కుటుంబమని భాషాశాస్త్రజ్ఞులు నామకరణము చేసినారు. ఇట్లే ఆయా భాషల యందుగల పోలికలను బట్టి ఇండో - యూరోపియన్ కుటుంబముకాక యట్టివి 'సెమెటిక్,' 'ఊరల్ ఆల్టాయిక్,' 'మలయోపోలినీషియన్,' 'బాంటు.' 'ద్రావిడ భాషాకుటుంబము,' ఈ మొదలగు భాషా కుటుంబములు లేర్పరుపఁబడియున్నవి.

ఈ ద్రావిడ భాషాకుటుంబములో మొదటినుండియు దక్షిణ హిందూదేశమున వ్యవహరింపఁబడుభాష లన్నిటితో పాటు తెలుఁగుభాషయుఁ జేరియున్నది. ఈ ద్రావిడ మేభాషా వర్గమునకుఁ జేరవగా నున్నదియను విషయమున భిన్నాభిప్రాయము లున్నను తెలుఁగు తమిళము మొదలగునవి యన్నియు నొక్క కుటుంబములోఁ జేరుననుటలో మాత్రము పలువు రేకాభిప్రాయులై యున్నారు. సంస్కృతాంగ్లము లొక్క కుటుంబమునకుఁ జెందియున్నవని యెట్టి సాధనముల వలన గ్రహింపఁబడినదో యట్టి సాధనములే యీ దక్షిణ హిందూ దేశ భాషలన్నియు నొక్క కుటుంబమునకుఁ జెందినవై సోదరభావమును వహించియున్నవని సూచించుచున్నవి. పై పట్టికలోని సంస్కృతాంగ్ల పదములయందుఁ గల సారూప్యమును బరిశీలించి చూచినపు డెట్లది వాని సన్నిహితత్వమును దెల్పునదయ్యెనో, అట్లే యీ సంస్కృత పదములతో సమానార్థకములైనను శుద్ధ వైరూప్యమే కలవగుటచే వానితో నెట్టి సంబంధము నున్నదని చెప్పుటకు వీలులేని తెలుఁగు పదముల కరవ కన్నడ పదములతోఁ గల సారూప్యమే యీ భాషలకుఁ గల సన్నిహిత సంబంధము లేదా ఏక కుటుంబత్వమును సాధించుచు నివి సంస్కృతాంగ్లములకంటె భిన్నమగు భాషాకుటుంబమునకుఁ జేరియున్నవని తెల్పుచున్నది. పై పట్టికలోని పదములే గాక నేను, మనము; నీవు, వాఁడు; తమి. నాన్, నామ్; నీన్, అవన్; కన్న. నాను, నావు, నీను, అవను; అను సర్వనామ రూపములును; తెలుఁగు ఒండు, మూఁడు పది; తమి. ఒన్రు, మూన్రు, పత్తు;

కన్న. ఒందు, మూరు, పత్తు (హాత్తు) అను వి మొదలగు సంఖ్యావాచక శబ్దములును, చేయుచున్నాను, చేసితిని, చేయును. చేయ(న్), చెయ్యి, తమి. శెయ్గింన్రేన్. శెయ్దనెన్, శెయ్గుమ్. శెయ్య, శెయ్. కన్న. గెయ్దపెం. గెయ్దమ్, గెయ్వం, గెయ్య, గెయ్ మొదలగు క్రియా రూపములును, ఆయా రూపముల నిష్పత్తి క్రమమునుగూడ నీ భాషలన్నియు నేక కుటుంబమునకుఁ జెందిన వను విషయమునే ధ్రువపఱచుచున్నవి. అయితే యీవన్నియు నొకకుటుంబమునకుఁ జెందినవని చెప్పినంతమాత్రముననే యొకటి రెండవదానికంటెఁ బ్రాచీనమనిగాని, యొకదాని కొకటి తల్లివంటిదనిగాని చెప్పినట్లుగాదు. ఏక కుటుంబత్వము, సన్నిహిత సంబంధము నిరూపించినంత మాత్రమున జన్య జనక భావము నిర్ధారితమైనదని లెక్కించుట కవకాశ మెంతమాత్రమును లేదు. ఇవన్నియుఁ బ్రాచీనంబగు మఱియొక భాషనుండి వచ్చినవై సోదరీభావమునే వహించియుండవచ్చును. అట్టివమున నొకవేళ ప్రాచీనతరంబగు వాఙ్మయము గాని, ప్రాచీన భాషాలక్షణములుగాని తక్కిన వానికంటె నెక్కుడుగా నున్నను, అది తక్కిన వానికి తల్లిభాష కానేరదు. కొన్ని విషయములలో నది గొన్ని ప్రాచీనభాషాలక్షణములఁ జూపుచుండ మఱికొన్ని విశేషములు తక్కినభాషలు చూపుచుండవచ్చును. పదములలోను వ్యాకరణాంశముల యందును సంస్కృతాంగ్లములకు సన్నిహితత్వము నిరూపింపఁబడినను, ఇంగ్లీషు సంస్కృతమునకుఁగాని, సంస్కృత మింగ్లీషునకుఁగాని తల్లియని చెప్పుట కెట్లు సాధ్యపడదో, అట్లే తమిళాంధ్రముల

యందలిపదముల సారూప్యమును, వ్యాకరణాంశముల యందలి సామ్యమును, వాని సన్నిహితత్వమును లేదా బాంధవ్యమును నిశ్చయింపగలుఁగునే కాని, అంతమాత్రమున నొకదానినుండి మఱియొకటి పుట్టినదని చెప్పుట కవకాశము లేదు. ఆయా భాషల పరస్పర సంబంధ మిట్టిదని నిరూపించుట కా భాషా చరిత్రలు బాగుగఁ బరిశీలింపఁబడవలయును. ఇతర నిదర్శనము లనేకములు కావలయును. ఇండో - యూరోపియన్ భాషా కుటుంబము విషయమున జరిగిన యపారంబగు భాషా పరిశ్రమ యీ దక్షిణ దేశ భాషల విషయమున జరుగ లేదు. కనుక, యట్లు జరిగినచో నీ భాషలన్నిటికి మాతృ భాష యేదో, యెట్టి స్వరూపము కలదో నిరూపించి, వీనిలో వీనికిఁగల పరస్పర సంబంధ మిది యని మనము నిరూపింప గలిగియే యుందుము. కావున మాతృ భాషాభిమాను లందఱు దీని విషయమునఁ దగిన పరిశ్రమను జేయుదురుగాక!

